ఎన్. ఎస్. కృశ్చెవ్

# పార్టీకీ, ప్రజలకూ ఒక నివేదన

సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ 22వ
[illegible]సభకు సోవియట్ దేశ కమ్యూనిస్టు
పార్టీ కేంద్ర కమిటీ నివేదిక

అక్టోబరు 17, 1961

సోవియట్ భూమి అనుబంధం
సంచిక 23, డిసెంబరు 1961.

ఎన్. ఎస్. కృశ్చెవ్



# పార్టీకీ, ప్రజలకూ ఒక నివేదన

సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ 22వ మహాసభకు సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ నివేదిక

అక్టోబరు 17, 1961

సోవియట్ భూమి అనుబంధం

సంచి- 23, డిసెంబరు 1961.

ఈ ప్రచురణలోని పాఠం సోవియట్ నొవాస్తి సమాచార శాఖచే సిద్ధపరచబడిన అనువాద పాఠాన్ని అనుసరించి వున్నది.

---

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచార శాఖ, 25, బారాఖంబా రోడ్, న్యూఢిల్లీచే ప్రచురితం; పంజాబీ ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ-6 చే ముద్రితం.

II



III సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రథమ కార్యదర్శి ఎన్. ఎస్. కృశ్చెవ్ 22వ పార్టీ మహాసభకు నివేదికను సమర్పిస్తోన్న దృశ్యం.

# విషయసూచిక

కామ్రేడ్స్,

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 20వ మహాసభ, జరిగి ఇప్పటికి సుమారు ఆరు సంవత్సరాలు గడిచి పోయాయి. గడిచిన యీ సంవత్సరాలు, మన పార్టీకి, సోవియట్ ప్రజలకు, సమస్త మానవాళికి అసాధారణమైన, బహుళా చారిత్రకమైన, ప్రాధాన్యత గలవి.

మన సోవియట్ మాతృదేశం, అత్యంత విస్తృత ప్రాతిపదికపై ఏర్పడ్డ బ్రహ్మాండమైన నిర్మాణాలతో సంపూర్ణ కమ్యూనిజం నిర్మాణదశలో ప్రవేశించింది. సోవియట్ యూనియన్ ఆర్థికంగానూ, సాంస్కృతికంగానూ త్వరితమైన అభివృద్ధిని సాధిస్తోంది. మన సప్తవర్ష ప్రణాళిక, మన దేశ ఉత్పత్తి శక్తుల బృహత్తర అభివృద్ధి ప్రణాళిక అయిన సప్తవర్ష ప్రణాళిక జయప్రదంగా అమలు జరుపబడుతోంది. దేశమంతటా ప్రజల సృజనాత్మక శక్తులు, వేలాది జలధారావాహినులుగా పెల్లుబుకుతున్నాయి. మానవ చరిత్రలో ప్రప్రథమ ఘటనయైన సోవియట్ రోదసీ యాత్రికుల జయప్రద మైన యాత్రలు మన మహాద్భుత విలయాలన్నింటికి మకుటాయమాన మైనవి, కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి ఇవి ఉన్నతమైన పతాకలు.

ప్రపంచ సోషలిస్టు శిబిరమంతటా సోషలిజం సుస్థిర మయ్యింది గత సంవత్సరాలలోని ప్రధాన ఘటనలు, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ యొక్క సజీవ శక్తుల బ్రహ్మాండమైన పెరుగుదల, వాటి అభివృద్ధి అనే ప్రధాన సూత్రం యొక్క ప్రతిబింబాలే.

మన పార్టీ, మన ప్రభుత్వమూ సంక్లిష్టమైన అంతర్జాతీయ పరిస్థితుల్లో పనిచేస్తున్నాయి. అనేక సందర్భాలలో సామ్రాజ్యవాదులు ప్రపంచాన్ని యుద్ధ ప్రమాదానికి చేరువగా తీసుకురావడానికి ప్రయత్నించారు. సోవియట్ యూనియన్ బలాన్ని, దాని ప్రజల ధైర్య సాహసాలను పరీ

క్షించాలని వారు ప్రయత్నించారు. మన ప్రణాళికలు విఫలమవుతాయన్న సోషలిస్టు శిబిరం కూలిపోతుందన్న దుర్భ్రమలతో అనేకమంది బూర్జువా రాజకీయవేత్తలు ఆనందం పొందజూచారు. మనకు వ్యతిరేకంగా వారు అనేక కవ్వింపు చర్యలూ, విచ్ఛిన్న చర్యలూ తలపెట్టారు. మన శత్రువుల కుట్రలన్నింటిని మనపార్టీ, యావన్మంది సోవియట్ ప్రజలూ బహిర్గతంచేసి, అన్ని కష్ట దశలనూ సగౌరవంగా అధిగమించారు. సోవియట్ యూనియన్ నేడు ఇంతకు ముందెప్పటికంటే కూడా చాల బలాధిక్యతలు గల దేశంగా వుంది!

ఇప్పుడు సోవియట్ భూమి తన సృజనాత్మక సంపదలో ఉచ్ఛదశకు చేరుకున్నది. మనం ప్రయాణించిన విజయ మార్గాన్ని మనం స్ఫురణకు తెచ్చుకుంటున్నాం. అంచేత మనం పయనించిన మార్గం చాల తేలికైనదీ, సుఖమైనదీ అని భావించే ప్రజలు కొంతమందివుంటే వుండొచ్చు. కాని, అది సరైన అభిప్రాయం కాదు. 20వ పార్టీ మహాసభ అనంతర దశ తేలికైనదీ కాదు: లేదా సుఖమైనదీ కాదు. ఈ దశ, మన పార్టీనుండీ, మన ప్రజలనుండీ బ్రహ్మాండమైన కృషినీ, త్యాగాన్నీ కోరింది. కమ్యూనిస్టు సమాజమనే బృహన్నిర్మాణంలో, అనిర్దేశిత మార్గాలపై కమ్యూనిజం విజయసాధనవైపుకు సాగిపోవడంలో అగ్రగాములుగా వుండవలసిన బాధ్యత సోవియట్ ప్రజలపైన, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుల పార్టీపైన పడింది.

చరిత్ర అనేదానికి సూటిమార్గమంటూ లేదు. దాని వంకరటింకరలు దానికున్నాయి. ఉన్నట్టుండి అది అకస్మాత్తుగా మలుపులు తిరుగుతుంది. రాజకీయ నాయకత్వం కావాలంటే, ఒక పార్టీకి నిజంగా గొప్ప లక్షణాలుండాలి; సమాజ పరిణామ క్రమంలో ఉవ్వెత్తున లేచే ఉద్యమ పరిస్థితులలోనూ, అకస్మాత్తుగా మలుపులు తిరిగేటప్పుడూ సమగ్రంగా భావిని దర్శించే శక్తిని కోల్పోరాదు; విస్పష్టంగా కమ్యూనిజం మార్గాన్ని దర్శించ

గలగాలి. ఈ లక్షణాలన్నీ లెనిన్ సృష్టించిన పార్టీయైన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుల పార్టీకి సంపూర్ణంగా వున్నాయి. ప్రధాన సమస్యలకు సరైన పరిష్కార మార్గాన్ని కనుగొని, దేశీయ, విదేశీయ విధానాలలో సాధారణ విధానాన్ని రూపొందించుకొని, దానిని గట్టిగా ఆచరణలో పెట్టడానికి పార్టీకి, పార్టీ కేంద్ర కమిటీకి ఘటనలపట్ల లోతైన అవగాహన, విప్లవాత్మకమైన ధైర్య స్థైర్యాలూ, దీక్ష అవసరమైనాయి.

పార్టీ సిద్ధాంత నిర్ణయాలనూ, రాజకీయ మార్గాన్నీ, దాని సాధారణ పంథాను ఘటనలు పూర్తిగా ఋజువు చేశాయి. ఒక కోటి సభ్యత్వం గల సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుల పార్టీ తన 22వ మహాసభకు, ఐక్యముగా, సంఘటితమై, సోవియట్ ప్రజలతో అవిచ్ఛిన్నమైన బంధాలతో వచ్చింది. మన మహాసభకు అయిదువేలమంది ప్రతినిధులు వచ్చారు. వీరు, లెనిన్ నిర్మించిన మహా పార్టీకి చెందిన సుపుత్రులూ, సుపుత్రికలూ. వారు పార్టీయొక్క ప్రజల యొక్క ఐక్యతకు, వారి దీక్షకూ, భావాలకూ ప్రతిబింబం.

మన పార్టీ ఆమోదించిన మార్గం, సోషలిస్టు దేశాల ఐక్యతను, అంతర్జాతీయ కమ్యూనిస్టు, కార్మికవర్గ ఉద్యమ ఐక్యతను బలోపేతం చేయడంలోనూ, శాంతిని కాపాడి, మరో ప్రపంచ యుద్ధాన్ని నివారించడంలోనూ బ్రహ్మాండమైన ప్రాముఖ్యం గలదిగా వుంది. ప్రపంచ వ్యవహారాలలో సోవియట్ దేశం యింకా యెక్కువ అధికారాన్ని, ప్రతిష్ఠనూ సంపాదించుకొన్నది. అంతర్జాతీయ కమ్యూనిస్టు, కార్మికవర్గ ఉద్యమంలో సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ యొక్క పాత్రకు, కమ్యూనిస్టు, కార్మిక పార్టీల ప్రతినిధుల సమావేశాలు గొప్ప విలువనిచ్చాయి.

మన పార్టీపై విశ్వాసముంచినందుకు సోదర పార్టీలకు నేను, యీ మహాసభ తరపున సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు లందరి తరపునా హృదయపూర్వకమైన కృతజ్ఞత తెలియజేయడానికి అనుమతించమని కోరుతున్నాను. భవిష్యత్తులో కూడా సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ, అన్ని దేశాల శ్రామిక ప్రజలపట్లా సకల అభ్యుదయకాముక ప్రజల పట్ల తన అంతర్జాతీయతా బాధ్యతను నెరవేరుస్తూంటుందని ఇక్కడవున్న అతిథులకు, సోదర పార్టీలకు చెందిన ప్రతినిధులకు హామీ యివ్వడానికి అనుమతించండి.

# 1

# ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితి, అంతర్జాతీయ రంగంలో సోవియట్ దేశ స్థానం

కామ్రేడ్స్, ప్రపంచంలోని రెండు సామాజిక వ్యవస్థలైన—సోషలిస్టు, పెట్టుబడిదారీ వ్యవస్థల, మధ్య పోటీ అనేది, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 20వ మహాసభ అనంతర కాలపు ముఖ్యాంశంగా వుంది. ప్రస్తుత చారిత్రక దశలో ప్రపంచ పరిణామం యొక్క కీలకమైన, ప్రధాన లక్షణ మయ్యిందిది. సామాజిక పరిణామంలో ఈ రెండు భిన్న మార్గాలూ, రెండు చారిత్రక ధోరణులూ నానాటికి మరింత సుస్పష్ట మవుతున్నాయి. ఇందులో ఒకటి సమాజ అభివృద్ధికి, శాంతికి, సృజనాత్మక కృషికీ దోహదం చేసేమార్గం. రెండోది అభివృద్ధి నిరోధకమైన, పీడన, యుద్ధ మార్గం.

ప్రపంచమంతా యీ పోటీ రంగంగా మనం భావించుకున్నట్లయితే, మనం సోషలిజం పాత ప్రపంచంనుండి ఒక స్థానం తరువాత మరో స్థానాన్నిజయించుతున్నట్లు చూడగలం. ప్రథమవిషయం, నిర్ణయాత్మకమైన మానవ కార్యరంగంలో, భౌతిక సంపదల ఉత్పత్తిలో పెట్టుబడిదారీవిధానాన్ని సోషలిజం బాగా కృంగదీసింది. ప్రపంచ వస్తూత్పత్తిలో సోషలిస్టు వ్యవస్థ వాటా పెరిగింది; దాని ఉత్పత్తి అభివృద్ధి గతులు బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల అభివృద్ధి గతులకన్నా బాగా పెరిగాయి. సోషలిస్టు దేశాలు బ్రహ్మాండమైన ఉత్పత్తి శక్తులను అభివృద్ధిచేసి, నిజమైన భౌతిక, ఆత్మిక విలువలను కోకొల్లలుగా సృష్టించ గలవని ప్రతి ఒక్కరికి తెలిసి వచ్చింది.

ఒక వైపున అచంచలమైన శాంతి విధానాన్ని అనుసరిస్తూనే మనం, సామ్రాజ్యవాదుల యుద్ధపు బెదిరింపులను మరచిపోలేదు. రక్షణ విషయంలో మన దేశాధిక్యతకొరకు అవసరమైన ప్రతిచర్య తీసుకోబడింది, సోషలిస్టు ఉత్పత్తి, సోవియట్ విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాల విజయాలు సైనిక విషయాలలో విప్లవాత్మకమైన మార్పులు గొనిరావడానికి మనకెంతో తోడుపడ్డాయి. ఈనాడు మన దేశమూ, యావత్తు సోషలిస్టు శిబిరమూ బ్రహ్మాండమైన సైనిక శక్తిని కలిగి వున్నాయి. సామ్రాజ్యవాద దురాక్రమణ దారుల విఘాతాలకు వ్యతిరేకంగా నిలబడి, సోషలిజం సాధించి పెట్టిన మహావిజయాలను పరిరక్షించుకునేందుకు సోవియట్ యూనియన్‌కూ, సోషలిస్టు శిబిరానికీ తగినంత నమ్మకమైన రక్షణ బలం వుంది. నానాట పెరుగుతున్న సోవియట్ యూనియన్, ఇతర సోషలిస్టు దేశాల రక్షణ శక్తి, ప్రపంచ శాంతి శక్తులూ, రెండు భిన్న సాంఘిక వ్యవస్థల మధ్యగల పోటీని శాంతి మార్గంనుండి మరల్చి సాయుధ యుద్ధ సంఘర్షణల్లోకి దింపడానికి సామ్రాజ్యవాదులకు అవకాశం యివ్వలేదు. సోవియట్ యూనియన్, తాను లెనినిస్టు విధానమైన శాంతియుత సహజీవనాన్ని అనుసరిస్తూ, సామ్రాజ్యవాదుల కవ్వింపు చర్యలను పట్టుదలగా బహిర్గతం చేస్తూ, ఎదుర్కొంటోంది.

యుద్ధాన్ని నివారించడం సాధ్యమనె వాస్తవాన్ని, సోవియట్ ప్రజలూ తదితర దేశాల ప్రజలూ శాంతియుత జీవన లాభాలను అనుభవించ గలిగారన్న సత్యాన్ని, మన పార్టీ, దాని కేంద్ర కమిటీ సోవియట్ దేశపు శక్తి సంపదలను పెంపొందించడంలోనూ, లెనినిస్టు విదేశాంగ విధానాన్ని అమలు పర్చడంలోనూ అనుసరించిన చర్యల ప్రధాన ఫలితమేనని గుర్తించాలి. ఇది, సోషలిస్టు దేశాలలోని సోదర పార్టీల కార్యకలాపాల యొక్క, అన్ని దేశాలలోని శాంతి శక్తుల ఇతోధిక కృషియొక్క ఫలితమేనని గుర్తించాలి.

ఇటీవల సంవత్సరాలలో సామ్రాజ్యవాదులు, కొత్త యుద్ధ జ్వాలలను రగిల్చి సోషలిస్టు వ్యవస్థ బలాన్ని పరిరక్షించడానికి అనేక ప్రయత్నాలు చేసిన విషయం మనకు తెలుసు. గత అయిదు సంవత్సరాలలో అమెరికా, దాని సన్నిహిత మిత్ర రాజ్యాలూ తరచు క్రూరమైన బలప్రయోగానికి, ఆయుధ ప్రయోగానికీ పూనుకున్నాయి. కాని ప్రతిసారీ సోవియట్ యూనియన్, తదితర సోషలిస్టు దేశాలన్నీ సకాలంలో దురాక్రమణదారుడి ఆట కట్టించాయి. అన్నిటికంటే ప్రత్యేకమైన, ప్రాధాన్యతగల విషయమేమంటే, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం పోరాడుతున్న ప్రజలకు రక్షణకు సోషలిస్టు దేశాలు చర్యలు తీసుకోవడం. ప్రజలు తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, శాంతి, అభ్యుదయాల కోసం జరుపుతున్న పోరాటంలో సోవియట్ యూనియనూ, సోషలిస్టు దేశాలన్నీ నమ్మకమైన సహాయకారులని ప్రజలు నానాటికి మరింత యెక్కువగా గుర్తిస్తున్నారు.

రెండు సామాజిక వ్యవస్థల మధ్య శాంతియుత పోటీలో పెట్టుబడిదారీ వ్యవస్థ, ప్రజలందరి దృష్టిలో బలమైన నైతిక ఓటమి పొందింది. మానవాళిని ఎదుర్కొంటున్న తక్షణ సమస్యల్లో ఏ ఒక్కదానినీ పెట్టుబడిదారీ విధానం పరిష్కరించలేదన్నది, సాధారణ ప్రజలకు నిత్యానుభవంగా వుంది. ఈ సమస్యలు సోషలిజం ద్వారా మాత్రమే పరిష్కారం కాగలవన్నది నానాట స్పష్ట పడుతోంది. పెట్టుబడిదారీ వ్యవస్థలోనూ, పెట్టుబడిదారీ పద్ధతుల్లో అభివృద్ధి విషయమై విశ్వాసం సడలిపోతోంది. గుత్త పెట్టుబడిదారీ విధానం తన పలుకుబడిని కోల్పోతోంది. తన దేశీయ విధానాలను అమలు జరపుకోవడం కోసం తరచు ప్రజలను బెదిరించడానికి, నిర్బంధించడానికీ; బాహాటంగా నియంతృత్వ పద్ధతులకు పూనుకుంటున్నది. ఇతర దేశాలపై దురాక్రమణ చర్యలకు పూనుకుంటున్నది. ఇది ఏమైనప్పటికీ ప్రజలు మాత్రం అభివృద్ధి నిరోధకత్వాన్ని మరింత బలంగా ప్రతిఘటిస్తున్నారు.

భయపెట్టడాలూ, బెదిరింపులూ బలానికి నిదర్శనం కాదన్న సంగతీ,

పెట్టుబడిదారీ విధానం బలహీన పడుతోందనడానికి, దాని సార్వత్రిక సంక్షోభము మరింత తీవ్రతర మవుతోందనడానికి ఇవి సాక్ష్యమన్న విషయమూ రహస్యమేమీ కాదు. "జూలు పట్టుకుని వేలాడలేనప్పుడు, తోక పట్టుకుని సాధించలేమ"ని ఒక సామెత. కొన్ని దేశాలలోని అభివృద్ధి నిరోధకులు ఇప్పటికీ, రాజ్యాంగ చట్టాలకు విరుద్ధంగా, పార్లమెంటులను రద్దు చేయ గలుగుతున్నారు; ప్రజలకు ఉత్తమ ప్రతినిధులైన వారిని జైళ్ళలోకి నెట్టుతున్నారు. "అదుపులో లేని" ప్రజలను లొంగతీసుకోవడం కోసం యుద్ధనావలను, నావికా సైనికులకు తరలిస్తున్నారు. ఈ చర్యలన్నీ పెట్టుబడిదారీ పాలన ఆఖరి గడియలు కొంతకాలం పాటు మాత్రం వాయిదా వేస్తే వేయవచ్చు. ఏది ఏమైనప్పటికీ ఈ నిర్బంధ చర్యలు యింకా ఎక్కువగా సామ్రాజ్యవాద క్రూర స్వభావాన్ని బహిర్గతం చేస్తాయి. సామ్రాజ్యవాదులు తాము నిలబడుతున్న కొమ్మను తామే నరుక్కుంటున్నారు. అభ్యుదయ మార్గం వైపు మానవజాతి పురోగతిని అడ్డుకునే శక్తులేవీ యీ ప్రపంచంలో లేవు.

20వ పార్టీ మహాసభచే రూపొందింపబడ్డ మన పార్టీ విధానం సరైనదేనని, సత్యమైనదనీ ఘటనలు నిరూపించాయి. ఒక దేశానికన్నా మించి ఎక్కువ దేశాలలో సోషలిజం ఏర్పడడం, అది ఒక ప్రపంచ వ్యవస్థగా రూపొందడం అనేది మన యుగం యొక్క ప్రధాన లక్షణమని 20వ పార్టీ మహాసభ చెప్పింది. ఆ మహాసభ అనంతరం గడిచిన కాలంలో మరికొంత ప్రధానమైన అభివృద్ధి జరిగింది. అదే—సమాజ పరిణామ క్రమంలో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఒక నిర్ణయాత్మక శక్తిగా తయారు కావడం.

వలస విధాన నిర్మూలన అనివార్యమని మన పార్టీ నిర్ణయానికొచ్చింది. జాతీయ విముక్తి ఉద్యమాల శక్తివంతమైన తాకిడికి తట్టుకోలేక వలస వ్యవస్థ విచ్ఛిన్న మవుతోంది.

ప్రస్తుత కాలంలో దేశాల మధ్య యుద్ధాలు అనివార్యం కాదని, వాటిని ఆపవచ్చుననీ పార్టీ ఒక ముఖ్యమైన సూత్రాన్ని రూపొందించింది. గత సంవత్సరాల ఘటనలు కూడా దీనిని నిరూపించాయి. శాంతిని కాపాడు

తూన్న బలమైన శక్తులవద్ద నేడు, సామ్రాజ్యవాదులు ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభించకుండా నిరోధించేందుకు తగ్గ శక్తివంతమైన సాధనాలున్నాయని, యీ ఘటనలు తెలుపుతున్నాయి. సామ్రాజ్యవాదం పైన, యుద్ధ శక్తులపైన, శాంతి శక్తుల సోషలిస్టు శక్తుల ఆధిక్యత మరింత ప్రస్ఫుటమైంది.

కామ్రేడ్స్: క్లుప్తంలో చెప్పాలంటే, మనకు గడచిన ఈ ఆరు సంవత్సరాలూ, ప్రపంచ వ్యాపితంగా సత్కాలం.

## 1. సోషలిస్టు వ్యవస్థ శక్తి మరింతగా పెరుగుదల, ప్రపంచ పరిణామంలో నిర్ణయాత్మక శక్తిగా దాని మార్పు. సోషలిస్టు దేశాలమధ్య అంతర్జాతీయ సౌభ్రాతృత్వాభివృద్ధి.

మనం సమీక్షిస్తున్న కాలంలో, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధిలో ఒక ప్రధానమైన దశ పూర్తయింది. ఈ దశ యొక్క ప్రధాన లక్షణాలేమిటంటే:

సోవియట్ యూనియన్ భారీ ఎత్తున కమ్యూనిజం నిర్మాణానికి పూనుకున్నది. ప్రజాతంత్ర ప్రజాస్వామిక దేశాలలో యెక్కువ భాగం, తమ ఆర్థిక వ్యవస్థల్లో బహుముఖత్వాన్ని రద్దు చేసి, ఇప్పుడు సోషలిజం నిర్మాణాన్ని పూర్తి చేస్తున్నాయి. సోషలిస్టు దేశాలమధ్య పరస్పర సౌహార్ద్రపూర్వక సహాయ సహకారాలు అన్ని విధాలా అభివృద్ధి గావింపబడ్డాయి. ఒక్క సోవియట్ యూనియన్‌లోనేగాక, సోషలిస్టు దేశాలన్నిటా, పెట్టుబడిదారీ విధానం తిరిగి తలెత్తడానికి దోహదంచేసిన సాంఘికార్థిక అవకాశాలన్నీ ఇప్పుడు నిర్మూలించబడ్డాయి. దినదిన ప్రవర్థమానమవుతున్న సోషలిస్టు ప్రపంచ వ్యవస్థ శక్తి, సోషలిస్టు దేశాలు సాధించిన రాజకీయ, సాంఘిక-ఆర్థిక లాభాలు సుస్థిరంగావడానికి గ్యారంటి యిస్తున్నాయి. నిజమైన

స్వతంత్ర ప్రజల సమిష్టి కుటుంబంలో సోషలిజం సంపూర్ణ విజయం గ్యారంటీ చేయబడింది.

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ యొక్క ఆర్థిక వ్యవస్థ పెట్టుబడిదారి ఆర్థిక వ్యవస్థకన్నా, పోల్చలేనంత ఎక్కువ స్థాయిలో అభివృద్ధి చెందుతూనే వుంది. సోషలిస్టు పెట్టుబడిదారీ దేశాలలోని పారిశ్రామికోత్పత్తి పెరుగుదలను తెలిపే యీ క్రింది కొన్ని అంకెలను పరిశీలించండి.

(1937లో 100 శాతం అనుకుంటే)

| సంవత్సరం | సోషలిస్టు దేశాలు | పెట్టుబడిదారి దేశాలు |
|---|---|---|
| 1937 | 100 | 100 |
| 1955 | 362 | 199 |
| 1956 | 404 | 208 |
| 1957 | 445 | 215 |
| 1958 | 521 | 210 |
| 1959 | 610 | 231 |
| 1960 | 681 | 244 |

ఈ లెక్కలనుబట్టి, 1960లో సోషలిస్టు దేశాల పారిశ్రామికోత్పత్తి 1937 నాటి ఉత్పత్తికన్నా 6.8 రెట్లు అని మీకు తెలుస్తుంది. కాగా, పెట్టుబడిదారీ దేశాల పారిశ్రామికోత్పత్తి స్థాయి అదేకాలంలో 2.5 రెట్లుకన్నా తక్కువగానే వుంది. 1955లో ప్రపంచ పారిశ్రామికోత్పత్తిలో సోషలిస్టు దేశాల వాటా 27 శాతం కాగా, అది 1960లో సుమారు 36 శాతానికి పెరిగింది.

పారిశ్రామిక, వ్యవసాయక వస్తూత్పత్తి నిష్పత్తి అన్ని సోషలిస్టు దేశాలలోనూ మారింది. పారిశ్రామికోత్పత్తి వాటా త్వరితంగా పెరుగుతోంది. ప్రస్తుతం మొత్తం సోషలిస్టు దేశాలన్నింటి పారిశ్రామికోత్పత్తి వాటా, సగటున సుమారు 75 శాతం వుంది. ప్రపంచ సోషలిస్టు ఆర్థిక

వ్యవస్థ అభివృద్ధిలో పారిశ్రామికాభివృద్ధి ధోరణి ఎక్కువగా వుంది.

ఎక్కువ భాగం ప్రజాతంత్ర ప్రజాస్వామిక దేశాలలో, వ్యవసాయక రంగంలో ఉత్పత్తిదార్ల సహకార సంఘాలు ఏర్పడ్డం ఈ కాలంలో విప్లవాత్మకమైన ఘటన. నేడు సోషలిస్టు దేశాలలోని మొత్తం సాగు భూమిలో సోషలిస్టు విభాగపు వాటా 90 శాతానికి పైగా వుంది. ఇందుమూలంగా సమాజ వర్గస్వరూపంలో మార్పు వచ్చింది; ఇంతకుముందుకన్నా బలంగా కార్మికవర్గానికి, రైతాంగానికీ మధ్య సాన్నిహిత్యం ఏర్పడింది; మానవుడు తోటి మానవుడ్ని దోచుకోడానికి వీలు కల్పించే ఆర్థిక పునాది రద్దయి పోయింది. ప్రప్రథమంగా మన దేశంలో నెలకొన్న ప్రజల నైతిక, రాజకీయ సమైక్యత అన్ని సోషలిస్టు దేశాలలోనూ బలంగా అభివృద్ధి చెందుతూంది. చైనా మహాప్రజలూ, తదితర సోదర దేశాల ప్రజలు సోషలిస్టు నిర్మాణంలో సాధిస్తున్న విషయాలకు మన ప్రజలు ఎంతో సంతృప్తి చెందుతున్నారు; ఈ దేశాలు మరిన్ని విజయాలను సాధించాలని మన ప్రజలు అభిలషించుతున్నారు.

ఆర్థిక పురోభివృద్ధిమూలంగా, సోషలిస్టు దేశాలలోని ప్రజల జీవన ప్రమాణాలు పెరిగాయి. ప్రారంభ దినాలలో సోదర దేశాలలో సమాజాన్ని విప్లవాత్మకంగా పునర్నిర్మించాల్సివచ్చిన దశలో అనేక నష్టాలూ, చిక్కులూ కలగడమూ; పెట్టుబడిదారి వ్యవస్థవల్ల సంక్రమించిన ఆర్థిక బడుగు స్థితినుండి బయటపడ్డంకోసం ఈ దేశాలు డబ్బు పెద్ద పెద్ద మొత్తాలలో ఖర్చుపెట్టడమూ గుర్తుపెట్టుకున్నట్టయితే యిది యింకా సంతోషకరంగా వుంటుంది. ఈనాడు ఈ దేశాలలో సాంఘిక పునర్నిర్మాణంలో ఒక ముఖ్యమైన దశ పూర్తయినందున, ప్రజల ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధికి, జీవన ప్రమాణాల మరింత పెరుగుదలకు అవసరమైన ఎక్కువ అనుకూల పరిస్థితులు ఏర్పడ్డాయి.

ప్రపంచంలో సర్వసత్తాకమైన అనేక సోషలిస్టు దేశాలు ఆవిర్భవించడంతో, ఆ దేశాల పరస్పర సంబంధాలను సహకారాన్ని సరికొత్త సూత్ర ప్రాతిపదికపై నిర్వహించే సమస్య తలెత్తింది. సోదర పార్టీలు తమ

సమిష్టి కృషివల్ల, దేశాల మధ్య నూతన సంబంధాలను—సమానత్వం, పరస్పర లాభం, మైత్రీపూర్వకమైన పరస్పర సహాయం సూత్రాలపై ఆధారపడ్డ ఆర్థిక రాజకీయ సాంస్కృతిక సహకార సంబంధాలను ఏర్పాటుచేసి, అభివృద్ధి చేస్తున్నాయి. సోషలిస్టు దేశాల మధ్య నానాటికి పెరుగుతున్న సౌహార్ద్ర సంబంధాలూ, ఈ దేశాల రాజకీయార్థిక దృఢత ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ పటిష్టతకూ, అవిచ్ఛిన్నతకూ దోహదంచేసే నిర్ణయాత్మక శక్తులలో ఒకటిగా వున్నాయి. చెట్టపట్టాలు పట్టుకుని సమిష్టి లక్ష్యంవైపు పురోగమించేందుకు మనము ఐచ్ఛికంగా ఐక్యమయ్యాము. ఈ ఐక్యత ఎవరూ మనపైని రుద్దినట్టిది కాదు. మనకు గాలి ఎంత అవసరమో, ఇది కూడా అంతే అవసరం.

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధియొక్క ప్రథమ దశలో, దేశాలమధ్య సంబంధాలు ఎక్కువగా ద్విపక్ష విదేశ వర్తక, విజ్ఞానశాస్త్ర సాంకేతిక సహాయాన్ని ఇచ్చిపుచ్చుకోవడంద్వారా ఏర్పడ్డాయి. ఈ సంబంధాలలో ప్రధాన రూపాలు ఏమంటే, కొన్ని దేశాలు మరికొన్నింటికి సహాయాన్ని, అప్పులనూ యివ్వడం.

ఇటీవల సంవత్సరాలలో సోదర పార్టీల అనుభవం ఒక కొత్త రూపాన్ని అమలులోకి తెచ్చింది. అది ఉత్పత్తిలో ప్రత్యక్ష సహకారం. ఉదాహరణకు 1956–1960 సంవత్సరాల మధ్యకాలంలో, పరస్పర ఆర్థిక సహాయక సమితిలోని సభ్యదేశాలు అంగీకరించిన మేరకు, ఆర్థిక రంగం లోని కొన్ని శాఖల్లో జరిగిన అభివృద్ధికి సంబంధించిన ఆధార సూచీల మధ్య సామ్యతనే పరిశీలిద్దాం. ఇది ఒక ముఖ్యమైన ముందడుగు. 1959వ సంవత్సరంనుండీ ఆర్థికాభివృద్ధికి సంబంధించిన ప్రభుత్వ ప్రణాళికలను సమన్వయపరచడం జరిగింది. ప్రధాన ఆర్థిక రాజకీయ సమస్యలపై పార్టీల, ప్రభుత్వాల నాయకుల మధ్య అప్పుడప్పుడూ సమాలోచనలు జరుగుతుండడం, అభిప్రాయాలను ఇచ్చిపుచ్చుకోవడం అనేది ఒక పద్ధతిగా సాగుతోంది. సోషలిస్టు దేశాల సమిష్టి సంస్థలు — వార్సా సంధి సంస్థ; పరస్పర ఆర్థిక సహాయక సమితి—బాగా బలపడ్డాయి.

ఈనాడు ప్రపంచంలో స్వతంత్ర ప్రజలతో విలసిల్లే అజరామరమైన సోషలిస్టు కుటుంబమొకటి వుందని గట్టిగా మనం చెప్పుకోవచ్చు.

సోషలిస్టు దేశాలలోనూ, సోషలిస్టు దేశాల మధ్య సంబంధాలలోనూ సంభవించిన కూలంకషమైన గుణాత్మక మార్పులు, ఈనాడొక నూతన అభివృద్ధి దశలో ప్రవేశించిన ప్రపంచ సోషలిస్టు వ్యవస్థయొక్క హెచ్చు తూన్న పరిపక్వతకు నిదర్శనంగా వున్నాయి. ఈనాడు ప్రధాన విషయమే మంటే, ఒకొక్క సోషలిస్టు దేశపు ఆర్థిక రంగాన్ని నిరంతరం అభివృద్ధి చేస్తూ వాటన్నిటినీ సమిష్టిగా అభివృద్ధి చేయడంద్వారా పెట్టుబడిదారీ ప్రపంచంపైన సోషలిస్టు ప్రపంచం మొత్తం ఉత్పత్తి విషయంలో ముం దంజ వేయాలి. సోషలిజానికి ఇదొక మహా చారిత్రక విజయం కాగలదు. పెద్ద ఎత్తున కమ్యూనిజం నిర్మాణ పథంలో అడుగుపెట్టిన ప్రప్రథమమైన మన దేశం సాధించిన విజయాలు, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థలోని ఇతర దేశాలు కమ్యూనిజంవైపు పురోగమించడానికి సౌలభ్యాన్నీ, వేగాన్నీ కలి గిస్తాయి.

ఆర్థిక నిర్వహణ రూపాలను, పద్ధతులను నిరంతరం అభివృద్ధి చేయడం; దేశీయ వనరులను, అవకాశాలనూ విజ్ఞతతో గరిష్ఠ స్థాయిలో వినియోగించడం; ఒకొక్క దేశ ఆర్థిక రంగానికి చెందిన వివిధ శాఖల అభివృద్ధి విషయంలో తగిన శాస్త్రీయ పద్ధతులను అనుసరించడం—ఇవన్నీ నేడు ప్రత్యేక ప్రాధాన్యత వహిస్తాయి. ఈనాడు ఇదివరకెప్పటికన్నా కూడా ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధిచెందడంవల్ల ఉన్నతమైన అవకాశా లను—సోషలిస్టు అంతర్జాతీయ శ్రమ విభజన, ఉత్పత్తిలో ప్రత్యేక ప్రావీ ణ్యతా సంపాదన, సహకారమూ ఆర్థిక ప్రణాళికల్లో పరస్పర సహకారం, ప్రపంచ సోషలిస్టు మార్కెట్, దాని అభివృద్ధి అవకాశాలూ వగైరా సదవ కాశాలను అత్యంత హేతుబద్ధంగా ఉపయోగకరంగా వినియోగించాల్సిన అవసరం పెరుగుతోంది.

మనం సమీక్షచేస్తున్న కాలంలో సోషలిస్టు దేశాల మధ్య మొత్తం వ్యాపారం చాల అసాధారణమైన వేగంతో పెరుగుతోంది. దాని పెరుగుదల

గతి పెట్టుబడిదారీ దేశాల విషయంలోకన్నా చాల ఎక్కువ. 1950-1960 సంవత్సరాల మధ్య, సోషలిస్టు దేశాల మధ్య మొత్తం వ్యాపారం మూడు రెట్లుకు ఎక్కువ పెరిగింది. అదే సమయంలో పెట్టుబడిదారీ దేశాల మధ్య జరిగిన మొత్తం వ్యాపారం రెట్టింపు మాత్రమే పెరిగింది. ప్రపంచ సోష లిస్టు వ్యవస్థ అభివృద్ధిలో వచ్చిన నూతన దశలో కూడా, సోదర దేశాల మధ్య పరస్పరం లాభదాయకమైన వ్యాపారం ఒక ముఖ్యస్థానాన్ని ఆక్రమి స్తుంది. ఏమ్మటఁ ఈ పద్ధతి, ప్రతి సోషలిస్టు దేశంలో జరిగే వ్యాపార సంబంధాలకు చెందిన సూత్రానుగుణంగానే అంటే, సాంఘికంగా అవసర మైన శ్రమ శక్తికితగ్గ ప్రతిఫలం యిచ్చేవిధంగా బహుళా అమలుజరగ వచ్చు. ఈ సూత్రం ఎంత సంపూర్ణంగా అమలుజరిగితే అంత గట్టిగానూ ప్రతిఒక్క దేశంలో ఆర్థిక రంగం ఊపునందుకుంటుంది; అలాగే దేశాల మధ్య సహకారమూ త్వరితగతిని అభివృద్ధిచెందుతుంది. సోషలిస్టు అంత ర్జాతీయ శ్రమ విభజన అభివృద్ధి చెందుతుంది. ప్రతి సార్వభౌమాధి కారం గల దేశ జాతీయ ప్రయోజనాలు గౌరవింపబడుతూనే యివి జరుగు తాయి.

ఒకవేపున ప్రతిఒక్క సోషలిస్టుదేశ ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి చేయడానికి జరిగే కృషి, మరోవైపున ఆర్థిక సహకారాన్ని, పరస్పర సహాయాన్ని బలోపేతం చేసుకునేందుకు జరిగే కృషి రెండూ కలసి ప్రపంచ సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ మరింత అభివృద్ధి చెందడానికి ప్రధాన మార్గాన్ని ఏర్పరుస్తాయి.

కామ్రేడ్స్, సోషలిజం ప్రధానంగా తన ఆర్థిక విజయాలద్వారానే ప్రపంచ పరిణామంపై ప్రభావాన్ని వేస్తుందన్న లెనిన్ ప్రకటన, ఇంతకు ముందెప్పటికంటే నేడు మరింత వాస్తవంగా వుంది. సోషలిస్టేతర దేశా లపై సోషలిజం, కమ్యూనిజంల నిర్మాణానికి సంబంధించిన నానాట పెరు గుతున్న బహుముఖ ప్రభావం, సమస్త మానవాళి అభ్యుదయాన్ని త్వరితం చేసే ఒక విప్లవాత్మక శక్తి.

సోషలిజం, ఆర్థికాభివృద్ధి గతులలో తన ప్రథమ స్థానాన్ని గట్టిగా

కాపాడుకొంటోంది. శాస్త్ర విజ్ఞాన, సాంకేతీకరణంగాలకు సంబంధించిన అత్యున్నతమైన అనేక ప్రధాన శాఖల అభివృద్ధిలో సోషలిజం, పెట్టుబడి దారీ దేశాలకు ముందుగా వుంది. సామ్రాజ్యవాద దేశాలు, గతంలో ప్రపంచంలోని సోషలిస్టేతర మార్కెట్‌కు ఉత్పత్తి సాధనాలను సప్లయి చేయడంలో తమకున్న గుత్తాధికారాన్ని కోల్పాయి. అలాగే సోషలిస్టేతర దేశాలకు అప్పులివ్వడంలోనూ, సాంకేతిక సహాయాన్ని అందివ్వడంలో కూడా సామ్రాజ్యవాద దేశాలు తమ గుత్తాధిపత్యాన్ని కోల్పోయాయి. విదేశీ వలస దాస్య బంధనాల నుండి విడివడ్డ ఆసియా, ఆఫ్రికా ప్రజలు, సోష లిస్టు దేశాల వైపు సహాయం కోసం ఎక్కువ తరచుగా ఎదురు చూస్తు న్నాయి. తమ ఆర్థిక, సాంఘిక జీవన నిర్మాణంలో సోషలిస్టు దేశాల అనుభవాన్ని వినియోగించుకునేందుకు యీ దేశాలు ఎదురు చూస్తున్నాయి. తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కాలరాయ యత్నించే వలస వాదులకు వ్యతిరేకంగా జరిపే పోరాటంలో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ రక్షణ, సహాయాల కోసం వీరు ఎదురు చూస్తున్నారు.

సోషలిస్టు దేశాల శక్తి సంపదలు పెంపొందడంతో శాంతికి అవ సరమైన భౌతిక, నైతిక శక్తులు బలపడుతాయి. ఉదాహరణకు నేటి ప్రధాన సమస్యలైన యుద్ధమూ—శాంతి సమస్యల్లాంటివాటి పట్ల, పెట్టుబడి దారీ సూత్రాలు, వాటి ఆచరణ దృష్ట్యానే పరిష్కారంకోసం ప్రయత్నించ డం యిక సాధ్యపడదు. ఈనాడు ప్రపంచ పరిణామంలో నిర్ణయాత్మక శక్తిగా వుంటూన్నది, తోడేలు జిత్తులు గల సామ్రాజ్యవాదం కాదు; ప్రపంచ పరిణామంలో నిర్ణయాత్మక శక్తిగా ముందు కొస్తున్నది – శాంతి, అభ్యు దయ ఆదర్శాలతో కూడుకున్న సోషలిజమే.

యావత్ప్రపంచానికీ, ప్రజలమధ్య నిజమైన సమాన హాయీ గల సౌభ్రాతృత్వ సంపదలంటే ఏమిటో ఉదాహరణతో చూపడం ద్వారా సోష లిస్టు దేశాలు, అంతర్జాతీయ జీవితంలో నూతన పంథా ఏర్పర్చాయి. సోష లిజం భావాల ప్రభావం వల్ల, విముక్తికోసం శ్రామికవర్గ ప్రజలు జరుపు తున్న పోరాటమూ, ప్రజల సార్వత్రిక ప్రజాతంత్ర ఉద్యమమూ కలిసి,

ప్రపంచ వ్యాపిత సమిష్టి మహోద్యమంగా సమ్మిళితమై. సామ్రాజ్యవాదం మూలాధారాలను తుకిచిపెడుతున్నాయి.

సోషలిజం సరికొత్త విజయాలను సాధిస్తున్నకొలదీ, ఇటు ప్రతి ఒక్క సోషలిస్టు దేశంలోను, అటు మొత్తం ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ లోను ప్రజల మధ్య ఐక్యత మరింత బలపడుతుంది.

బాగా వేరూనినటువంటి మహావృక్షం ఎంతటి ఉప్పెనకైనా జంకదు. అలాగే నూతన సోషలిస్టు ప్రపంచం కూడా ఎట్టి అవాంతరాలకూ, లేదా ఆటుపోట్లకూ చలించదు. సామ్రాజ్యవాద శక్తుల అండతో హంగరీలోని అభివృద్ధి నిరోధక శక్తులు లేవదీసిన విప్లవ ప్రతీఘాతపు తిరుగుబాటూ, పోలెండ్, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్‌లలో శత్రువులు తలపెట్టిన కుట్రలూ, సోషలిస్టు నిర్మాణ దశలో అప్పుడప్పుడూ వర్గ పోరాటం గట్టిగా బలపడి తీవ్రరూపం ధరించవచ్చునని రుజువుచేశాయి. భవిష్యత్తులో కూడా, యింకా మిగిలివుండే అంతర్గత అభివృద్ధి నిరోధక శక్తులు, సామ్రాజ్యవాదుల అండతో సోషలిస్టు వ్యవస్థనుండి ఏదోఒక దేశాన్ని విడదీయడానికి, పాత బూర్జువా పాలనను పునఃప్రతిష్ఠాపించడానికి ప్రయత్నించవచ్చు.

విప్లవాత్మకమైన సమాజ పరివర్తనలాంటి బృహన్నిర్మాణ కార్యక్రమంలో అనివార్యమయే కష్టాలను అభివృద్ధి నిరోధకశక్తులు అవకాశంగా తీసుకుని, సోషలిస్టు దేశాలలోకి తమ తాబేదారులను పంపుతుంటారు.

కొన్ని సామ్రాజ్యవాద దేశాల పాలక వర్గాలు, సోషలిస్టు దేశాలకు వ్యతిరేకంగా సాగించే విచ్ఛిన్నకర చర్యలను, తమ ప్రభుత్వ విధాన స్థాయికి తీసుక వెళ్ళాయి. అమెరికా ప్రభుత్వం, సోషలిస్టు దేశాలకు వ్యతిరేకంగా గూఢచారి చర్యలకోసమూ, విచ్ఛిన్నకర చర్యలకోసమూ కోట్లాది డాలర్ల ధనాన్ని వెచ్చిస్తోంది: డబ్బుకోసం ఎంత నీచ నేరాలకైనా ఒడిగట్టే నేరస్తులు, హంతకులతో కూడుకున్న "గెరిల్లా దళాల"నబడే వాటిని నిర్మిస్తోంది. ఇప్పటికి వరుసగా అనేక సంవత్సరాలుగా అమెరికాలో కవ్వింపు చర్యగా "బానిస దేశాల వారాలు" జరుపబడుతున్నాయి. సామ్రాజ్యవాద బంధనాలనుండి విముక్తిపొంది స్వతంత్ర అభివృద్ధి పథాన్ని చేపట్టిన ప్రజ

లందరినీ, గుత్త పెట్టుబడిదారీ వర్గాలు డబ్బిచ్చి పోషించే తైనాతీలు "బానిసల"ని పిలుస్తున్నారు. నిజమే—సామ్రాజ్యవాదులు చేస్తే వాగాడంబరానికీ, కపట నాటకానికీ మేరలేదు : "బానిస దేశాలు" గూర్చి గావుకేకలు పెట్టే గుత్త పెట్టుబడిదారీ వర్గాలు జేబు దొంగలాంటి వాళ్ళు. జేబుదొంగ తన చేతులు ఇతర్ల జేబులో పెడుతూనే, "దొంగను పట్టుకోండి" అంటూ కేకలు పెడతాడు !

సామ్రాజ్యవాదుల కుట్రలను ఎన్నడూ మరువకూడదు. నవజీవన మార్గాన్ని నిర్మించుకోవడంలో మనం సాధించుతూన్న బ్రహ్మాండమయిన విజయాలు చూచుకుని మనం ప్రమత్తులై వుండరాదు; ఏమరుపాటుగా వుండకూడదు. సోషలిజం మరిన్ని ఘన విజయాలు సాధించి, ప్రతి సోషలిస్టు దేశంలోనూ ప్రజల జీవన ప్రమాణాలు పెరుగుతూన్నకొద్దీ, అంత బలంగానూ ప్రజలు కమ్యూనిస్టు కార్మిక పార్టీల వైపు సమీకృత మవుతూంటారు. ఇది, ఈ విషయానికి సంబంధించిన ఒక అంశం, చాల ఉత్సాహకరమైన అంశమున్నూ. అయితే ఇదేగాక మరో విషయాన్ని కూడా మనసులో పెట్టుకోవాలి. అన్ని సోషలిస్టు దేశాలలోని ప్రజల మధ్య ఐక్యత పెంపొందినకొద్దీ, ఈ దేశాలలో పెట్టుబడిదారీ పాలనను తిరిగి నెలకొల్ప వచ్చుననీ, సోషలిస్టు దేశాలు విచ్ఛిన్న మవుతాయనీ అనుకునే సామ్రాజ్యవాదుల ఆశలన్నీ క్రమేణా అడియాశలవుతున్నాయి. కాబట్టి, యుద్ధంద్వారా గానీ లేదా కనీసం సోషలిస్టు దేశాల అభివృద్ధిని అడ్డుకోవడం ద్వారాగాని ప్రపంచంలో పెట్టుబడిదారీ ఆధిపత్యాన్ని తిరిగి సాధించేందుకై బయట నుండి సోషలిస్టు దేశాలను దెబ్బ తీయాలని ప్రపంచంలోని అభివృద్ధి నిరోధక శక్తులు మరింతగా ఉద్దేశపడుతున్నాయి.

"మా తరువాత ప్రళయమే" అన్న సూత్రాన్ని అనుసరించే అతి ఉన్మత్తులైన సామ్రాజ్యవాదులు, నూతన ప్రపంచ యుద్ధాన్ని మొదలు పెట్టాలన్న తమ సాహసిక వాంఛను బాహాటంగానే ప్రకటిస్తున్నారు. ప్రజలను బెదిరించడం కోసం సామ్రాజ్యవాద తాత్త్వికులు, ప్రజల్లో ఒక విధమైన నిరాశా నిస్పృహ తత్వాన్ని ఎక్కించడానికి ప్రయత్నిస్తున్నారు.

"కమ్యూనిజంలో జీవించేకన్నా పెట్టుబడిదారీ వ్యవస్థ క్రింద చనిపోవడమే మంచిది" అని వీరు పూనకంతో అరుస్తున్నారు. స్వేచ్ఛ పొందిన ప్రజల అభివృద్ధిని వీరు కాంక్షించరన్న సంగతి మీకు తెలుసు. తమ దేశాలలోని ప్రజలుకూడా సోషలిజం మార్గాన్ని అనుసరిస్తారేమోనని వారి భయం। వర్గ విద్వేషంతో అంధులైన మన శత్రువులు, సమస్త మానవజాతినీ యుద్ధాగ్ని గుండంలోకి నెట్టడానికి సిద్ధంగా వున్నారు. అయితే తమ దురాక్రమణ పథకాలను సామ్రాజ్యవాదులు అమలు జరపమనికున్న అవకాశాలు తగ్గి పోతున్నాయి. దుర్బలుడూ, అత్యాశాపరుడైన ముసలివానికి బలం ఉడిగి పోయినా, శరీర ధార్ఢ్యం సడలిపోయినా కోర్కెలు మాత్రం చావలేదు. అలాగే వుంటుంది, సామ్రాజ్యవాదుల ప్రవర్తన కూడా.

సామ్రాజ్యవాదులు ప్రమాదకరమైన సాహసాలకు పూనుకోవచ్చు. కాని వారికి విజయం పొందే అవకాశంలేదు. ఇదిగాక వారు మరో మార్గాల ద్వారా కూడా ప్రయత్నించడానికి సిద్ధంగా వున్నారు. సోషలిస్టు శిబిరాన్ని బలహీనపర్చడంకోసం సామ్రాజ్యవాదులు, మన సోదర దేశాల ప్రజల మధ్య తగవులు పెట్టడానికి ప్రయత్నిస్తారు, లేదా యీ దేశాల మధ్య సంబంధాలలో పొరపులు కల్పించడానికి, జాతి తగాదాల అవశేషాలను రెచ్చగొట్టి, జాతీయతానురాగాలను కృత్రిమంగా పురికొల్ప ప్రయత్నిస్తారు.

సోషలిస్టు దేశాల అంతర్జాతీయ సౌభ్రాతృత్వాన్ని, దేశాల మధ్య మైత్రిని నిర్విరామంగా బలపర్చుకోవలసిన ఒక గొప్ప చారిత్రక బాధ్యత, మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీల మీదా సోషలిస్టు దేశాల ప్రజలపైనా వుంది.

సామ్రాజ్యవాద దురాక్రమణ శక్తులున్నంతవరకూ మనం జాగరూకులమై వుండాలి, మనం తుపాకీ మందును దట్టించి సిద్ధంగా వుంచాలి. సోషలిస్టు దేశాల రక్షణ శక్తిని, వాటి సాయుధ బలాలనూ, ప్రభుత్వ రక్షణ సంస్థలనూ పెంపొందించుకోవాలి. సామ్రాజ్యవాదులు గనుక ఇంగిత జ్ఞానానికి విరుద్ధంగా పోయి సోషలిస్టు దేశాలపై దాడి చేయడానికే సాహసించితే, వినాశనాత్మకమైన ప్రపంచ యుద్ధ కూపంలోనికి మానవజాతిని నెట్టడానికి

సాహసించితే, ఆ పిచ్చిపనే వారు చిట్టచివరి చర్య కాగలదు; దానితో పెట్టు బడిదారీ వ్యవస్థ తుడిచిపెట్టుకుపోతుంది.

తన కర్తవ్యాలను గూర్చి, బాధ్యతలను గూర్చి మన పార్టీకి స్పష్ట మైన అవగాహన వుంది. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఇకముందు కూడా బాగా బలపడి, నూతన శక్తిని పుంజుకుని, మరింత అభివృద్ధి చెందడానికి మన పార్టీ తన శక్తికొలదీ కృషి చేస్తుంది. పెట్టుబడిదారీ వ్యవస్థతో జరిగే పోటీలో సోషలిజానిదే విజయమని మన విశ్వాసం. విజయాన్ని మనం శాంతియుత పోటీ ద్వారానే సాధిస్తాము కాని యుద్ధం ద్వారా కాదని మన నమ్మకం. విభిన్న సాంఘిక వ్యవస్థలు గల దేశాలతో శాంతియుత సహ జీవనం నెరపుకోవాలన్న వైఖరినే మనం అనుసరిస్తున్నాం; ఇక ఎప్పుడూ అనుసరిస్తాం. ప్రపంచమంతటా శాంతి బలపడ్డానికై మనం శాయశక్తులా కృషి చేస్తాం.

## 2. పెట్టుబడిదారీ దేశాలలో వైరుధ్యాల తీవ్రత. విప్లవ పోరాటాల పెరుగుదల, జాతీయ విముక్తి ఉద్యమపు వెల్లువ.

కామ్రేడ్స్: పెట్టుబడిదారీ దేశాలలోని పరిస్థితిని మన పార్టీ 20వ మహాసభ విశ్లేషించి, పెట్టుబడిదారీ దేశాలు క్రమేపీ నూతన ఆర్థిక, సాంఘిక ఉత్పాతాల వేపుకు నెట్టుకు పోతున్నాయని నిర్ణయించింది. ఈ నిర్ణ యం ఆచరణలో రుజువైందా? అవును. తరవాత గడచిన సంవత్సరా లలో పెట్టుబడిదారీ దేశాలలో, పెట్టుబడిదారీ దేశాల మధ్య వైరుధ్యాలు మరింతగా పెచ్చుపెరుగుతున్నాయి. వలస సామ్రాజ్యాలు కూలిపోతు న్నాయి. కార్మికవర్గ పోరాటాలూ, ప్రజల జాతీయ విముక్తి ఉద్యమాలూ ఉచ్ఛస్థితికి చేరుకున్నాయి!

పెట్టుబడిదారీ వ్యవస్థ మరింత కుళ్ళి కంపు కొట్టడమనే సర్వసాధా

రణ లక్షణం తీవ్రంగా సాగిపోతూనే వుంది. ఉత్పత్తిలో కొంత పెరుగుదల ఉన్నప్పటికీ, పెట్టుబడిదారీ దేశాల ఆర్థిక వ్యవస్థ మరింత అస్థిరంగా తయారైంది. జ్వరమొచ్చి మంచానపడ్డ మనిషి చందంగా వుంది, దాని స్థితి. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో పుంజుకున్నట్లు కనబడే తాత్కాలిక స్థితి ఆర్థిక మాంద్యాలకు, సంక్షోభాలకు అనేకసార్లు దారితీసింది. ప్రధాన పెట్టుబడిదారీ దేశమైన అమెరికాలో, అయిదు సంవత్సరాలలో రెండుసార్లు సంక్లిష్టమైన ఆర్థిక మాంద్యం ఏర్పడింది. యుద్ధానంతర కాలం మొత్తాన్ని పరిశీలిస్తే, ఇలాంటి ఆర్థిక మాంద్యాలు నాల్గు ఏర్పడ్డాయి. 1957–58 సంవత్సరంలో వచ్చిన సంక్షోభంలో, మొత్తం పెట్టుబడిదారీ పారిశ్రామికోత్పత్తిలో యించుమించు 2/3 వంతుల మేరకు వున్న దేశాలు చిక్కుకున్నాయి. గుత్త పెట్టుబడిదారుల ఆదాయాలు అమితంగా పెరిగాయి. కాని కార్మికుల యదార్థ వేతనాలు చాల తక్కువగా మాత్రమే పెరిగాయి. ఈ వేతనాలు శ్రామికోత్పాదక శక్తికన్నా చాలా నెమ్మదిగా పెరిగాయి. గతంలో కార్మిక వర్గం సాధించుకున్న సాంఘిక సదుపాయాలు క్రమేణా క్షీణిస్తున్నాయి మొత్తంమీద చూస్తే, శ్రామిక వర్గ ప్రజల పరిస్థితి, ముఖ్యంగా బడుగు దేశాలలోని శ్రామిక వర్గ పరిస్థితి నానాటికి దిగజారుతోంది.

గత అయిదారు సంవత్సరాలలో మానవాళి, విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాలలో, ముఖ్యంగా అణుశక్తి, ఎలెక్ట్రానిక్స్, జెట్ ప్రొపల్షన్, రాకెట్ శాస్త్రరంగాల్లో బ్రహ్మాండమైన అభివృద్ధి సాధించింది. లెనిన్ చెప్పినట్లు పెట్టుబడిదారీ ఉత్పత్తి చెడుగులు ఈ విజయాలు హేతుబుద్ధితో వినియోగపడకుండా అడ్డుకుంటున్నాయి. 1913వ సంవత్సరంలోనే లెనిన్ ఇలా వ్రాశారు: "మీరెక్కడైనాసరే చూడండి, మానవాళి వెంటనే పరిష్కరించగల సమస్యలు అడుగడుగునా మీకు ఎదురవుతూంటాయి. పెట్టుబడిదారీ విధానమిప్పుడు దారికడ్డంగా వుంది. అది అపారమైన సంపదను సంపాదించుకున్నది. ప్రజలను ఆ సంపదకు బానిసలుగా మార్చింది. అది అత్యంత జటిలమైన సాంకేతిక సమస్యలను పరిష్కరించింది. కాని,

ప్రజల దారిద్ర్యం అజ్ఞానాలవల్లా, కొద్దిమంది కోటీశ్వరుల తెలివితక్కువ పిస నారితనంవల్లా అభివృద్ధిచెందిన సాంకేతిక పద్ధతులు అమలు జరక్కుండా ప్రతిబంధకం ఏర్పడింది.

"పెట్టుబడిదారీ వ్యవస్థ క్రింద, నాగరికత, స్వేచ్ఛ, ఐశ్వర్యం అనే మాటలు, కొన ఊపిరితో కుళ్ళుతున్నా, పిన్నవారిని బ్రతకలేకుండా చేసే ధనికుడైన తిండిపోతును జ్ఞాపకంచేస్తాయి" అన్న లెనిన్ మాటలు నేటికీ ఎంత వాస్తవంగా వున్నాయి! (రచనల సంకలనం, సంపుటం 19, పుట 349).

శాస్త్ర, సాంకేతిక విజయాలు అమలులోకి రావడం, పెట్టుబడిదారీ వ్యవస్థలోని అసాధ్యమైన వైరుధ్యాలను తొలగించడానికి బదులు వాటిని మరింత తీవ్రతరం చేస్తుంది. పెట్టుబడిదారీ వ్యవస్థలో స్వయంచలన యంత్రాల వినియోగం ఇటీవలనే ప్రారంభమైంది. కాని లక్షలాది కార్మికులు అప్పుడే పరిశ్రమలనుండి తొలగించబడ్డారు. తమ నెదుర్కొంటున్న ఈ చిక్కులనుండి బయటబడ్డంకోసం సామ్రాజ్యవాదులు ఆర్థిక రంగాన్ని సైనికీకరణ చేస్తున్నారు. వీరి ఆశలు సమర్థనీయమైనవి గావు.

నిజమే, సైనికీకరణ ఆయుధోత్పత్తిని చేసే పారిశ్రామిక శాఖలకు లాభాలు తెచ్చిపెట్టింది. గత అయిదు సంవత్సరాలలోను అమెరికాలో వెచ్చించిన ప్రత్యక్ష యుద్ధ వ్యయం 220,000 మిలియన్ల డాలర్లకు పైగా వుంది. ఉత్తర అట్లాంటిక్ సైనిక కూటమి దేశాలన్నీ కలసి గత 10 సంవత్సరాలలోను ఆయుధోత్పత్తికై 500,000 మిలియన్ల డాలర్లకు పైగా ఖర్చుపెట్టాయి. అయితే ఈ సైనికీకరణ కొత్త వ్యత్యాసాలకు దారి తీసింది. ఆర్థికరంగంలోని ఇతర శాఖలపై తీవ్రమైన దెబ్బతీసింది. ఇంకా లక్షలాదిమంది కార్మికులకు నిరుద్యోగంలోకి నెట్టింది. గత అయిదు సంవత్సరాలలోను అమెరికాలో మొత్తం నిరుద్యోగులుగా వున్నవారి సంఖ్య 30 లక్షలకు తగ్గకుండా వుంది. ఇటలీ, జపాన్, తదితర అనేక దేశాలలో పెద్ద ఎత్తున నిరుద్యోగం శాశ్వత లక్షణంగా పరిణమించింది.

యుద్ధోత్పత్తిపై ఎంత ఎక్కువ ఖర్చుచేస్తే, పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస అస్థిరత అంత తీవ్రమవుతుంది, అంతగా ఆ వైరుధ్యాలూ తీవ్రమవుతాయి. ఈనాడు పెట్టుబడిదారీ వ్యవస్థలో సుస్పష్టంగా కనిపించే వైరుధ్యమేమి టంటే, వినాశకర సాధనాల ఉత్పత్తికోసం మానవ బలగాన్ని విస్తారంగా వినియోగించడం. ఈ రకమైన వైరుధ్యాలను సృష్టించే సాంఘిక వ్యవస్థ తననుతానే అపకీర్తిపాలు చేసుకొంటోంది. తన కాలం చెల్లిపోయినా బ్రతికి వుంటోంది.

"పెట్టుబడిదారీ విధానం"అన్న పదాన్ని రద్దుచేయవలసిందిగా అమెరి కన్ కోటీశ్వరుడైన హారిమన్ సూచించాడంటే ఆశ్చర్యపడాల్సిన పనిలేదు.

"కృశ్చెవ్ నుండి పదచౌర్యాన్నిచేస్తూ మనం 'పెట్టుబడిదారీ విధానం' అన్న పదాన్ని 'పాతి' పెట్టాలి" అని హారిమన్ అన్నాడు. అమెరికా వెలుపల ప్రపంచంలో నివసిస్తున్న ప్రజలు ఈ "పెట్టుబడిదారీ విధానం" అంటే సామ్రాజ్యవాదానికీ, ధనాఢ్య వర్గాలు పేద వర్గాలను దోపిడీ చేయ డానికీ వలస విధానానికీ పర్యాయపదంగా భావిస్తున్నారని హారిమన్ ఒప్పు కోక తప్పలేదు. ఇది అతి అవమానకరమైన పదం; భయోత్పాతాన్ని సృష్టించే మాట అది. వాస్తవానికి దూరంగా పోవడం సాధ్యం కాదు! నిజం. ఈ కళంకమైన పదంనుండి రక్తం, కశ్మలం ఎంతగా తొలగించ ప్రయత్నించినా తొలగిపోవు. "నల్ల కుక్కను తెలుపు చేయలే"మని ఒక సామెత వుంది. "పెట్టుబడిదారీ విధానం" అన్న పదాన్ని పాతిపెట్టడానికి సమాధి త్రవ్వేందుకు పార పట్టుకున్న హారిమన్ కృషిని మనం హర్షించ గలం! కాని, పెట్టుబడిదారీ దేశాల ప్రజలు ఇంతకన్నా సరిఅయిన నిర్ణయా నికి వస్తారు. "పెట్టుబడిదారీ విధానం" అనే మాటనుగాక, నిలువెల్లా కుళ్లి కంపుకొడుతూన్న పెట్టుబడిదారీ విధానాన్ని, దాని చెడుగులన్నిటితో భూస్థాపితం చేస్తారు.

ఇటీవల సంవత్సరాలలో పెట్టుబడిదారీ ప్రపంచ శక్తుల కలయికలో కొన్ని ముఖ్యమైన మార్పులు వచ్చాయి.

మొదటిది, ప్రపంచ పెట్టుబడిదారీ ఉత్పత్తి, వాణిజ్యాలలో అమెరికా తన పూర్ణాధిక్యతను కోల్పోయింది. ప్రపంచ పెట్టుబడిదారీ దేశాలన్నింటి మొత్తం పారిశ్రామికోత్పత్తిలో అమెరికా వాటా, 1948లో 56.6 శాతం వుంటే, అది 1960వ సంవత్సరంలో 47 శాతానికి పడిపోయింది. దాని ఎగుమతులు 23.4 శాతంనుండి 18.1 శాతానికి పడిపోయాయి. బంగారం నిల్వలు 74.5 శాతంనుండి 43.9 శాతానికి పడిపోయాయి. ఫలితంగా అమెరికా నేడు, పెట్టుబడిదారీ దేశాలలో, ద్వితీయ ప్రపంచ యుద్ధానికి ముందు ఏ స్థానంలో వుందో దాదాపు అదే స్థానంలో వుంది.

రెండోది, బ్రిటన్, ఫ్రాన్స్‌ల స్థానం గమనించదగ్గంతగా బలహీన పడింది. బెల్జియం, హాలెండ్ దేశాల వలెనే యీ దేశాలు కూడా తమ వలసలను శాశ్వతంగా కోల్పోతున్నాయి. ప్రపంచ పారిశ్రామిక రంగంలో ఈ దేశాలు తమ యుద్ధాపూర్వపు స్థానాన్ని తిరిగి సంపాదించుకోలేక పోతున్నాయి.

మూడవది, యుద్ధంలో ఓటమి పొందిన దేశాలు, ముఖ్యంగా పశ్చిమ జర్మనీ, జపాన్ దేశాలు పెద్ద ముందంజ వేశాయి. నేడు ప్రపంచ పెట్టుబడిదారీ పారిశ్రామికోత్పత్తిలో పశ్చిమ జర్మనీ, జపాన్, ఇటలీల మొత్తం వాటా సుమారు 17 శాతం వుంది. అంటే, ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభంకానున్న సమయంలో 1937 లోని మొత్తం ఉత్పత్తికన్నా ఇది ఎక్కువ.

పారిశ్రామికోత్పత్తిలో పశ్చిమ జర్మనీ, బ్రిటన్ స్థాయికి చేరుకున్నది. ఎగుమతులకు సంబంధించినంతవరకూ పశ్చిమ జర్మనీ, అమెరికా తర్వాత ద్వితీయ స్థాన మాక్రమిస్తోంది. యుద్ధానంతర సంవత్సరాలలో అమెరికా గుత్త పెట్టుబడిదారీ సంస్థలు పశ్చిమ జర్మనీ, జపాన్ ఆర్థిక రంగాలపై ఎక్కువ మొత్తాలలో ధనాన్ని పెట్టుబడిపెట్టాయి. వాస్తవానికి అనేక సంవత్సరాలపాటు ఈ రెండు దేశాలూ, స్వంతంగా యుద్ధ ఖర్చు పెట్టుకోకుండా ఆదుకోబడ్డాయి. ఏమంటే అమెరికా, అమెరికా ప్రజల

నోళ్ళుకొట్టి ఈ దేశాలకు ఆయుధాలు సప్లయిచేసింది. పశ్చిమ జర్మనీ, జపాన్‌లు, తమ శాశ్వత పెట్టుబడులను పునరుద్ధరించి ఆధునిక పద్ధతుల్లో ఉత్పత్తి శాఖలను పునర్నిర్మించేందుకుగాను ఆర్థికరంగలోని కీలక శాఖల్లో పెద్ద మొత్తాల్లో పెట్టుబడులు పెట్టాయి. ఫలితంగా, యివి ప్రపంచ మార్కెటులో బ్రిటన్, ఫ్రాన్స్‌లకు, చివరకు అమెరికాకూ అప్పుడే తీవ్రమైన పోటీదార్లుగా తయారైనాయి.

యుద్ధానికి ముందు సామ్రాజ్యవాద దేశాల మధ్యనున్న వైరుధ్యాలు తిరిగి తలసూపాయి, కొత్త వైరుధ్యాలు తలెత్తాయి. పశ్చిమ యూరప్‌పై ఆధిక్యంకోసం బ్రిటిష్, పశ్చిమ జర్మనీ సామ్రాజ్యవాదులకు మధ్య పోరాటం తీవ్రరూపం ధరించుతూన్నది. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేతంగా పోరాటంలో ఫ్రెంచి సామ్రాజ్యవాదం, నిన్నటి తన శత్రువైన పశ్చిమ జర్మనీ గుత్త పెట్టుబడిదారీ వర్గాల అండను సంపాదించడంకోసం ప్రయత్నిస్తోంది. ఇది సదుపాయంకోసం పెళ్ళిచేసుకున్నట్టుగా ఏర్పడ్డ అస్వాభావికమైన మైత్రిలాగా ఫ్రాన్స్‌కే వ్యతిరేకంగా మరింత తరచుగా పని చేస్తోంది. అమెరికా, బ్రిటన్, తదితర సామ్రాజ్యవాద దేశాలను ఒకదాని నుండి మరొకదాన్ని వేరుపరచే వైరుధ్యాలు లోతుగా వున్నాయి. ఉత్తర అట్లాంటిక్ సైనిక కూటమి, ["నాటో"] తదితర దురాక్రమణ కూటములలో యివి స్పష్టంగా అవుపిస్తాయి.

అంతర్జాతీయ ఉద్రిక్తత సడలడం పట్ల సామ్రాజ్యవాద దేశాలు, వాటి నాయకులూ భయపడతారన్న సత్యం రోజురోజుకు స్పష్టమవుతోంది. ఏమంటే, ఉద్రిక్త పరిస్థితి వున్నప్పుడే సైనిక కూటాలను ఏర్పర్చి, సోషలిస్టు దేశాలనుండి ప్రమాదం వస్తోందని చెప్పి ప్రజలను భయపెట్టడం, వారికి తేలిక. సామ్రాజ్యవాదులు అన్ని దేశాలనూ ఆయుధ పోటీలోకి దించి, ఇతర దేశాల ఆర్థిక వ్యవస్థలను తమ వాటికి ముడపెట్టి, వాటిని సైనికీకరణ వైపుకు నెట్టేందుకు ప్రయత్నిస్తున్నారు. ఈ పంథా, పశ్చిమ జర్మనీ, జపాన్‌లపట్ల అమెరికా అనుసరించుతున్న విధానం ద్వారా బాగా

స్పష్టమైంది. అమెరికా సామ్రాజ్యవాదులు బుద్ధిపూర్వకంగా పశ్చిమ జర్మనీని ఆయుధపోటీలోకి దించుతున్నారు. యుద్ధం సంభవించితే, తమ కొత్త సాహసిక చర్యలో, ప్రధానంగా జర్మన్ ప్రజల రక్తంతో మూల్యాన్ని చెల్లించడం అమెరికాకే అనుకూలం. అదే సమయంలో అమెరికన్ సామ్రాజ్యవాదులు, తామనుసరించే యీ విధానంవల్ల పశ్చిమ జర్మనీ ఆర్థిక రంగం బలహీనమవుతుందనీ, ప్రపంచ మార్కెట్లో పశ్చిమ జర్మనీ తమకు పోటీదారుగా నీరసపడుతుందనీ ఆశిస్తున్నారు. దాదాపు ఇదే విధానం, జపాన్ విషయంలో కూడా అనుసరింపబడుతోంది.

తమ సంభాషణల్లో పశ్చిమ రాజ్యాల నాయకులు, తమ విధానం పశ్చిమ జర్మనీని పునరాయుధం చేయడమేనన్న విషయాన్ని దాచడంలేదు. వీరి వాదన యించుమించు యిలా వుంటుంది—పశ్చిమ జర్మనీ గనుక పునరాయుధం గాకపోతే, ఆయుధోత్పత్తికై అది డబ్బు ఖర్చుచేయక పోతే, అది మరింత శక్తివంతమైన ప్రమాదకరమైన పోటీ దేశంగా తయారు కావచ్చు. క్లుప్తంగా చెప్పాలంటే, సామ్రాజ్యవాద శిబిరంలో కొన్ని తీవ్రమైన వైరుధ్యాలున్నాయి.

తమ భవిష్యత్తును చూచి భయపడుతున్న సామ్రాజ్యవాదులు, తమ శక్తులను కూడగట్టుకుని, తమ సైనిక, రాజకీయ, వాణిజ్య, కస్టమ్స్ సంబంధాలను బలోపేతం చేసుకొనేందుకు ప్రయత్నిస్తున్నారు. ఇందుకు అభివృద్ధి నిరోధక శక్తులు, సోషలిస్టు దేశాలపై దురాక్రమణ జరపడం పరిష్కార మార్గంగా భావిస్తున్నారు. యుద్ధానికి ముందు వీరు హిట్లర్ జర్మనీపై పెద్ద ఆశలు పెట్టుకున్నారు. ఈనాడు ప్రధాన దురాక్రమణ శక్తి పాత్రను అమెరికా నిర్వహిస్తోంది. అమెరికా నేడు ప్రపంచంలోని అభివృద్ధి నిరోధక శక్తులకు కేంద్రంగా వుంది. అమెరికా సామ్రాజ్యవాదులు, పశ్చిమ జర్మనీ సైనికతత్వ వాదులతోను, ప్రతీకార వాంఛా పరులతోనూ చేతులు కలిపి వ్యవహరిస్తూ, ప్రజల శాంతి భద్రతలకు ప్రమాదం కల్పిస్తున్నారు. కాని నేటి మన కాలంలో, యుద్ధం ద్వారా తమ వైరుధ్యాలకు

పరిష్కార మార్గం చూసుకోవడమనేది వీరికి ప్రమాదకరమైనది.

ఇటీవల వరకూ ఏ ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో వలస వాదులు కోట్లాది ప్రజలను అణగద్రొక్కి వుంచారో ఆ ఖండాలలో, సామ్రాజ్యవాదుల స్థానం కంపిస్తోంది. ఈ ఖండాలలోని ప్రజల విప్లవ పోరాటం త్వరితగతిని మంచి వూపు నందుకుంటోంది. గత ఆరు సంవత్సరాల కాలంలోనే 28 దేశాలు రాజకీయ స్వాతంత్ర్యం పొందాయి. మన శతాబ్దంలో ఈ దశాబ్దం, సామ్రాజ్యవాద వలస విధానంయొక్క సంపూర్ణ విచ్ఛిత్తిని తెచ్చిన కాలంగా చరిత్ర కెక్కుతుంది.

కాని ఒక విషయం మరువరాదు. అదేమంటే, వలస విధానం క్రుంగిపోయినప్పటికీ దాని అవశేషాలింకా రూపు మాయలేదు. ఆసియా, ఆఫ్రికాలలో అనేక కోట్లాది ప్రజలింకా వలస బానిసత్వం క్రింద బాధలనుభవిస్తున్నారు, తమ విముక్తికై పోరు సల్పుతున్నారు. ఇప్పటికి ఏడు సంవత్సరాలుగా స్వాతంత్ర్య పోరాటంలో అల్జీరియా దేశ భక్తుల రక్తం ప్రవహిస్తోంది. శాంతియుతంగా వున్న ప్రజలకు వ్యతిరేకంగా సాగుతున్న "ఈ నీచమైన యుద్ధం" వేలాది ప్రాణాలను బలిగొంటున్నప్పటికీ, యీ యుద్ధం ఫ్రెంచి, అల్జీరియా ప్రజలపైని అతి భారంగా వున్నప్పటికీ ఫ్రెంచి గుత్త వర్గాలు అల్జీరియాలో యుద్ధానికి స్వస్తి చెప్ప నిచ్చగించడంలేదు. చిన్న రాజ్యమైన పోర్చుగల్ మన ఓల్గాదా ప్రాంతంలో మూడింట రెండు వంతులకన్నా ఎక్కువ వుండదు. కాని యిది తన భూభాగానికన్నా సుమారు 25 రెట్లు యెక్కువ వైశాల్యం గల వలసలను దాస్యం క్రింద వుంచుతోంది. ఇండొనేసియా ప్రజల అనాది సిద్ధమైన పశ్చిమ ఇరియన్ ప్రాంతాన్ని తిరిగి వారికి ఇవ్వడానికి డచ్ వలసవాదులు మొండిగా నిరాకరిస్తున్నారు. అమెరికా, చైనావారికి చెందిన తైవాన్ దీవిపైన, జపాన్ వారికి చెందిన ఒకినావా దీవిపైన తన పట్టును వదలుకో నిరాకరిస్తోంది. క్యూబా ప్రజల అభీష్టానికి విరుద్ధంగా అది, క్యూబా భూభాగం పైన వున్న గ్వాంటనామో సైనిక స్థావరంపై పెత్తనాన్ని అట్టే పెట్టుకుంటున్నది.

స్వేచ్ఛా స్వాతంత్ర్యాల సాధనకోసం, ప్రజాస్వామ్యం, అభ్యున్నతి కోసం ప్రజలు తీసుకునే ఏ చర్యనైనా సామ్రాజ్యవాద శక్తులు వ్యతిరేకిస్తున్నాయి. అనేక బాధ్యతల సాకుకో సామ్రాజ్యవాదులు జాతీయ విముక్తి ఉద్యమాన్ని కుంటుపర్చడానికి, చిన్న దేశాలలోని అభివృద్ధి నిరోధక శక్తులతో సంబంధాలు పెట్టుకోవడం ద్వారా ఆ దేశాల అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్పించుకోడానికి యత్నిస్తారు.

ఇరాన్, పాకిస్తాన్, కాంగోలలో వారనుసరించిన పద్ధతీ, ఇప్పుడు లావోస్, కువైత్ విషయాలలో అనుసరించుతున్న పద్ధతీ ఇదే.

ఈ కాలమంతటా సోవియట్ యూనియన్, తన అంతర్జాతీయ బాధ్యతను నెరవేర్చడంలో, సామ్రాజ్యవాదానికి, వలస విధానానికి వ్యతిరేకంగా పోరాటం నడుపుతున్న ప్రజలకు సహాయం చేస్తోంది. ఈ పని ఇష్టం లేనివారున్నారు. అందుకు మనమేమీ చేయలేం. మన విశ్వాసాలు అటువంటివి. మన దేశ ప్రజలు, భూస్వాముల, పెట్టుబడిదారుల నిర్బంధానికి వ్యతిరేకంగాను, అంతర్జాతీయ సామ్రాజ్యవాద జోక్యానికి వ్యతిరేకంగానూ దీర్ఘకాలం పాటు గట్టి పోరాటం నడిపి స్వేచ్ఛను సాధించుకున్నారు. ఈ పోరాటంలో మనకెంత నష్టం వాటిల్లిందీ, విజయసాధనకై ఎన్ని త్యాగాలు చేసిందీ మనకు బాగానే గుర్తుంది. తమ స్వేచ్ఛా సాధన కోసం, సౌఖ్యంకోసం సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాటం నడుపుతున్న ప్రజలకు విజయం చేకూరు గాక అని మనం హృదయపూర్వకంగా కోరుకుంటున్నాం. విదేశీ నిర్బంధాన్ని తొలగించుకునేందుకు సంపూర్ణమైన హక్కు ప్రజలకు గలదని మన విశ్వాసం. ప్రజల న్యాయమైన పోరాటాన్ని మనం బలపరుస్తాం. వలస విధాన వినాశం తథ్యం. దీనికి గోరీ కట్టడమూ తథ్యం. ఇదే ప్రజల అభీష్టం. ఇదే చరిత్ర గమనమున్నూ.

వలసదాస్యం నుండి విముక్తి పొందిన దేశాలు జాతీయ, సాంస్కృతిక పునరుజ్జీవన కృషిలో కొన్ని విజయాలు సాధించాయి. కానీ ఆసియా,

ఆఫ్రికాలలో నూతనంగా స్వేచ్ఛ పొందిన దేశాలలో అధిక భాగానికి ఆర్థికాభివృద్ధి ఇంకా నెమ్మదిగానే సాగుతోంది. ఈ దేశాలలోని అసంఖ్యాక ప్రజలింకా నికృష్ట పరిస్థితులలోనే జీవిస్తున్నారు. కాగా వారి దేశాల సంపద విదేశీ బ్యాంకులలోకి, విదేశీ కార్పొరేషన్ భోషాణాల్లోకి బంగారం రూపంలో ధారగా ప్రవహిస్తోంది. అమెరికా గుత్త పెట్టుబడిదారీ వర్గాలు తాము బడుగుదేశాలలో వెచ్చించే ప్రతిఒక్క డాలర్ పైన, రెండు లేదా మూడు డాలర్ల లాభం తీస్తున్నారు. లాటిన్ అమెరికా దేశాలకు "సహాయం" చేసేందుకంటూ తాము 500 మిలియన్ల డాలర్లు కేటాయించనున్నామని యిటీవలనే అమెరికా గుత్త వర్గాలు ప్రకటించారు. ఇరవై దేశాలకు, అయిదు సంవత్సరాలకు 500 మిలియన్ల డాలర్లు ఏ మూల? ఇవి, అనేక సంవత్సరాలుగా తాను దోచుకుంటున్న వారికి ఒక ధనికుడు వేసే పిసనారి బిచ్చం. దోపిడీ చేయబడ్డ ప్రజలకు, వలసవాదుల నుండి సహాయాన్ని అర్థించే హక్కుగాక, అసలు తమనుండి దోచుకోబడ్డ ఆస్తిపాస్తులన్నింటిని తమకు తిరిగి అప్పజెప్పాలని డిమాండ్ చేసే హక్కు వుంది.

ఈనాడు తమ ఆధిపత్యం అంతమయే రోజు వచ్చిందని పసికట్టిన వలసవాదులు, ఓడిపోతున్న సమయంలో గంభీరమైన ముఖం పెడుతున్నారు తాము కావాలనే, వలసలను వదలిపెడుతున్నామని పెద్దగా చెప్పుకుంటున్నారు. వారిని నమ్మేదెవరు? అనుమానకరంగా తాము తప్పక తరిమి వెయ్యబడతామని వారికి తెలిసి వుండడంవల్ల, వారీ చర్యకు పూనుకుంటున్నారని ఎవరైనా గ్రహించగలరు. కాస్త జ్ఞానమున్న వలసవాదులు, జనసామాన్యపు భాషలో చెప్పాలంటే, తన్నులు తినడానికి అయిదు నిమిషాలముందుగా, బయటికి పోతున్నారు.

విముక్తి పొందన దేశాలపైన వలస రాజ్యాలు అసమమైన సంధులను రుద్దుతున్నాయి. ఈ దేశాల భూభాగాలపై సైనిక స్థావరాలు ఏర్పరుస్తున్నాయి. ఈ దేశాలను సైనిక కూటాలలో ఇరికించడానికి ప్రయత్నిస్తు

న్నాయి. ఈ సైనిక కూటాలనేవి వలసవాదానికి సరికొత్త రూపాలలో ఒకటి. వలస విధాన విచ్ఛిత్తి ఫలితంగా ఆవిర్భవించిన దేశాలలో దాదాపు సగానికి సగం, మోయరాని బరువుగల అసమ సంధుల పాశంలో చిక్కుకున్నాయి. వలస విధానంకన్నా తక్కువ అప్రతిష్టాకరంకాని కొత్త రూపెత్తిన రాజ్యాల మధ్య అమెరికా నిలబడివుంది. అమెరికాకు అత్యంత సన్నిహితమైన మిత్రరాజ్యాలూ, అదేసమయంలో పోటీ రాజ్యాలు—బ్రిటిష్ వలస విధానమూ, పశ్చిమ జర్మన్ సామ్రాజ్యవాదమూ. పశ్చిమ జర్మనీ సామ్రాజ్యవాదం నిర్మొహమాటంగా, బ్రిటిష్, ఫ్రెంచి గుత్త వర్గాలను ఆఫ్రికా, సమీప మధ్య ప్రాచ్యాలనుండి గెంటివేస్తోంది.

వలస పీడననుండి విముక్తి పొందిన దేశాలు నూతన అభివృద్ధి దశలో ప్రవేశించాయి. రాజకీయ స్వాతంత్ర్యం కోసం జరిగిన పోరాటం, వలసవాదుల క్రింద బాధలనుభవించి, సమిష్టి ప్రయోజనాలలో పాలుపంచుకున్న జాతీయ శక్తులన్నింటినీ సమైక్యం చేసింది. ఇక యిప్పుడు, సామ్రాజ్యవాదపు వ్రేళ్ళను పెకిలించివేసి, వ్యవసాయ, తదితర తక్షణ సాంఘిక సంస్కరణలను ప్రవేశపెట్టాల్సిన సమయం వచ్చింది గాబట్టి, వర్గ ప్రయోజనాలలోని వైరుధ్యాలు మరింతగా బయటపడుతున్నాయి. శ్రామికవర్గ ప్రజలలో అసంఖ్యాకులూ, సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక విప్లవ ప్రాథమిక కర్తవ్యాలను నెరవేర్చడంలో ఆసక్తివున్న జాతీయ బూర్జువా వర్గంలోని చాల భాగమూ స్వాతంత్ర్యాన్ని బలోపేతం చేసుకోవడంలోనూ, సాంఘికార్థిక సంస్కరణలను అమలు జరపడంలోనూ మరింత ముందుకు వెళ్ళగోరుతారు. ఏదిఏమైనప్పటికీ ఈ దేశాలలోని పాలక వర్గాలలో, దేశంలోని ప్రజాతంత్ర, అభ్యుదయకరవర్గాలతో సఖ్యతతో యింకా ముందుకు పోవడానికి భయపడే శక్తులున్నాయి. వీరు, ప్రజల పోరాట ఫలితాలను మాత్రం అనుభవించడానికి సిద్ధం, కాని జాతీయ విప్లవ పురోగతిని అడ్డుకుంటారు. ఈ శక్తులు, దేశం వెలుపల సామ్రాజ్యవాదంతోనూ, దేశం లోపల ఫ్యూడలిజంతోనూ రాజీపడతారు; నిరంకుశ

పద్ధతులకు పూనుకుంటారు.

ఈ రకమైన విధానం ఎక్కడకు దారితీస్తుందో పాకిస్తాన్ ఉదహరణ తెలుపుతుంది. ఈ దేశం తన బడ్జెట్ ఆదాయంలో మూడింట రెండు వంతుల ఆదాయాన్ని యుద్ధ కార్యకలాపాలకు ఖర్చుపెడుతోంది. జాతీయ పరిశ్రమలు అభివృద్ధి కావడం లేదు. దేశమంతా తన గుప్పిటలోనే వున్నట్లు విదేశీ పెట్టుబడి పాలన చేస్తోంది. పాకిస్తాన్ ప్రజలకు మనం మంచి కలగాలని తప్ప మరేమీ కోరుకోవడం లేదు. కాని పాకిస్తాన్‌కు పట్టిన దురదృష్టం, పలుకుబడిగల వర్గాలు జాతీయైక్యతను విచ్ఛిన్నం చేస్తూ, జాతీయ స్వాతంత్ర్య ప్రగాఢ పరిరక్షకులుగా రుజువు చేసుకున్న అభ్యుదయకర నాయకులను, ముఖ్యంగా కమ్యూనిస్టులను నిర్బంధిస్తున్న కొన్ని ఇతర దేశాలలోని ప్రజలను ఆలోచించేటట్టుగా చేయాలి.

కమ్యూనిజం వ్యతిరేక పంథాను చేపట్టడమంటే, జాతీయ శక్తుల మధ్య గండికొట్టి, సామ్రాజ్యవాదుల, వలసవాదుల ముందు వాటిని బలహీన పర్చడమే కాగలదు.

ఇందుకు భిన్నంగా—ప్రజాతంత్ర జాతీయ శక్తుల ఐక్యత ఎంత దృఢంగా వుంటే, తక్షణావసరమైన సాంఘికార్థిక సంస్కరణలు ఎంత కూలంకషంగా అమలు జరిగితే అంత బలంగా వుంటుంది, నూతన రాజ్యం. ఉదాహరణకు క్యూబా ప్రజలెందుకని అంత కలసికట్టుగా తమ ప్రభుత్వానికి అండగా నిలబడ్డారు? క్యూబా రైతులకు భూమి, ప్రభుత్వం నుండి విస్తృతమైన భౌతిక సహకారమూ లభించినందువలననే వారలా నిలబడ్డారు. క్యూబా కార్మికులు అమెరికన్ గుత్త పెట్టుబడిదారీ వర్గాలకు గాకుండా, పరిశ్రమలు జాతీయం అయినందున తమకోసమే కష్టించడం వల్ల, గుత్తవర్గాల నిరంకుశ నిర్ణయాలకు వ్యతిరేకంగా తమకు రక్షణ కల్పించబడి నందుననే క్యూబాలోని చిన్న, మధ్యరకపు ఉత్పత్తిదార్లు తమ ప్రభుత్వానికి అండగా నిలబడ్డారు. క్యూబా ప్రజలు మొత్తంమీద విస్తృతమైన ప్రజాతంత్ర హక్కులను, స్వేచ్ఛనూ పొందారు. మంచి

జీవితానికి, సౌఖ్యాలకు, సిరి సంపదలకు రహదారి పడింది! ప్రమాద సమయంలో అమెరికన్ సామ్రాజ్యవాదులు క్యూబాపై దాడికి తలపడి నప్పుడు, మొత్తం ప్రజలంతా తమ విప్లవం సాధించిన సత్ఫలితాలను పరిరక్షించుకునేందుకు ఒక్క త్రాటిపై నిలబడి ఆ దాడిని ఎదుర్కొన్నారు. పరాక్రమ వంతుడైన దేశ భక్తుడూ, విప్లవ వీరుడు అయిన ఫిడెల్ కాస్ట్రో నాయకత్వాన క్యూబా ప్రజలు త్వరలోనే అమెరికా కిరాయి మూకలను తుడిచిపెట్టి, "పందుల అఘాతంలో"కి విసరి కొట్టారు. అది వారికి తగిన చోటే లెండి!

సామ్రాజ్యవాద ఏజెంట్లు, విముక్తి పొందిన దేశాల ప్రజలు తమ సంస్కరణలను తొందరపడి అమలు పరచకూడదని మరింత తరచుగా సలహా లిస్తుంటారు. ప్రస్తుత ఆర్థికాభివృద్ధి స్థాయికి చేరుకునే ముందు, యూరప్, అమెరికాలలోని పెట్టుబడిదారీ దేశాలు గడచిన సుదీర్ఘమైన మార్గాన్నే తాము గడపక తప్పదని బడుగు దేశాల ప్రజలు నమ్మేట్లు వీరు చేస్తారు. అయితే వీరు ప్రజలకా మార్గం అతి క్లిష్టమైనదీ: కంటకావృతమైన దన్న విషయాన్ని దాచిపెడతారు. వారు, 17వ శతాబ్దం నుండి 19వ శతాబ్దం వరకూ ఇంగ్లాండ్, ఫ్రాన్సు, జర్మనీలలో తిరుగుబోతులు, నిరాశ్రయులనైన వారితో రోడ్లు, జైళ్ళు ఎలా నిండి వుండేవో; 19వ శతాబ్దం మధ్యకాలంలో కూడా ఆ దేశాలలోని కార్మికులచే రోజుకు 14 నుండి 18 గంటలవరకూ పని చేయించడాన్ని గూర్చిగాని; లేదా గొర్రెల పచ్చిక బయళ్ళకోసమని ఇంగ్లాండ్ రైతాంగంనుండి మిగిలిన ఆ ఆఖరి కొంద్రను గుంజుకోవడం —దీని గురించి ఆ రోజుల్లో "గొర్రెలు ప్రజల్ని తిన్నాయి" అనేవారు— విషయంగాని వీరు ఏమీ చెప్పడానికి ఇష్టపడరు.

ఏ వలస ప్రజలను దోచుకుని పశ్చిమ రాజ్యాలు ఐశ్వర్యం పొందాయో ఆ వలస ప్రజలకు, పెట్టుబడిదారీ అభివృద్ధి పంథాలో సాగడం మరింత సుదీర్ఘమూ, సంక్లిష్టమూ అయిన పని కాగలదు. నేటి ఈ 20వ శతాబ్దం మధ్యలో జీవించే ప్రజలపైన యీ సుదీర్ఘం, క్లిష్టమైన మార్గాన్ని ఎందుకు

రుద్దాలి? ప్రజల శతాబ్దాల వెనుకబాటు తనాన్ని సోషలిజం ద్వారా అధిగమించవచ్చునని కమ్యూనిస్టులు నమ్ముతారు. అయితే మనం మన భావాలను ఇతరులెవరిపైనా బలవంతాన రుద్దబోము. ఇంతకన్నా తమ సుఖ సంక్షేమాలకు మరోమార్గం లేదని ఇప్పుడు గాకపోతే మరొకప్పుడైనా ప్రజలంతా గుర్తించకపోరని మనం గట్టిగా నమ్ముతున్నాం.

కామ్రేడ్స్, పెరిగిపోతున్న సామ్రాజ్యవాద వైరుధ్యాలు, తాము గుత్త వర్గాల దయా దాక్షిణ్యాలకు లోనయి దైన్య స్థితిని అనుభవించడమా, లేక తమ హక్కులకోసం, భవిష్యత్తుకోసం పోరాటం నడపడమా అన్న తీవ్రమైన ప్రత్యామ్నాయ మార్గాలను పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికవర్గం ఎదుర్కొనేటట్టు చేస్తున్నాయి. కార్మికులు పోరాట మార్గాన్నే ఎంచుకుంటారు. వారు గొప్ప పట్టుదలతో పోరాడుతున్నారు.

"వర్గ శాంతి" శకం ఆరంభమైనట్లు బూర్జువా జ్యోతిష్కులు ప్రకటించుతున్నారు. వర్గ పోరాటమనేది గతానికి చెందిన విషయమనీ, సాధారణంగా మార్క్సిస్టు సిద్ధాంతం బూజు పట్టిందని చెపుతున్నారు. ఈ రకమైన జోస్యాలు ఎంత అసంబద్ధమో ఘటనలు నిరూపించాయి. శ్రామిక ప్రజలు నడుపుతున్న సమ్మెల సంఖ్య స్థాయి పెరుగుతున్నది. ఒక్క 1960 వ సంవత్సరంలోనే 5 కోట్ల 30 లక్షల మంది సమ్మె జరిపారు. ఫ్రెంచి, ఇటలీ కార్మికవర్గం నడిపిన ప్రజా ఉద్యమం, బెల్జియం కార్మికుల సమ్మె, 5 లక్షల మందికి పైగా పాల్గొన్న అమెరికా ఉక్కు కార్మికుల సమ్మె, బ్రిటిష్ ఇంజనీరింగ్ కార్మికుల సమ్మె—కార్మికవర్గ ఉద్యమ చరిత్రలో ఎప్పటికీ నిలిచిపోతాయి. జపాన్ శ్రామికవర్గం కూడా అనేక సార్లు తన పోరాట శక్తిని ప్రదర్శించింది.

ఇటీవల సంవత్సరాలలో ప్రపంచ రంగంలోకి సరికొత్త కార్మికవర్గ దళాలు అడుగుపెట్టాయి. ఆసియా, లాటిన్ అమెరికా, ఆఫ్రికాలలో పారిశ్రామిక కార్మికులు, కార్యాలయోద్యోగులు 10 కోట్ల మందికి పైగా, లేదా సోషలిస్టేతర ప్రపంచంలో, వేతనాలు పొందే కార్మికులలో సుమారు 40

శాతం మంది ఉన్నారు. ఈ యువ శ్రామికవర్గం తానొక విప్లవకర శక్తిగా రానురాను దృఢంగా తన స్థానాన్ని నిలబెట్టుకొంటోంది.

పెట్టుబడిదారీ దేశాల్లోని శ్రామికవర్గ ప్రజలు తమ ఆర్థిక, సాంఘిక హక్కులకోసం జరిపే పోరాటం రోజు రోజుకీ తీవ్రతర మవుతోంది. ఈనాడు వీరిని ఎదుర్కొనేది వ్యక్తిగత యజమానులుగాదు: మొత్తం ప్రభుత్వాధికారం అంతా అందగాగల శక్తివంతమైన గుత్త వర్గాలు ఎదుర్కొంటున్నాయి. శ్రామిక వర్గ ప్రజల చర్యలు పదేపదే రాజకీయ స్వభావాన్ని కలిగివుంటున్నాయి. 4 కోట్ల మందికి పైగా, లేదా మొత్తం సమ్మెదార్లలో సుమారు 73 శాతం, 1960 లో రాజకీయ సమ్మెల్లో పాల్గొన్నారు. గత సంవత్సరం, శ్రామిక వర్గమూ, పెద్ద సంఖ్యలో తదితర ప్రజలూ తీసుకున్న శక్తివంతమైన చర్యల మూలంగా జపాన్, ఇటలీ, బెల్జియంలలో ప్రభుత్వాలు పడిపోయాయి. కార్మిక వర్గానికి అండగా నిలచిన ఫ్రాన్సు శ్రామిక ప్రజలు ఆ దేశంలో ఫాసిస్టు పాలన నెలకొల్పడానికి "మితిమీరిన" సైనిక వాదులు చేసిన ప్రయత్నాల్ని వమ్ము చేశారు.

గత అయిదు సంవత్సరాలలో ప్రధాన పెట్టుబడిదారీ దేశాలలో రూపొందిన సాంఘిక పరిస్థితితోపాటు, రైతాంగ ఉద్యమం అభివృద్ధి చెందడం కూడా గమనించదగ్గది. ఫ్రాన్సు, ఇటలీ, పశ్చిమ జర్మనీ, తదితర పెట్టుబడిదారీ దేశాల్లో గుత్తాధిపత్యం రైతాంగాన్ని నాశనం చేస్తోంది. ఈ రైతాంగం ఇంతకు ముందెప్పటికంటే ఎక్కువ చురుగ్గా గుత్త సంస్థలకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో పాల్గొంటున్నారు.

శ్రామిక ప్రజల విజయాలన్నీ సంయుక్త కార్యాచరణ వల్లనే సిద్ధించాయనడానికి ఇటీవల సంవత్సరాల అనుభవం మరింత సాక్ష్యాన్ని పొందుపర్చింది. ఐనప్పటికీ, మితవాద సోషల్- డెమోక్రటిక్ నాయకుల విద్రోహకర చర్యల మూలంగా కార్మిక వర్గంలో చీలిక ఇంకా కొనసాగుతోంది. ఈ నాయకులు తమ పార్టీలను, కార్మిక వర్గాన్ని, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా సాగే పోరాటం నుండి తప్పించడానికి చాల తీవ్రమైన కృషి

సాగిస్తున్నారు. మితవాద వర్గ సోషలిస్టు నాయకులూ, అనేకమంది ట్రేడ్ యూనియన్ పెత్తందారులూ ఇప్పటికి చాలాకాలంగా కార్మిక వర్గ ప్రయోజనాలకు విద్రోహం తలపెడుతూ, గుత్త పెట్టుబడిదార్లకు విశ్వాసపాత్రులుగా వ్యవహరిస్తున్నారు. కాని సోషల్ డెమోక్రటిక్ సంస్థల సామాన్య సభ్యులలోనూ, కార్యకర్తలలోనూ, నాయకత్వంలో సైతం శ్రామికవర్గ ప్రయోజనాల రక్షణకై సాగే సమిష్టి పోరాటంలో పాల్గొనాలని చిత్తశుద్ధితో వాంఛించే వారు అనేకమంది వున్నారు. వీరు ఈ మధ్య మితవాద నాయకుల విధానానికి రానురాను ఎక్కువగా ప్రతిఘటిస్తున్నారు.

కమ్యూనిస్టులు, ఒకవైపున మితవాద సోషల్ డెమోక్రాటిక్ నాయకుల సిద్ధాంతాల దివాళాకోరుతనాన్ని, విచ్ఛిన్నకర చర్యలను బహిర్గతం చేస్తూనే, మరో వైపున సోషలిస్టులలో వున్న మంచివారితో సహకరించాలని, శాంతి, ప్రజాస్వామ్యం, సోషలిజంల కోసం జరిగే పోరాటంలో వారితో కలిసి పనిచేయాలని కోరడానికి యిదే కారణం. ఇదేదో తాత్కాలికమైన ఎత్తుగడల కోసం చేసిన నినాదం కాదు; ఇది కమ్యూనిస్టు ఉద్యమం యొక్క సర్వసాధారణ విధానం. ఈ విధానానికి శ్రామిక వర్గ మూల ప్రయోజనాలే కారణాలు.

శ్రామిక వర్గ ఉద్యమాభివృద్ధికి, కమ్యూనిస్టు పార్టీల కార్యకలాపాలతో ఎడదీయరాని సంబంధం వుంది, సృజనాత్మక కృషి అనే మహోన్నత పథంలో ప్రవేశించింది. నేటి మన రోజుల్లో, కమ్యూనిస్టుల రాజకీయ ప్రభావం కొద్దో గొప్పో అభివృద్ధి చెందిన శ్రామికవర్గ ఉద్యమం వున్న ప్రతీ దేశంలోనూ పలుకుబడిలో వుంది. ఇటీవల సంవత్సరాలలో మరో 12 పార్టీలు ఏర్పడ్డంతో కమ్యూనిస్టుల సన్నిహిత సమిష్టి కుటుంబం పెరిగింది. కమ్యూనిస్టుల మొత్తం సంఖ్య 70 లక్షలు పెరిగింది.

అభివృద్ధి నిరోధక శక్తులు కమ్యూనిస్టు వ్యతిరేక విషప్రచారం పలువిధాలుగా సాగిస్తున్నప్పటికీ, ప్రపంచమంతటా కమ్యూనిస్టు పార్టీలు పెంపొందుతున్నాయి. కమ్యూనిస్టులను చెడ్డవారిగా జాబితాలలోకి ఎక్కిస్తు

న్నారు, ఉద్యోగాల నుండి ఉద్వాసన చెపుతున్నారు; "విదేశీ ఏజెంట్లు" అని ప్రకటిస్తున్నారు, లేదా జైళ్ళలోకి నెడుతున్నారు. 36 పెట్టుబడిదారీ దేశాల్లో కమ్యూనిస్టు పార్టీలు కఠినమైన అజ్ఞాత వాసంలో పనిచేయవలసి వస్తోంది. కాని, తమ ప్రయోజనాలకు నిజమైన రక్షకులూ, తమకు నిజమైన సేవ చేసేవారూ కమ్యూనిస్టులే నని ప్రజలు అనుభవం ద్వారా తెలుసుకుంటున్నారు. ఏ అడ్డంకులూ కమ్యూనిస్టు భావాల పరివ్యాప్తిని నిరోధించజాలవు. వాటినెవరూ చంపలేరు, లేదా జైళ్ళ ఉక్కు కటకటాల వెనుక బందీలుగా చేయలేరు. కమ్యూనిస్టు భావాలు ప్రజల మనసుల్నీ హృదయాల్నీ జయింపతున్నాయి. అవి ఒక అజేయ శక్తిగా రూపొందుతున్నాయి.

నిజమే, కొన్ని ప్రధాన పెట్టుబడిదారీ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు యింకా చిన్నవిగానే వున్నాయి. కాని అంతమాత్రాన అవి తమ చారిత్రక పాత్రకు లోపాన్ని కలుగజేయవు. పరిస్థితులెలాంటివైనా కమ్యూనిస్టులు, తమది న్యాయమైన లక్ష్యమని గుర్తించినందున గట్టిగా నిలబడగల కమ్యూనిస్టులు, శ్రామిక వర్గానికి అగ్రగామిగా నిలబడతారు. ఉదాహరణకు, అమెరికాలోని కమ్యూనిస్టుల సంఖ్య తక్కువన్న విషయం అందరికీ తెలిసినదే. కాని, అంత బడా పెట్టుబడిదారీ రాజ్యమూ తనకు శక్తివంతమైన సైనిక, పోలీసు యంత్రాంగం వున్నప్పటికీ కమ్యూనిస్టుల పార్టీ అంటే భయపడుతోంది. వీలైన అన్నివిధాలా దాని కార్యకలాపాల్ని నిరోధిస్తోంది. దాన్నిబట్టి, చిన్న దళమైన అమెరికా కమ్యూనిస్టులు మార్క్సిస్టు-లెనినిస్టులకు తగ్గట్లుగా వ్యవహరిస్తున్నారని తెలుస్తుంది. అవును, అల్పమైన దేహం తరచు మహత్తరమైన ఆత్మకు నిలయంకాగలదు!

సోషలిస్టు దేశాలలోని కమ్యూనిస్టులు ఎన్నడూ, కార్మికవర్గ విజయంకోసము, శ్రామిక ప్రజలందరికోసమూ పోరాడే పెట్టుబడిదారీ దేశాలలోని తమ సోదరులు ఎదుర్కొనే కష్టాలను, చిక్కులను మరువరు. ఈనాడు, ఈ మహాసభకు వచ్చిన ప్రతినిధులందరి, సోవియట్ కమ్యూనిస్టులందరి తరఫునా మనం, మార్క్సిజం-లెనినిజం విజయ పతాకను

ముందుకు గొనిపోతూన్న పెట్టుబడిదారీ దేశాలలోని మన సోదర కమ్యూనిస్టులందరికీ, శత్రువుకు తలొగ్గకుండా అభివృద్ధి నిరోధకుల నరక కూపంలో వుంటోన్న సోదరులందరికీ, తమ ప్రజల ప్రయోజనాలకోసం నిర్భయంగా పోరాడుతున్న వారందరికీ అత్యంత హృదయపూర్వక మైన సౌహార్ద్రాభినందనలను అందజేస్తున్నాం.

సోదర పార్టీలు బలపర్చిన 20వ పార్టీ మహాసభ నిర్ణయాలు, కమ్యూనిస్టు ఉద్యమం యొక్క మహత్తర సృజనాత్మక శక్తికి ప్రోదిచేశాయి: లెనినిస్టు భావం, లెనినిస్టు పద్ధతి తిరిగి సోదర పార్టీల కార్యకలాపాలకు అబ్బడానికి, ఆ పార్టీల మధ్య సంబంధాలకు దోహదం చేశాయి. ఇటీవల సంవత్సరాలలో జరిగిన కమ్యూనిస్టు, కార్మిక పార్టీల సమావేశాలు, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాభివృద్ధిని తెలిపే ముఖ్యమైన మైలురాళ్ళు. అంతర్జాతీయ కమ్యూనిస్టు సమావేశాలు, తమ మధ్య క్రియాత్మక సహకారాన్ని సాధించుకొనేందుకు సోదరపార్టీలు రూపొందించుకున్న రూపాలలో ఒకటి.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ మూల ప్రయోజనాలకు, నిరంతర ఐక్య కార్యచరణ అవసరమన్నది మార్క్సిస్టు-లెనినిస్టులకు నిర్వివాద మైన అంశం. ఇందుకు కమ్యూనిస్టు, కార్మిక పార్టీలు కట్టుబడి వుంటాయి. జాతీయ సంకుచిత మనస్తత్వానికి స్పష్టంగా లొంగిపోయిన యుగోస్లావియా కమ్యూనిస్టుల లీగ్ నాయకులు మాత్రమే, సూటియైన మార్క్సిస్టు-లెనినిస్టు మార్గం నుండి వంకర టింకర మార్గం పట్టారు. ఈ మార్గం వారిని రివిజనిజం అనే ఊబిలోనికి దించింది. యుగోస్లావియా నాయకులు, ప్రపంచమంతటా కమ్యూనిస్టు ఐక్యతా సంఘీభావాల పత్రంగా ప్రతిధ్వనించిన, 1957 నాటి సోదర పార్టీల ప్రకటనకు వ్యతిరేకంగా రివిజనిస్టు, లెనినిస్టు వ్యతిరేక కార్యక్రమాన్ని చేపట్టారు. ఈ కార్యక్రమం అన్ని మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీల తీవ్రమైన, న్యాయమైన విమర్శకు గురియైంది.

రివిజనిస్టు భావాలు, యుగోస్లావియా కమ్యూనిస్టు లీగ్ నాయకత్వం

యొక్క సిద్ధాంత ఆచరణల అన్నింటా మూర్తీభవించి వున్నాయి. వారనుసరించిన మార్గం—ప్రపంచ సోషలిస్టు కుటుంబం నుండి విడిపోయి అభివృద్ధిచెందే మార్గం – హానికరమూ, ప్రమాద భరితమూ. ఈ మార్గం సామ్రాజ్యవాద అభివృద్ధి నిరోధక వర్గాలకు మంచి అవకాశమిస్తుంది; జాతీయతా ధోరణులను రెచ్చగొడుతుంది; తుదకు నవ ప్రపంచ నిర్మాతల స్నేహపూర్వకమైన సమైక్య కుటుంబంనుండి వేరుపడిపోయిన దేశంలోని సోషలిస్టు లాభాలకు కూడా నష్టం కలిగించవచ్చు.

యుగోస్లావియా నాయకుల రివిజనిస్టు భావాలను మన పార్టీ గతంలో విమర్శించింది; ఇక ముందూ విమర్శిస్తూనే వుంటుంది. అంతర్జాతీయ వాదులంగా మనం, ఫాసిజానికి వ్యతిరేకంగా నిస్వార్థంతో పోరాడి, విజయం సాధించాక సోషలిస్టు నిర్మాణ పథాన్ని చేపట్టిన సోదర యుగోస్లావియా ప్రజల భవితవ్యాన్ని గూర్చి ఆందోళన చెందకుండా వుండలేము.

చరిత్రాత్మకమైన 1960 నవంబర్ సమావేశం, మార్క్సిజం-లెనినిజం పరిశుద్ధతను పరిరక్షించి, తమ సభ్యుల ఐక్యతను బలోపేతం చేసి, ప్రధాన ప్రమాదమైన రివిజనిజానికి వ్యతిరేకంగానూ, పిడివాద, సంకుచితత్వ ధోరణులకు వ్యతిరేకంగానూ, రెండు రంగాలలో దృఢ నిశ్చయంతో తమ పోరాటాన్ని కొనసాగించాలన్న కమ్యూనిస్టు పార్టీల దీక్షను గట్టిగా పునరుద్ఘాటించింది. సమిష్టిగా తీసుకోబడ్డ నిర్ణయాలను ప్రతి ఒక్క పార్టీ పాటించాల్సిన ఆవశ్యకత వుందన్న, కమ్యూనిస్టు ఐక్యతను విచ్ఛిన్నపరచే ఎటువంటి చర్యనుగాని అనుమతించరాదన్న ప్రతిపాదనలు, కార్మికవర్గ పార్టీలను మరింత సంఘటిత పర్చడానికి అత్యంత ప్రాముఖ్యత కలవి.

సోవియట్ యూనియన్‌లోనూ, ప్రజాతంత్ర ప్రజాస్వామిక దేశాలలోనూ సోషలిస్టు నిర్మాణ విజయాలు, మార్క్సిజం—లెనినిజం మహత్తర శక్తికీ, పటిష్టతకూ నిదర్శనాలు. కార్మికులూ, రైతాంగమూ తమ భవితవ్యానికి తామే నిర్ణేతలైనపుడు, అత్యంత అభ్యుదయకర విప్లవ సిద్ధాంతం వారికున్నప్పుడూ ఏమి సాధించవచ్చునో ఈ విజయాలు మానవాళికి చూపుతాయి.

సోషలిజం, మార్క్సిజం—లెనినిజం పతాక క్రింద పురోగమించే అసంఖ్యాక ప్రజల సృజనాత్మక కార్యకలాపాలనుండి ఉద్భవిస్తుంది. కమ్యూనిస్టులు, బలవంతంగా కృత్రిమ పద్ధతుల ద్వారా ఏ ప్రత్యేక సాంఘిక — రాజకీయ వ్యవస్థనైనా ఇతర దేశాలలో ప్రవేశపెట్టడానికి వ్యతిరేకులు. చివరకు సోషలిస్టు సిద్ధాంతం ప్రతిచోటా విజయం సాధిస్తుందని మనం నమ్ముతున్నాం. అయితే మనం, ఇతర దేశాల అంతరంగిక విషయాలలో జోక్యం కల్పించుకోవడం ద్వారా ఈ విజయాల్ని సాధించడానికి యత్నిస్తామని అర్థంకాదు.

ప్రజలు తమను అణగద్రొక్కే వారికి వ్యతిరేకంగా ఏ చర్య తీసుకున్నా, అందుకు కమ్యూనిస్టులమైన మనల్ని నిందించడానికి ప్రయత్నాలు జరుగుతాయి. పెట్టుబడిదారీ దేశం లేదా వలస దేశంలోని శ్రామిక ప్రజలు ఎప్పుడు ఎదురుతిరిగినా, దాన్ని "కమ్యూనిస్టుల పని" అనో, లేదా "మాస్కో కుట్ర" అనో సామ్రాజ్యవాదులు ఆరోపిస్తూంటారు. ప్రజల సత్కార్యాలన్నింటినీ సామ్రాజ్యవాదులు కమ్యూనిస్టులకు అంటకట్టడుతున్నందుకు మనం సంతోషించాలి. సామ్రాజ్యవాదులీపని చేయడంద్వారా తమకు తెలియకుండానే, కమ్యూనిస్టు భావాలను బాగా అవగాహన చేసుకోవడానికి ప్రజలకు తోడ్పడుతున్నారు. ఈ భావాలు ప్రపంచమంతటా పరివ్యాప్తమవుతున్నాయి. కాని యిది సోవియట్ దేశమూ, తదితర సోషలిస్టు దేశాలు ఆ భావాలను ప్రజలపై బలవంతాన రుద్దుతున్నందువల్ల జరుగుతున్న పనికాదు. గతంలో ప్రజలు చెప్పినట్లు, సన్నీలు చూపిగాని, లేదా యిప్పుడు అనవలసినట్టు రాకెట్లు చూపిగాని భావాలను ఎవరూ నూరిపోయలేరు.

పరస్పరం సంఘర్షించుకొనే వర్గాలు ఎప్పుడూ తమకు బయటనున్న ఆప్తులైన శక్తులనుండి సహాయ సహకారాలను తప్పక పొందుతాయి. ఈ విషయంలో చాలకాలంపాటు బూర్జువా వర్గం లాభం పొందింది. ప్రపంచ బూర్జువా వర్గం అంతా కుమ్మక్కయి, అంతటా, అన్ని విధాలా విప్లవ

కేంద్రాలను, సాయుధ జోక్యంతో కూడా ధ్వంసం చేశాయి. ఇటువంట ప్పుడు కూడా, అంతర్జాతీయ శ్రామిక వర్గం తన వర్గ సోదరుల పోరాటం పట్ల తమకేమీ పట్టనట్లు వూరుకోలేదన్న సంగతి చెప్పనక్కరలేదు. కాని ఎక్కువసార్లు అది వారికి నైతిక సహాయాన్ని మాత్రమే యివ్వగలిగింది. అప్పటికీ యిప్పటికీ పరిస్థితులు మారాయి. పోరాటానికి ఉద్యమించిన ఒక దేశ ప్రజలు, ప్రపంచ సామ్రాజ్యవాదంతో తామొక్కరే ఏకాకిగా పోరా డరు. బలమైన నైతిక, భౌతిక సహాయానికి అవసరమైన సాధన సంప త్తింతా కలిగివున్న శక్తివంతమైన అంతర్జాతీయ శక్తుల సహాయం ఆ ప్రజ లకు ఉంటుంది.

విప్లవ పోరాట స్థాయికి బెదిరిపోయిన సామ్రాజ్యవాదులు, ప్రజల, రాజ్యాల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్పించుకునే తమ ప్రయ త్నాలను కొనసాగిస్తూనే వుంటారు. అందుకనే వారు, తాము కుదుర్చు కున్న సైనిక సంధులలోనూ, ఒప్పందాలలోనూ అంతర్గతమైన అశాంతి అనబడేది ఏర్పడినప్పుడు సాయుధ జోక్యం కలుగచేసుకోవడానికి, అంటే అభివృద్ధి నిరోధక ప్రభుత్వాలకు వ్యతిరేకంగా వచ్చే విప్లవాలను, ప్రజా ఉద్యమాలను అణచివేసే "హక్కు"ను అట్టే పెట్టుకున్నారు. కమ్యూని స్టులు విప్లవాన్ని ఎగుమతిచేస్తారని సామ్రాజ్యవాదులు అడుగడుగునా ఆరో పిస్తూంటారు. ప్రతి విప్లవాలను ఎగుమతి చేయడానికి తమ హక్కును కప్పిపుచ్చుకునేందుకే సామ్రాజ్యవాద మహాశయులకు ఈ నీచారోపణ అవసరమైంది.

ఇది, ఈ పెద్దమనుషులు చేస్తున్న వింత వాదన. వారింకా, ప్రజల విముక్తి ఉద్యమాలను అణగద్రొక్క గలిగిన నాటికాలపు మైకంలోనే వున్న ట్లున్నారు. కాని ఆ రోజులు గతించిపోయాయి. ఇక మళ్ళీ తలెత్తవు. కమ్యూనిస్టులు, విప్లవాలను ఎగుమతి చేయడానికి వ్యతిరేకులు. పశ్చిమ దేశాలవారికి యిది బాగా తెలుసు. కాని ఎవరికైనా ప్రతి విప్లవాన్ని ఎగుమతి చేసే హక్కునూ, అంతర్జాతీయ పోలీసు విధులకు పూనుకొనడాన్నీ మనం

గుర్తించబోము. ఇదికూడా బాగా అర్థంచేసుకోవాలి.

తిరుగుబాటు జరిపే ప్రజల వ్యవహారాలలో జోక్యం కల్పించుకోడానికి సామ్రాజ్యవాదులు జరిపే ప్రయత్నాలు, దురాక్రమణ చర్యలకు దారి తీస్తాయి. తద్వారా అవి ప్రపంచ శాంతికి ప్రమాదకరం. మనం, ప్రతి విప్లవాన్ని సామ్రాజ్యవాదులు ఎగుమతిచేసే పక్షంలో కమ్యూనిస్టులు, సమస్త దేశాల ప్రజలూ సమీకృతులై, తమ శక్తులన్నింటినీ కూడగట్టుకుని, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ బలం అండతో స్వేచ్ఛకూ, శాంతికీ శత్రువులైనవారిని గట్టిగా త్రిప్పికొట్టమని విజ్ఞప్తి చేస్తారని స్పష్టంగా చెప్పాలి. మరో మాటలో చెప్పాలంటే, ఎలాగ విత్తును నాటేవో, అలాగే పంటను తీసుకుంటావు.

## 3. సోవియట్ విదేశాంగ విధానంలో శాంతియుత సహజీవనం సాధారణ పంథా. శాంతి పోరాటంలో ప్రజలే నిర్ణయాత్మక శక్తి.

కామ్రేడ్స్, ఇప్పుడు మనం సమీక్షిస్తున్న కాలంలో ప్రపంచ శక్తుల సంబంధాలలో ప్రధానమైన మార్పులు వచ్చాయి. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ తనకు మిత్రులుగావున్న దేశాల ప్రజలకే గాకుండా, సమస్త మానవాళికీ, సామ్రాజ్యవాద సైనిక సాహసచర్యలకు వ్యతిరేకంగా గట్టి కవచంగా రూపొందింది. బలాధిక్యతలో సోషలిస్టు దేశాలదే పైచేయిగా వుందన్నది సమస్త మానవకోటికి ఎంతో అదృష్టకరమైన విషయం. పైగా శాంతి శక్తులు ప్రపంచ మందంతటా వృద్ధిచెందాయి.

కొద్ది సంవత్సరాల క్రితం ప్రపంచ వ్యవహారాల్లో—సోషలిస్టు శిబిరం, సామ్రాజ్యవాద శిబిరం అనే రెండు పరస్పర విరుద్ధమైన శిబిరాలుండేవి. ఈరోజున అంతర్జాతీయ వ్యవహారాల్లో చురుకైన పాత్రను, విదేశీ పీడననుండి స్వాతంత్ర్యం పొందిన లేదా పొందుతున్న ఆసియా, ఆఫ్రికా,

లాటిన్ అమెరికా దేశాలు కూడా నిర్వహిస్తున్నాయి. ఈనాడున్న సైనిక-రాజకీయ కూటాలలో దేనికీ చెందని దేశాలన్న అర్థంలో మాత్రమే తటస్థ దేశాలుగా భావింపబడ్డ ఈ దేశాలు, తరచుగా తటస్థ దేశాలుగా వ్యవహరింపబడుతున్నాయి. అయితే వాటిలో ఎక్కువ దేశాలు, నేటి అతిప్రధాన సమస్యయైన యుద్ధమూ-శాంతి సమస్య వచ్చినప్పుడు ఎంతమాత్రమూ తటస్థంగా వుండడంలేదు. ఈ దేశాలు తప్పనిసరిగా శాంతిని బలపరుస్తున్నాయి, యుద్ధాన్ని వ్యతిరేకిస్తున్నాయి. వలస విధానంనుండి స్వేచ్ఛ పొందిన దేశాలు, వలస, సామ్రాజ్యవాదాలకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో ఒక తీవ్ర శక్తిగా మారుతున్నాయి. ఈ దేశాల ప్రయోజనాలను ఉచిత రీతిని పరిగణించకుండా, ప్రపంచ రాజకీయాల మూల విషయాలు యిక పరిష్కరింపబడలేవు.

పెట్టుబడిదారీ దేశాల్లో కూడా, ప్రజలు యుద్ధానికి వ్యతిరేకంగా మరింత ఎక్కువగా గట్టి చర్యలకు దిగుతున్నారు. ఆయుధోత్పత్తి పోటీకి వ్యతిరేకంగానూ, యుద్ధోన్మాదుల వినాశకర విధానానికి వ్యతిరేకంగానూ కార్మిక వర్గమూ, శ్రామిక ప్రజలందరూ పోరాడుతున్నారు.

ఈ విధంగా సామ్రాజ్యవాద రాజ్యాల దురాక్రమణ విధానాన్ని, ఇప్పుడు అభివృద్ధి చెందుతున్న శక్తులు వ్యతిరేకిస్తున్నాయి. సోషలిస్టు దేశాలూ, శాంతి శక్తులన్నీ, కొత్త దురాక్రమణకూ యుద్ధానికీ జరిగే ప్రయత్నాలకు వ్యతిరేకంగా జరిపే పోరాటం, నేటి ప్రపంచ రాజకీయాల్లో ప్రధానాంశం.

గడచిన సంవత్సరాలలో యుద్ధ, దురాక్రమణ శక్తులు పలుసార్లు ప్రపంచ శాంతికి ప్రమాదం తెచ్చిపెట్టాయి. 1956వ సంవత్సరంలో సామ్రాజ్యవాదులు, హంగరీలో ప్రతి విప్లవంతో పాటు ఏకకాలంలో, ఈజిప్ట్‌పై దాడి జరిపారు. 1957 ద్వితీయార్ధంలో సామ్రాజ్యవాదులు సిరియాపై దాడి తలపెట్టారు; ఇది పెద్ద సైనిక ఘర్షణ ప్రమాదాన్ని తెచ్చిపెట్టింది. 1958 వేసవిలో ఇరాక్‌లో విప్లవం దృష్ట్యా, లెబనాన్, జోర్డాన్

లలో వారు జోక్యం చేసుకున్నారు. అదే సమయంలో చైనా ప్రజా రిపబ్లిక్‌కు చెందిన తైవాన్ ప్రాంతంలో ఉద్రిక్త పరిస్థితిని సృష్టించారు. 1960 ఏప్రిల్–మే నెలల్లో అమెరికా సామ్రాజ్యవాదులు తమ సైనిక విమానాన్ని సోవియట్ ఆకాశ మార్గంలోకి పంపి, పారిస్ శిఖరాగ్ర సమావేశాన్ని భగ్నం చేశారు. గత వసంతకాలంలో వారు, కిరాయి మూకలచే క్యూబాపై సాయుధ దాడిని జరిపారు, లావోస్‌ను తమ క్రిందకు తెచ్చుకోవాలని ప్రయత్నించారు. లావోస్‌ను దురాక్రమణ పూరిత ఆగ్నేయాసియా సైనిక కూటమిలో ఇరికించాలని ప్రయత్నించారు. కాని సామ్రాజ్యవాదుల కుట్రలన్నీ విఫలమైనాయి.

అయితే దురాక్రమణ పథకాలు విఫల మవడం వల్ల సామ్రాజ్యవాదులకు బుద్ధి వచ్చిందని భావించడం శుద్ధ పొరపాటు. వాస్తవ విషయాలు ఇందుకు భిన్నంగా వున్నాయి. సామ్రాజ్యవాదులు అంతర్జాతీయ పరిస్థితిని మరింత ఉద్రిక్తం చేయడానికి తమ ప్రయత్నాలను కొనసాగిస్తూనే వుంటారు; ప్రపంచాన్ని యుద్ధ ప్రాంగణంలోకి నెట్టడానికి ప్రయత్నిస్తూనే వుంటారు. ఇటీవల మాసాలలో వారు, ద్వితీయ ప్రపంచ యుద్ధావశేషాలకు స్వస్తిచెప్పి, జర్మనీతో శాంతి సంధిని కుదుర్చుకుని, పశ్చిమ బెర్లిన్‌లో పరిస్థితిని మామూలు స్థాయికి తీసుకురావాలన్న మన ప్రతిపాదనకు సమాధానంగా ఆయుధాలు పుచ్చుకుంటామని బెదిరించి, తద్వారా యూరప్ నడిబొడ్డులో, బుద్ధిపూర్వకంగా ప్రమాదకర పరిస్థితిని సృష్టించారు.

అంతర్జాతీయ పరిస్థితి మరింత ఉద్రిక్తం గావడం దృష్ట్యా, దురాక్రమణ దారులు గిరితప్పి రాకుండా మన దేశాన్ని రక్షించుకోడానికి, మరో ప్రపంచ యుద్ధ విపత్తునుండి మానవాళిని రక్షించేందుకూ తగిన చర్యలను మనం తప్పని సరిగా తీసుకోనాల్సివచ్చింది. 1961వ సంవత్సరానికి ఉద్దేశించిన సాయుధ దళాల సంఖ్య తగ్గింపును సోవియట్ ప్రభుత్వం నిలుపు చేయాల్సి వచ్చింది, రక్షణ వ్యయాన్ని పెంచాల్సి వచ్చింది, సైనికులను రిజర్వుగా మార్చడాన్ని నిలుపుచేయాల్సివచ్చింది, సరికొత్త, ఎక్కువ

శక్తివంతమైన ఆయుధాల పాటవ పరీక్షలకు తిరిగి పూనుకోవాల్సివచ్చింది. ఈ చర్యలన్నింటినీ మనం బలవంతాన తీసుకోవాల్సి వచ్చినవే. ఈ చర్య లను మన ప్రజలు ఏకగ్రీవంగా బలపర్చారు. సోవియట్ యూనియన్ ఎన్నటికీ యుద్ధాన్ని ప్రారంభించదని తెలిసిన ఇతర దేశాల ప్రజలు మన చర్యల్ని సరిగ్గా అర్థం చేసుకున్నారు. సోవియట్ ప్రజలకు, దురాక్రమణ దార్ల పద్ధతులన్నీ బాగా కరతాలా మలకమే. దేశ భక్తియుత మహా యుద్ధపు సంవత్సరాలను మనం మరచిపోలేదు. సోవియట్ యూనియన్పై హిట్లర్ జర్మనీ జరిపిన విద్రోహకరమైన దాడినీ మనం మరచిపోలేము. సామ్రాజ్య వాదులు సృష్టించిన యుద్ధ విపత్కర పరిస్థితుల్లో ఉదాసీనతకు గాని, అజాగ్రత్తకు గానీ తావులేదు.

దేశ రక్షణ శక్తిని బలోపేతం చేసుకొనేందుకు సోవియట్ ప్రభు త్వం తీసుకున్న చర్యలు, శాంతియుత సహజీవన విధానాన్ని పరిత్యజించ డమేనని పశ్చిమ రాజ్యాలలో కొంతమంది వాదిస్తున్నారు. ఇది అర్థంలేని మాట. శాంతియుత సహజీవన విధానం, మన వ్యవస్థ స్వభావం నుండి ఉద్భవించినది.

ఇక్కడొక వాస్తవాన్ని పేర్కొంటాను. మన దేశం, దేశంలోని విప్లవ విద్రోహుల, విదేశీ జోక్యందార్ల తీవ్రమైన దాడులను త్రిప్పికొడు తున్న సమయంలో సోవియట్ ప్రభుత్వం, ప్రభుత్వ చిహ్నంగా దేన్ని రూపొందించాలన్న విషయమై చర్చిస్తోంది. మొదట గీసిన చిత్రంలో కత్తి వుంది. అందుకు లెనిన్ తీవ్రమైన అభ్యంతరాన్ని తెలిపారు. "దేనికి కత్తి?" అని ఆయన అన్నారు. "దాడులు జరిపి విజయాలు సాధించాల్సిన అవసరం మనకు లేదు. దండయాత్రల విధానం మనకు పూర్తిగా సరిపడ నిది. దేశీయ, విదేశీయ శత్రువులను త్రిప్పికొడుతున్నాంతప్ప, మనం దాడి చేయడం లేదు. మనది రక్షణ యుద్ధం. కత్తి మన చిహ్నం కాదు." ఆ తర్వాత శాంతియుత, నిర్మాణాత్మక శ్రమజీవనా చిహ్నమైన సుత్తీ, కొడవలే మన దేశ చిహ్నంగా రూపొందిన విషయం అందరికీ తెలిసినదే.

వి. ఐ. లెనిన్‌చే నిర్వచించబడి, మన పార్టీ పత్రాలలో అభివృద్ధి చేయబడ్డ శాంతియుత సహజీవన సూత్రాలు సోవియట్ విదేశాంగ విధానానికి ఎప్పుడూ ప్రధాన లక్షణంగానే వుంటున్నాయి. సోవియట్ ప్రభుత్వ విదేశాంగ విధానం, లెనిన్ వేసిన శాంతిబాటను మన పార్టీ, సోవియట్ ప్రజలు మొత్తంగానూ విధేయతతో అనుసరిస్తున్నారనడానికి ప్రబల నిదర్శనం.

అయితే మండే నిప్పుపైన ఒకడు నీరు జల్లుతుండగా, మరొకడు నూనెను పోస్తూంటే ఆ మంటల్ని ఆర్పడం ఎంత కష్టమో అలాగే, యుద్ధ ప్రమాదాన్ని ఏకపక్ష చర్యతో తొలగించడం అంత కష్టం. థర్మో నూక్లియర్ యుద్ధ విపత్తును తప్పించేందుకై మనంతగానూ ఆసక్తిని చూపవలసిన పశ్చిమ రాజ్యాలు, తమవంతుగా వివాదాస్పద సమస్యలను పరస్పర అంగీకార ప్రాతిపదికపై పరిష్కరించుకునేందుకు మార్గాలను వెతకడానికి సంసిద్ధతను చూపాలి.

పశ్చిమ రాజ్యాలలోని కొంతమంది సాత్విక మనస్తత్వం గల వారి వివేకం ఎంతగా వుందంటే, సోవియట్ యూనియన్ గనుక పశ్చిమ రాజ్యాలకు మరిన్ని వెసులుబాటులు చూపితే అంతర్జాతీయ ఉద్రిక్తత పెరగదని భావిస్తున్నారు. సామ్రాజ్యవాద రాజ్యాల విధానాలు, వారి విదేశాంగ విధానం కూడా దురాక్రమణ, యుద్ధమూ అంతర్గర్భితమైయున్న గుత్త పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాలచే నిర్ణయింపబడతాయన్న విషయాన్ని వీరు మరచిపోతున్నారు. ప్రజల ఒత్తిడి మూలంగా, కొద్దో గొప్పో మితవాద విధానాన్ని అనుసరించే వారిది పైచేయి అయితే, అంతర్జాతీయ ఉద్రిక్తత సడలుతుంది; అప్పుడు యుద్ధపిపాసులు కొంతవరకు తొలగిపోతాయి. కాని ఎప్పుడైతే ప్రజల ఒత్తిడి తగ్గిపోయి, ఆయుధోత్పత్తి పోటీపై ఆధారపడి, యుద్ధాన్ని లాభాలు గుంజడానికి అదనపు ఆధారంగా చూచే బూర్జువా వర్గాలకు అనుకూలంగా త్రాసు మొగ్గుతుందో అప్పుడు, అంతర్జాతీయ పరిస్థితి అధ్వాన్నమవుతుంది.

అందువల్ల, సామ్రాజ్యవాదుల దురాక్రమణ ఉద్దేశాలకు వ్యతిరేకంగా ప్రజలంతా నిర్విరామమైన పోరాటం నడపడం ద్వారా మాత్రమే విభిన్న సాంఘిక వ్యవస్థలుగల దేశాల మధ్య శాంతియుత సహజీవనాన్ని కాపాడగల్గడం సాధ్యమవుతుంది. శిబిరం బలం పెరిగిన కొలదీ, పెట్టుబడిదారీ దేశాలలో శాంతికై పోరాటం మరింత ఉధృతంగా సాగినకొద్దీ సామ్రాజ్యవాదులకు తమ దురాక్రమణ పథకాలను అమలుజరపడం అంతగా కష్టమైపోతుంది.

శాంతీ, శాంతియుత సహజీవనమనేవి పూర్తిగా ఒకటికావు. శాంతియుత సహజీవనమంటే, కేవలం యుద్ధం లేకుండా వుండడమనేగాదు. అది రెండు యుద్ధాల మధ్య కుదిరే తాత్కాలికమైన, అస్థిరమైన యుద్ధ విరమణ సంధిగాదు; శాంతియుత సహజీవనమంటే, దేశాలమధ్య వివాదాల పరిష్కారానికి మార్గంగా యుద్ధాన్ని ఉభయత్రా పరిత్యజించడంపై ఆధారపడే రెండు పరస్పర విరుద్ధ సాంఘిక వ్యవస్థల మధ్య సహజీవనమన్నమాట.

సదుపాయాలు కల్పించడం ద్వారా దురాక్రమణదారుణ్ని శాంతపర్చజాలమని చారిత్రక అనుభవం చెపుతోంది. అత్యంత ప్రాముఖ్యత గల విషయాలలో సామ్రాజ్యవాదులకు సదుపాయాలు కల్పించడం అనేది శాంతి సహజీవనం క్రిందకు రాదు. అది, దురాక్రమణ శక్తులకు లొంగిపోవడమే కాగలదు. అందుకు మనమెన్నటికీ అంగీకరించం. మానవాళి భవితవ్యాన్ని తీర్చిదిద్దేది యిక తామెంతమాత్రం కాదన్న సత్యాన్ని సామ్రాజ్యవాదులు గుర్తించాల్సిన సమయం ఆసన్నమైంది. వారికి ఇష్టమున్నా లేకపోయినా సోషలిజం ఉంటుందనీ, అది అభివృద్ధి చెంది, మరింత బలపడి తీరుతుందనీ గుర్తించడం అవసరం. కాని ప్రస్తుతానికి సామ్రాజ్యవాద మహాశయులు, ఈ సత్యాన్ని గ్రహించినట్లు లేరు. కొట్లాది ప్రజల దారుణ మారణ హోమాగ్నికి గురిచేసే తెలివిమాలిన చర్యలకు వారు పూనుకోవచ్చునని ఎవరైనా భావించడం సబబే. అందుకనే మనం దురాక్రమణ

దారుల ఆట కట్టించాలి. అంతేగాని వాళ్ళకు దోహదం చేసి, సాయపడడం తగదు.

అనేక సంఘాలతోనూ, ఉద్యమాలతోనూ సంబంధంవున్న అనేక దేశాలలోని శాంతికాముకులు, దురాక్రమణ, యుద్ధశక్తులకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటానికి ఎంతో దోహదం చేశారు. 1950 తొలి రోజుల్లో కోట్లాది ప్రజలు ఏవిధంగా అణ్వాయుధాలను నిషేధించాలని విజ్ఞప్తి చేశారో, అప్రఖ్యాతిపాలయిన యూరప్ రక్షణ వ్యవస్థ ఏర్పాటుకూ, అందులో పశ్చిమ జర్మనీ చేరడానికి వ్యతిరేకంగానూ యూరప్ ప్రజలు ఎంత క్రోధావేశాలతో నిరసన తెలిపిందీ, ప్రతి ఒక్కరికీ తెలుసు. ప్రజలు పార్లమెంట్లు, ప్రభుత్వాలపైన తీసుకొచ్చిన ఒత్తిడి గట్టి ప్రభావాన్ని కలుగ జేసింది.

మరో యుద్ధ ప్రమాదం యిప్పుడు హెచ్చినందువల్ల, శాంతిని బలపర్చేవారు చేస్తున్న కృషికి నేడు ప్రత్యేకంగా ప్రాముఖ్యత వుంది. ప్రస్తుత పరిస్థితుల్లో, సుహృద్భావం గలవారు కేవలం శాంతికి అనుకూలంగా మాట్లాడ్డంతోనే సరిపెట్టుకోజాలరు, శాంతి రక్షణ కోసం సాధారణ ప్రజలు అనేక చర్యలు జరిపినా, దురాక్రమణ, యుద్ధ శక్తులు రానురాను మరింత మొండిచేస్తున్నాయన్న సంగతి స్పష్టమై వుండవలసింది. వాస్తవానికి కొన్ని సంవత్సరాల క్రితమైతే, ఏ పశ్చిమ రాజ్య రాజకీయ వేత్తకూడా తన భవిష్యత్తుకు ముప్పురాకుండా, పశ్చిమ జర్మనీ సైన్యాన్ని పునరాయుధం చేయాలని సూచించిడానికి సాహసించేవాడు కాదు. కాని ఈనాడు, పశ్చిమ జర్మనీ పునఃసైనికీకరణ ఉధృతంగా సాగిపోతోంది. పశ్చిమ జర్మనీ సైన్యం పశ్చిమ యూరప్‌లో కల్లా పెద్ద సైనిక శక్తిగా తయారైంది. జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్. ఉత్తర అట్లాంటిక్ కూటమిలో భాగస్వామియే గాకుండా ఆ కూటమిలో పెద్దచేయి దానిదేనని పశ్చిమ జర్మనీ యుద్ధ మంత్రి యైన స్ట్రాస్ గొప్పలు చెప్పుతున్నాడు. అంతేగాదు, కొన్ని ఎన్నడూ వినని ఘటనలు జరుగుతున్నాయి: బ్రిటన్, ఫ్రాన్సులు, అంటే గతంలో జర్మనీ,

సైనిక తత్వం వల్ల బాధలు పడ్డ దేశాలు, పశ్చిమ జర్మనీ సైన్యానికి తమ భూభాగాలపైన ప్రయోగ స్థావరాలను, బారకాసులను యిచ్చాయి. తమ సాయుధ దళాలను మాజీ హిట్లర్ జనరల్స్ ఆధిపత్యం క్రింద పెట్టాయి. ఫలితంగా పశ్చిమ జర్మనీ సైనికులు, గత రెండు యుద్ధాలలోనూ సాయుధ శక్తితో చేరుకోలేని బ్రిటిష్ భూభాగంపై నడుస్తున్నారు.

పశ్చిమ జర్మనీ ప్రతీకార వాంఛాపరులు తమ మాతృదేశం పైని వున్నందుకు ఫ్రెంచి, బ్రిటిష్ దేశ భక్తులు వెలిబుచ్చుతున్న కోపావేశా లలో మనమూ పాలుపంచుకుంటున్నాం.

మాటలు దుమారంగా రేగినా, గాలిసాయంతో తిరిగే మిల్లు తిరగ దని ఒక నానుడి. అలాగే శాంతి గూర్చిన మాటలు. దురాక్రమణవాదుల యుద్ధ యంత్రాన్ని నిలిపివేయడం అంతకన్నా కష్టం. కాలం మించిపోక ముందే, సకాలంలో మేల్కొని, యుద్ధోన్మాదుల దుష్టచర్యలను అరికట్టేం దుకు స్థిరంగా తీవ్రంగా కృషిచేయాల్సిన అవసరం వుంది. ఇతర పోరా టాలకువలెనే శాంతికోసం జరిపే పోరాటానికి కూడా బలమైన కృషీ, పట్టు దలా కావాలి. పోరాడేటప్పుడు దెబ్బతీయడమేగాక, దెబ్బతినడం కూడా జరుగుతుంది. మానవజాతి భవిష్యత్తు ప్రమాదంలో చిక్కుకున్న సమ యంలో, ఇది భయపడాల్సినదా? ప్రపంచంపై శాంతి వుండాలా, లేక మానవజాతి మరో ప్రపంచ యుద్ధం వల్ల కలిగే మహా విపత్తుకు ఆహుతి కావాలా అన్నది—అన్నింటికన్నా ప్రజల పైననే, వారి కృతనిశ్చయంపైన, బలపత్తరమైన కృషిపైనె ఆధారపడివుంటున్న సంగతిని గుర్తించాలి. సామ్రాజ్యవాద యుద్ధోన్మాదుల కుట్రలూ కుహ కాలను గూర్చి ప్రజల అప్రమత్తతను పెంచడం అవసరం. యుద్ధం ప్రారంభమయేవరకూ ప్రజల బలమైన యుద్ధ వ్యతిరేక కృషిని ఆపరాదు. ఇటువంటి చర్యను, అణు, థర్మో న్యూక్లియర్ బాంబులు పడడం ప్రారం భించినప్పుడుగాక, వెంటనే తీసుకోవాల్సిన అవసరం వుంది.

ప్రజా సమీకరణ, నిర్మాణం, కృతనిశ్చయంతో కూడుకున్న చర్య

లపైన, శాంతి ఉద్యమం యొక్క బలం ఆధారపడివుంది. ఎవరో కొద్ది మంది గుత్తవర్గాలును మినహాయిస్తే, ప్రజలందరూ, సమాజంలోని అన్ని తరగతులవారూ శాంతినే వాంఛిస్తున్నారు. ఈ లక్ష్యసాధనకు శాంతి విధానాన్నే అనుసరించాలనీ, ఇందుకు అన్ని రకాల పోరాట రూపాలను అనుసరించాలనీ ప్రజలు పట్టుబట్టాలి. సైనిక తత్వం, యుద్ధోన్మత్త భావాలలో మునిగివున్నవారిని ప్రజలు నిరుపద్రవకర శక్తులు మార్చగలరు. అలా తప్పక మార్చాలి. శాంతికోసం జరిగే పోరాటంలో ప్రజలే నిర్ణయాత్మక శక్తి.

# 4. శాంతియుత పద్ధతుల ద్వారా అంతర్జాతీయ సమస్యల పరిష్కారానికి యత్నించాలి. యుద్ధోన్మాదుల కుట్రలూ, కుహకాలనూ బహిర్గతం చేయాలి. దేశాల మధ్య సంబంధాలు అభివృద్ధి చేయాలి

కామ్రేడ్స్, శాంతియుత సహజీవన సూత్రాలకు అనుగుణంగా మూల అంతర్జాతీయ సమస్యలను వెంటనే పరిష్కరించుకోవాలని నేటి పరిస్థితి చెపుతోంది. 20వ పార్టీ మహాసభ అనంతరం సోవియట్ యూనియన్, విశ్వశాంతి ప్రతిష్ఠాపనకూ, దానిని సంఘటిత పరిచేందుకూ విస్తృతమైన వాస్తవికమైన కార్యాచరణ పథకాన్ని ప్రతిపాదించింది. ఈ కార్యక్రమం యొక్క ఉద్దేశం, క్లుప్తంగా చెప్పాలంటే, మానవజాతిని ప్రమాదకరమైన అతి భారమైన ఆయుధోత్పత్తి పోటీనుండి తప్పించి, ద్వితీయ ప్రపంచ యుద్ధావశేషాల్ని తుదముట్టించి, ఆరోగ్యకరమైన అంతర్జాతీయ వాతావరణానికి ఆటంకాలన్నింటినీ తొలగించివేయడం.

సార్వత్రిక, సంపూర్ణ నిరాయుధీకరణకోసం పోరాటం మన పార్టీ విదేశాంగ విధానంలో ప్రధానమైన అంశంగా వుంది. ఈ పోరా

టంలో సోవియట్ యూనియన్ అనేక సంవత్సరాలపాటు పట్టుదలతో కృషిచేసింది. మనం ఎప్పుడూ గట్టిగా ఆయుధోత్పత్తి పోటీని వ్యతిరే కించాం. ఏమంటే, గతంలో యీ రంగంలో పోటీ ప్రజలపై మోయరాని భారాన్ని మోపడమేగాకుండా, ప్రపంచ యుద్ధాలకు తప్పనిసరిగా దారి తీసింది. మనం ఆయుధోత్పత్తి పోటీని యింకా గట్టిగా వ్యతిరేకిస్తున్నాం. ఏమంటే, యుద్ధ తంత్రంలో బ్రహ్మాండమైన సాంకేతిక విప్లవం వచ్చింది గాబట్టి, ఆధునిక ఆయుధాల ప్రయోగం వల్ల కోట్లాది ప్రజల జీవితాలు నాశ నమై పోవడం తప్పదు కాబట్టి.

ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణంలో, యుద్ధోన్మాదంలో యీ ఆయుధా లను నిల్వచేసుకుంటూ పోవడం వినాశకర ఫలితాలను దారితీస్తుంది. పశ్చిమ రాజ్యాలలో ఎక్కడో యీ మారణాయుధాల "మీట"వద్ద పనిలో కూర్చున్న మతి భ్రమించిన ఉద్యోగికి ఎవరైనా వేళ్ళు మరస్తే చాలు, యావత్ప్రపంచ ప్రజలూ గొప్ప ఉపద్రవంలో చిక్కుకునే ప్రమాదం వుంది.

సార్వత్రిక సంపూర్ణ నిరాయుధీకరణకై మన పథకం యొక్క ఉద్దే శం, సామ్రాజ్య వాదం ఎదురుగా వున్నప్పుడు సోషలిజం ఏక పక్షంగా నిరా యుధం కావాలని కాదు, లేదా ముందు సామ్రాజ్య వాదులు ఏక పక్షంగా నిరాయుధులు కావాలని చెప్పడమూ కాదు. వివాదాస్పదమైన అంతర్జాతీయ సమస్యల పరిష్కార సాధనగా విశ్వవ్యాపితంగా నిరాయుధీకరణ జరగా లన్నదే మన పథకం యొక్క ఉద్దేశం. తాము నిరాయుధీకరణకు వ్యతిరే కులమని చెప్పుకోడానికి ధైర్యం చాలక పెట్టుబడిదారీ దేశాలలోని పాలక వర్గాలు, ముఖ్యంగా అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సుల పాలక వర్గాలు, నిరాయు ధీకరణపై నియంత్రణకు సోవియట్ యూనియన్ వ్యతిరేకమని ఒక కథ అల్లారు. పెట్టుబడిదారీ దేశాల కుహకాన్ని మనం బహిర్గతం చేసి, సార్వ త్రిక సంపూర్ణ నిరాయుధీకరణకు మన ప్రతిపాదాలను అంగీకరించే పక్షంలో అవి అత్యంత కఠినమైన అంతర్జాతీయ నియంత్రణ సూచ నలు చేసినా ముందుగానే అంగీకరించడానికి సిద్ధంగా వున్నామని మనం

బహిరంగంగా ప్రకటించాం.

ప్రజలను మోసగించేందుకై సామ్రాజ్యవాదులు, అణ్వస్త్ర పాటవ పరీక్షలు జరపడానికి మనం పూనుకోవలసివచ్చిందన్న వాస్తవాన్ని తమ కపట నాటకంలో ఉపయోగించుకుంటున్నారు. కాని పశ్చిమ రాజ్యాలు, నిరాయుధీకరణ సమస్యా పరిష్కారాన్ని, అణ్వస్త్ర పాటవ పరీక్షలపై సాగే సంప్రతింపులనూ నిష్ప్రయోజనకర స్థాయికి తీసుకొచ్చి, సోషలిస్టు దేశాలపై బలాధిక్యతను సాధించేందుకై తమ యుద్ధ యంత్రాంగాన్ని విపరీత వేగంతో నడపడానికి పూనుకున్న తరువాత మాత్రమే, మనం ఈ చర్యకు పూనుకున్నామన్న విషయాన్ని తెలుసుకోకుండా యిది ప్రజల కళ్ళు కప్పజాలదు. మనం వాటి ఉద్దేశాలను కనిపెట్టి, ఆ విధంగా శాంతిని కాపాడుతున్న సోషలిస్టు శిబిరం యొక్క ఉన్నత స్థానాన్ని భద్రపర్చగలిగాం.

ఈ చర్యలన్ని మనం బలవంతంగా తీసుకోవలసివచ్చినవే. అమెరికా చాలకాలంగా అణు పరీక్షలను పునఃప్రారంభించాలని ప్రయత్నిస్తూన్న విషయం తెలుసు. అలాగే ఫ్రాన్స్‌కు సంబంధించినంతవరకూ ఆ దేశం, పదే పదే అణుపరీక్షలు జరిపింది. ప్రస్తుత పరిస్థితుల్లో, ఆయుధోత్పత్తి పోటీ నుండి బయటపడేందుకు ప్రజాపోరాటంయొక్క అవసరం మరింతగా వుంది. నిరాయుధీకరణ సమస్య ప్రతి జాతి ప్రధాన ప్రయోజనాలకు, మొత్తం మానవజాతి ప్రయోజనాలకు సంబంధించినది. ఈ సమస్య పరిష్కారమైతే అణ్వస్త్రాల అవసరం ఎంతమాత్రమూ వుండదు; అంచేత వాటి తయారీ, వాటి పాటవ పరీక్షల అవసరం వుండదు.

ద్వితీయ ప్రపంచ యుద్ధావశేషాలను తుడిచి పెట్టడం, శాంతి ప్రతిష్ఠాపనకూ, దానిని పటుతరం చేయడానికీ అత్యంత ప్రాధాన్యత గల విషయం. హిట్లర్ దురాక్రమణ మూకలు ఓటమి పొంది పది సంవత్సరాలు గడిచిపోయినా, నేటికీ జర్మనీతో శాంతి సంధిని చేసుకోక పోవడం సహించరాని విషయం. క్షమించరాని యీ ఆలస్యానికి అమెరికా నాయ

కత్వాన వున్న పశ్చిమ రాజ్యాలు మాత్రమే నిందార్హనవి. ప్రజల ప్రయోజనాలను పూర్తిగా నిర్లక్ష్యం చేస్తున్న యీ రాజ్యాలు, యుద్ధం పూర్తయిన వెంటనే జర్మన్ సైనికతత్వాన్ని పునరుజ్జీవింపజేయడానికి పూనుకున్నాయి.

శాంతి సంధిలేకపోవడం ఇప్పటికే బాన్‌లోని ప్రతీకార వాంఛాపరులకు అనుకూలంగా వుంది. అమెరికా సామ్రాజ్యవాదుల అండతో వారు, ఉత్తరోత్తరా దురాక్రమణ జరిపేందుకు ఒక కన్ను వేసి వుంచి తమ సాయుధ దళాలను పునఃస్థాపించారు. యూరప్‌లోని అస్థిర పరిస్థితిని అవకాశం తీసుకొని, తమ పాత శత్రువులను —హిట్లర్ వ్యతిరేక ఐక్య సంఘటనలోని రాజ్యాలు— ఒకరిపై మరొకరిని రెచ్చగొట్టడంద్వారా లాభం పొందుదామన్నది. పశ్చిమ జర్మన్ సైనిక తత్వవాదుల మధుర స్వప్నం. వారు, జర్మనీ ప్రజాతంత్ర రిపబ్లిక్‌ను స్వాహా చేయాలనీ, ఇరుగుపొరుగున వున్న దేశాలను బానిసలుగా చేసుకోవాలనీ, ద్వితీయ ప్రపంచ యుద్ధంలో తాము పొందిన ఓటమికి ప్రతీకారం తీసుకోవాలనీ కలలుకంటున్నారు.

శాంతి సంధి పోట్సుడాం ఒప్పందంలో నిర్వచించబడ్డ జర్మన్ సరిహద్దులను శాశ్వతం చేస్తుందని, ప్రతీకార వాంఛాపరుల చేతులు కట్టివేస్తుందనీ, వారి సాహసిక చర్యలకు పూనుకోకుండా చేస్తుందనీ మనం ఎప్పుడూ చెపుతూనే వున్నాం వాషింగ్టన్ లండన్, పారిస్‌లలో సామాన్య జ్ఞానం జయిస్తుందేమోనన్న ఆశతో, సోషలిస్టు దేశాలు, సంధిపై సంతకాలకోసం చాలకాలం వేచివున్నాయి. ఇప్పటికీ మనం, పరస్పర ఆమోదయోగ్యమైన అంగీకృత పరిష్కార మార్గాలకోసం పశ్చిమ రాజ్యాలతో సంప్రతించడానికి సిద్ధంగా వున్నాం.

ఇటీవల సోవియట్ విదేశాంగ మంత్రి కామ్రేడ్ గ్రోమికో ఐరాస సర్వసభ్య సమావేశానికి హాజరవుతూ, అమెరికా విదేశాంగమంత్రితోనూ, అమెరికా అధ్యక్షుతోనూ సంభాషణలు జరిపారు. ఆయన బ్రిటిష్ విదేశాంగమంత్రి, ప్రధాని మంత్రులతో కూడ సంభాషించారు. ఈ సంభాషణ

లనుబట్టి మనం, పశ్చిమ రాజ్యాలు పరిస్థితిని కొంత అవగాహన చేసుకుంటున్నాయని, జర్మనీ సమస్యకు, పశ్చిమ బెర్లిన్ సమస్యకు పరస్పరం ఆమోదయోగ్య ప్రాతిపదికపై పరిష్కార మార్గాన్ని కనుగొన యత్నిస్తున్నాయని అభిప్రాయపడ్డాం.

కాని పశ్చిమ రాజ్యాల యొక్క, ముఖ్యంగా అమెరికా యొక్క ప్రవర్తన కొంత వింతగావుంది. ఈ దేశాలలో, రాజనీతిజ్ఞుల మధ్య సంభాషణలప్పుడు ఒక విషయం చెప్పబడుతుంది; పత్రికల్లో మరొకరకమైన వార్త వ్రాయబడుతుంది. సంభాషణల సరణిని గూర్చి పత్రికలకు క్లుప్తంగా వివరింపబడ్డా యిలా జరుగుతుంది. పశ్చిమ రాజ్యాల పత్రికలు, జర్మనీ శాంతి సంధి సమస్యను హేతువిరుద్ధమైన, అసంగతమైన పద్ధతిలో చిత్రిస్తాయి. ఉదాహరణకు ఆ పత్రికలు, జర్మనీ సమస్యను పరిష్కరించడంలో, పండ్లతోటను తీసుకుని అందుకు బదులుగా ఒక ఫలాన్ని యివ్వాలని యెవరో కోరుతున్నట్లు ఆరోపిస్తాయి. బహుశా ఆ విధంగా చెప్పేవారికి యీ రకమైన శబ్దాలంకారాలు యిష్టమేమో. కాని యీ ప్రత్యేక ఉదాహరణలో మాత్రం, యీ అలంకారం అసలు వాస్తవ పరిస్థితికి న్యాయం చేకూర్చడం లేదు.

సోవియట్ ప్రభుత్వం, జర్మనీతో శాంతి సంధిని కుదుర్చుకుందామని ప్రతిపాదిస్తున్న విషయం ప్రతి ఒక్కరికీ తెలుసు. శాంతి సంధులు, సాధ్యమైనంత వరకూ దేశాల మధ్య సాధారణ సంబంధాలు ఏర్పడ్డానికై మార్గాన్ని సుగమం చేయడం కోసమూ, మరో యుద్ధ ప్రమాదాన్ని నివారించడం కోసమూ, అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలించడం కోసమూ కుదుర్చుకోబడ్డాయి.

మనం, హిట్లర్ జర్మనీ ఓటమి పొందిన తరువాత ఉత్పన్నమైన వాస్తవ పరిస్థితి దగ్గర నుండి, రెండు జర్మన్ రాజ్యాలు, యుద్ధానంతర సరిహద్దులు ఏర్పడ్డప్పటినుండీ ప్రారంభిస్తాము. ఏ యుద్ధమైనా, అదెంత కఠినమైన, క్రూరమైనదైనా, తుదకు శాంతి సంధిపై సంతకాలు జరగ

దంతో పరిసమాప్తం కావలసిందే. యుద్ధాలు ప్రారంభించే వారెవరైనా అందుకు సంజాయిషీ చెప్పుకోవలసి వుంటుంది, దురాక్రమణకు నష్ట పరిహారం చెల్లించాల్సి వుంటుంది. అంచేత పళ్ళతోట సంగతిగాని, పండు సంగతిగాని వచ్చేదెక్కడ ?

శాంతి సంధిపైన సంతకాలు చేస్తే, అది సోవియట్ యూనియన్‌కు, తదితర సోషలిస్టు దేశాలకే ప్రమాదమని చెప్పి, కొంతమంది పశ్చిమ రాజ్యాల రాజకీయ వేత్తలు మనకు సలహాయిస్తున్నారు. దీనివల్ల మనం తెలుసుకోవాల్సిందేమిటి? యుద్ధాలనేవి ఎప్పటినుండి ఒక పక్షానికి మాత్రమే ప్రమాదకరంగా భావించబడుతున్నాయి ? సామ్రాజ్యవాద రాజ్యాలు పెత్తనం చెలాయించిన రోజులు శాశ్వతంగా పోయాయి. సోవియట్ యూనియన్ యీనాడు, ఒక మహాశక్తివంతమైన సోషలిస్టు రాజ్యం. బ్రహ్మాండమైన సోషలిస్టు కుటుంబం, అభివృద్ధి చెందిన పరిశ్రమలు, వ్యవసాయంతో, పెంపొందిన విజ్ఞాన, సాంకేతిక విజ్ఞానాలతో, మంచి ప్రగతిని సాధిస్తోంది.

మనకు అభివృద్ధి చెందిన పరిశ్రమలు, వ్యవసాయం వున్నందున, మన సోవియట్ సైన్య ఆయుధ సంపత్తి అత్యాధునిక ప్రమాణాలను అందుకున్నదని సామ్రాజ్యవాద వర్గాలు అంచనా వేసుకోగలవనే నేను భావిస్తున్నాను.

ప్రస్తుతం సామ్రాజ్యవాద దురాక్రమణ శక్తులపై సోషలిస్టుశక్తులూ, శాంతికోసం పోరాడే సమస్త శక్తులదే పైచేయన మనం భావిస్తున్నాం. కాని మన బలాబలాలు సమాన స్థాయిలో వున్నాయని కొద్దికాలం క్రితం అమెరికా అధ్యక్షుడు చెప్పినమాట నిజమే అనుకున్నప్పటికీ, యుద్ధపు బెదరింపులకు దిగడం శుద్ధ తెలివి తక్కువ పని. సమానస్థితి వున్నదని అంగీకరిస్తున్నవారు సరైన అభిప్రాయాలు ఏర్పరుచుకోవాలి. నేటి మన కాలంలో బలాధిక్యతా ధోరణితో విధానాలను అనుసరించడం ప్రమాదకరం.

పశ్చిమ రాజ్యాలతో గాని, లేదా అవి లేకపోయినా సరే. జర్మనీ శాంతి సంధిపై సంతకాలు జరగాల్సిందే, అలా జరిగి తీరుతుంది కూడా.

ఈ సంధి, పశ్చిమ బెర్లిన్ నగరాన్ని స్వేచ్ఛా నిస్సైనిక నగరంగా మార్చడం ద్వారా అక్కడ మామూలు పరిస్థితులు ఏర్పడ్డానికి కూడా దోహదం చేస్తుంది. పశ్చిమ రాజ్యాలూ, ప్రపంచంలోని అన్ని యితర దేశాలన్నీ, అంతర్జాతీయ న్యాయచట్టాలకు అనుగుణంగా పశ్చిమబెర్లిన్‌తో రాకపోకలు సాగించే హక్కును పొందాలి. అంటే, పశ్చిమ బెర్లిన్ తదితర బాహ్య ప్రపంచానికి మధ్య సాగే రాకపోకలన్నీ తూర్పు జర్మనీకు ప్రజా రిపబ్లిక్ భూభాగం గుండానే సాగాలి కాబట్టి, పై రాజ్యాలన్నీ ఆ రిపబ్లిక్ ప్రభుత్వంతో తగిన ఒప్పందాన్ని కుదుర్చుకోవాలి.

ఈ సంవత్సరం మనం జర్మన్ శాంతి సంధి ఏర్పాటుకై చేసిన ప్రతిపాదనలు శ్రీముఖంగా వున్నట్లు కొంతమంది పశ్చిమ రాజ్యాల ప్రతినిధులు అంటున్నారు. కాని అది సరికాదు. ఏమంటే, ఎప్పుడో 1958 ప్రాంతంలో సోవియట్ యూనియన్, శాంతిసంధి ప్రతిపాదన చేసి, అది ప్రాతిపదికగా పశ్చిమ బెర్లిన్ నగరాన్ని స్వేచ్ఛా నగరంగా మార్చడం ద్వారా పశ్చిమ బెర్లిన్ సమస్యను పరిష్కరించుకోవాలని సూచించింది. అప్పటికీ యిప్పటికీ చాలకాలం గడచిపోయింది. పశ్చిమ రాజ్యాలతో పరస్పర అవగాహనకు రాగలమన్న ఆశతో మనం సమస్యా పరిష్కారానికి తొందర చేయలేదు. అందువల్ల, శ్రీముఖం గూర్చి ఎందుకీ మాటలని మనం అడగడం సబబే. జర్మనీ శాంతి సంధిని సూచించడంలో సోవియట్ యూనియన్ శ్రీముఖమేమీ యివ్వలేదు. ఈ తక్షణ సమస్య చివరకు పరిష్కారం కావల్సిన అవసరమే యీ సంధి ప్రతిపాదనను చేయించింది.

సోవియట్ ప్రభుత్వం లోగడవలెనే ఇప్పుడు కూడా జర్మనీ సమస్య సాధ్యమైనంత త్వరలోనె పరిష్కారం కావాలని పట్టుపడుతుంది. ఈ సమస్యను అంతన్నదిలేకుండా పరిష్కరించంగాకుండా వుంచడానికి అది వ్యతిరేకం. జర్మనీ సమస్యా పరిష్కారానికి పశ్చిమ రాజ్యాల సంసిద్ధత

వెలిబుచ్చితే, జర్మనీ శాంతి సంధిపై సంతకాలు చేసే కాలపరిమితి సమస్య అంత ప్రధానమైనదిగా వుండదు. అప్పుడు, 1961 డిసెంబర్ 31 లోగానే ఖచ్చితంగా జర్మనీ శాంతి సంధిని కుదుర్చుకోవాలని మనం పట్టు బట్టం. ఇంతకూ ప్రధాన విషయమేమిటంటే, యీ వ్యవహారాన్ని పరిష్కరించటం, జర్మనీతో శాంతి సంధిపై సంతకాలు చేయడం ద్వారా ద్వితీయ ప్రపంచ యుద్ధావశేషాల్ని తొలగించడం. ఇదే అసలు మూల సమస్యా, కీలక అంశమున్నూ.

ఈ సమస్యలు పరిష్కారమైతే, దేశాల మధ్య బహుముఖంగానూ, ద్విపక్షంగానూ శాంతియుత సహకార రంగంలో మరికొన్ని ముందడుగులు వేయడానికి మార్గం సుగమమవుతుంది. జర్మన్ శాంతి సంధిని కుదుర్చుకోవడంతోపాటు శాంతిని మరింత బలవత్తరం చేసేందుకు, యింతకన్నా యింకేమి చేయాల్సి వుంటుంది?

ఐక్యరాజ్య సమితి యంత్రాంగం బాగా అభివృద్ధి చెయడమనే సమస్య, చాలకాలంగా పరిష్కారంకోసం వేచివుంది. ప్రచ్ఛన్న యుద్ధ సంవత్సరాలలో ఈ యంత్రాంగం త్రుప్పుపట్టిపోయింది. చపలచిత్తంతో పనిచేస్తోంది. ఇక ఇప్పుడు దాన్ని శుభ్రపర్చాల్సిన సమయం వచ్చింది, దానికి పట్టిన తుప్పును వదలించాలి, ఇటీవల సంవత్సరాలలో అంతర్జాతీయ పరిస్థితిలో వచ్చిన మార్పులకు అనుగుణంగా యీ యంత్రాంగంలో కొత్త శక్తిని నింపాలి. చైనా ప్రజా రిపబ్లిక్‌కు ఐరాసలో దాని న్యాయమైన హక్కులను కల్పించాల్సిన సమయం ఆసన్నమైంది. ఐరాసలో జర్మనీ ప్రజలకు ప్రాతినిధ్యం విషయంపై నిర్ణయం తీసుకోవాల్సిన సమయం ఆసన్నమైంది. ఇప్పుడున్న పరిస్థితుల్లో, వాస్తవంగా వున్న ఉభయ జర్మనీలతోనూ శాంతి సంధిని కుదుర్చుకోవడం అత్యంత హేతుబద్ధమైన పరిష్కార మార్గం కాగలదు. వాటిని ఐరాసలో చేర్చుకోవాలి. ప్రపంచంలో నేడున్న సోషలిస్టు, తటస్థ, సామ్రాజ్యవాద వ్యవస్థలు మూడూ గల దేశాలకు ఐరాస సంఘాలన్నింటిలోనూ నిజమైన సమాన హక్కులు లభింపజేయా

ల్సిన సమయం వచ్చింది. ఐరాసను పశ్చిమ రాజ్యాల సైనిక కూటమి ప్రయోజనాలకోసం వినియోగించుకునే ప్రయత్నాలకు స్వస్తి చెప్పవలసిన సమయం వచ్చింది.

వలస నిరంకుశత్వాన్ని సకల రూపాలలో పూర్తిగా నిషేధించవలసిన సమస్యను, ప్రజల ప్రధాన ప్రయోజనాలకు అనుగుణంగా పరిష్కరించాలి. అదే సమయంలో ప్రజలకు మాటల్లోకాకుండా చేతల్లో సహాయం అందజేయాలి, వలస పాలనవల్ల కల్గిన దుష్ఫలితాలను రూపుమాపాలి. ఈ దేశాల ప్రజలు, సాధ్యమైనంత త్వరగా ఆర్థికంగా, సాంస్కృతికంగా అభివృద్ధిచెందిన దేశాల స్థాయిని చేరుకునేందుకు వారికి సహాయపడాలి. వలసరాజ్యాలు తాము దోచుకున్న సంపదలో దోచుకోబడ్డ దేశాలకు కనీసం కొంత మొత్తమైనా తిరిగి చెల్లించివేయాలి-యీ విధంగా యీ లక్ష్యాన్ని ప్రధానంగా చేరుకోవడం జరుగుతుందని భావిస్తున్నాం. సోవియట్ యూనియన్, తదితర సోషలిస్టు దేశాలు ఇప్పటికే ప్రజలకు, ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో నిస్వార్థతతో, స్నేహపూర్వక సహాయ సహకారాలను అందజేస్తున్నాయి. ఈ సహాయాన్ని మనం యికముందు కూడా అందిస్తాం.

తక్షణ ప్రాంతీయ రాజకీయ సమస్యల పరిష్కారం, ఆరోగ్యకరమైన అంతర్జాతీయ వాతావరణాన్ని సాధించడంలో మంచి ముఖ్య పాత్రను ధరించగలదు. అణ్వస్త్ర రహిత మండలాలను, ముఖ్యంగా యూరప్‌లోనూ, దూరప్రాచ్యంలోనూ యేర్పర్చాలన్న సమస్యకు మనం యెక్కువ ప్రాధాన్యతనిస్తున్నాం. వార్సా సంధి రాజ్యాలకు, ఉత్తర అట్లాంటిక్ సైనిక కూటమిలోని రాజ్యాలకు మధ్య నిరాక్రమణ సంధి కుదిరితే అది, భద్రతను పెంపొందించడానికి చాలవరకు తోడ్పడుతుంది. అలాగే సైనిక సంధి దేశాల సాయుధ దళాలను విభజించే మండలాల ఏర్పాటు విషయమై కూడా ఒక ఒప్పందం కుదుర్చుకోవచ్చు. ఈ విధంగా విదేశీ భూభాగాలపై వున్న సాయుధ దళాల సంఖ్యను తగ్గించడానికి

ప్రారంభంచేయవచ్చు. అన్ని సైనిక సంధులూ రద్దుకావాలని, సాయుధ సేనలు తమతమ జాతీయ సరిహద్దు లోపలికి ఉపసంహరింపబడాలనీ సైనిక కూటాలలోని దేశాలన్నీ కలసి హేతుపూర్వకమైన నిర్ణయానికి వస్తే, అది అత్యంత ఉత్తమమైన, సమూలమైన సమస్యా పరిష్కారమే కాగలదు.

క్లుప్తంగా చెప్పాలంటే, ఉభయత్రా వాంఛ వుంటే, దేశాలు యుద్ధ ప్రమాదాన్ని తగ్గించి, ఆ ప్రమాదాన్ని మొత్తంగా తొలగించేందుకు దోహద పడే అనేక ఉపయోగకర చర్యలను తీసుకోవచ్చు.

సమస్త దేశాలతోనూ మరింత విస్తృతమైన వ్యాపార సంబం ధాలు పెట్టుకోవడంవల్ల యింతకంటె మంచి అంతర్జాతీయ పరిస్థితికి మార్గం లభిస్తుంది.

సోషలిస్టు దేశాలతో మన సంబంధాలు చిరకాలం వుండే సౌభ్రా తృత్వ, మైత్రీ, సహకార సంబంధాలుగా వుంటున్నాయి; ఇకముందూ వుంటాయి. ఈ దేశాలతో మనం అంగీకృత దీర్ఘకాల పథకాల ప్రాతిపది కపై, పరస్పర లాభదాయకమైన ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలను విస్తృతపర్చుకుని, అభివృద్ధి చేసుకుంటాం. ఇటువంటి సహకారం, మనం అంతా సోషలిజం, కమ్యూనిజం మార్గంపై మరింత త్వరగా సాగిపోవడా నికి దోహదం చేస్తుంది.

ఆసియాలో రెండు గొప్ప దేశాలైన భారత, ఇండొనేషియాలతో మన సహకారం విస్తృతమవుతున్నందుకు మన ప్రజలు గాఢంగా సంతృప్తి పడుతున్నారు. ఈ దేశాలు విజయాలు పొందుతూంటే మనం ఆనందిస్తాం. వాటికున్న చిక్కులను గుర్తిస్తాం. ఆ దేశాల ఆర్థిక, సాంస్కృతికాభి వృద్ధికి దోహదంచేసే వర్తక సహకారాన్ని విస్తృత పర్చడానికి మనం సిద్ధంగా వున్నాం. ఇదే పద్ధతుల్లో, బర్మా, కాంబోడియా, సింహళం, ఐక్య అరబ్ రిపబ్లిక్, ఇరాక్, గినీ, ఘనా, మాలీ, మొరాకో, ట్యూనిషియా, సోమాలి మొదలైన, విదేశీ నిరంకుశత్వం నుండి విముక్తి పొందిన తదితర ఆసియా, ఆఫ్రికా దేశాలతో మన సంబంధాలు జయప్రదంగా అభివృద్ధి చెందుతున్నాయి.

సిరియా అరబ్ రిపబ్లిక్‌తో వ్యాపార సంబంధాలను మనం అభివృద్ధి చేసుకుంటాం.

సుదీర్ఘ. సంక్లిష్టమైన విషమ పరిస్థితుల అనంతరం, పాట్రిస్ లుముంబా ప్రభుత్వానికి తాను వారసురాలనని ప్రకటించుకున్న ప్రభుత్వ మొకటి కాంగోలో ఏర్పడింది. వలస పీడనవల్ల కల్గిన చెడుగులను అధిగమించేందుకు జరుపుతున్న పోరాటంలో తమనెదుర్కొంటున్న క్లిష్ట సమస్యలను పరిష్కరించుకోవడంలో కాంగో ప్రజలకు సోవియట్ ప్రభుత్వం సాయంచేయడానికి సిద్ధంగా వుంది.

అలాగే లాటిన్ అమెరికా దేశాలతో కూడా మన సంబంధాలు, ఈ సమీక్షింపబడుతున్న కాలంలో అభివృద్ధి చెందాయి. ఈ దేశాలలోని అభివృద్ధి నిరోధక శక్తులూ, అమెరికా సామ్రాజ్యవాదులూ అనేక కృత్రిమ అడ్డంకులను సృష్టించినప్పటికీ ఈ సంబంధాలు అభివృద్ధి చెందాయి. ఈ అడ్డంకులను తుత్తునియలు చేసిన క్యూబా వీరప్రజానీకం, ఇతర దేశాలతో సమాన స్థాయిని సహకారం నెరపుకొంటోంది. లాటిన్ అమెరికా దేశాలు స్వతంత్ర విధానాన్ని అనుసరించకుండా తాము నిరోధించగలిగినంత కాలమూ అమెరికన్ సామ్రాజ్యవాదులు ఎంతకైనాసరే పూనుకున్నప్పటికీ, చివరికి చట్టబద్ధమైన ప్రభుత్వాలను కూలద్రోయడానికి కూడా వెనుకాడర పోయినా, ఘటనలు తమ సహజగతిని సంభవిస్తాయి.

నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు తమ కాళ్ళమీద తాము నిలబడేందుకుగాను, బాగా బలపడి, అంతర్జాతీయ వ్యవహారాలలో వాటికి తగిన స్థానం లభించేందుకు మనం సహాయం చేస్తూనే వుంటాం. ఈ దేశాలు శాంతి, అభ్యుదయ మహా లక్ష్యాల సాధనకై విలువైన దోహదం చేస్తున్నాయి. ఈ కృషిలో సోవియట్ యూనియనూ, తదితర సోషలిస్టు దేశాలూ ఈ దేశాలకు నిజమైన, నమ్మదగిన మిత్రులుగా ఎప్పుడూ వుంటాయి.

ప్రధాన పెట్టుబడిదారీ దేశాలతో, ముఖ్యంగా అమెరికాతో సంబం

ధాలకు మనం ఎక్కువ ప్రాధాన్యతనిస్తాం. అమెరికా విదేశాంగ విధానం ఇటీవల సంవత్సరాలలో ఎప్పుడూ, అంతర్జాతీయ పరిస్థితిని అధ్వాన్నం చేయడంపైననే కేంద్రీకరించుతోంది. ఇందుకు శాంతికాముక ప్రజలంతా విచారిస్తున్నారు. ఇక సోవియట్ యూనియన్‌కు సంబంధించినంత వరకూ సాంఘిక వ్యవస్థలేవైనా, వివిధ దేశాల మధ్య సంబంధాలను మామూలు పరిస్థితికి తేవడమెక్కువే. సర్వ విధ్వంసకర ప్రపంచ యుద్ధ నివారణ పరిష్కారమార్గమని ఎప్పుడూ చెపుతూనే వుంది. అంచేత ఇందుకు సకుష్టి చర్చలవసరం. అమెరికాలోని పాలకవర్గాలు సోషలిజాన్ని వరిస్తాయనిగాని, లేదా మనం పెట్టుబడిదారీ విధానాన్ని ప్రేమిస్తామని వారు గానీ ఆశిస్తారని ఎవరూ ఆశించరు. ఇంతకూ ముఖ్యవిషయమేమిటంటే, వారు యుద్ధం ద్వారా వివాదాలను పరిష్కరించాలన్న భావాన్ని పరిత్యజించాలి, శాంతియుత ఆర్థిక పోటీ సూత్ర ప్రాతిపదికపై అంతర్జాతీయ సంబంధాలను ఏర్పరుచుకోవాలి. అమెరికా విధానాలలో వాస్తవికతదే పైచేయి అయితే, సాధారణ ప్రపంచ పరిస్థితికున్న తీవ్రమైన అడ్డంకి తొలగిపోతుంది. ఈ రికమైన ఆలోచన వల్ల మన రెండు దేశాల ప్రజలేగాకుండా, ఇతర దేశాల ప్రజలూ కూడా లాభపడతారు, అది ప్రపంచ శాంతికి లాభదాయకం.

మనం బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీ, పశ్చిమ జర్మనీ, తదితర పశ్చిమ యూరప్ దేశాలతో సాధారణ, వ్యాపార సరళిలో ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలను విస్తృతపర్చి పెంపొందించుకోవాలని వాంఛిస్తున్నాం. ఈ విషయంలో యిటీవల సంవత్సరాలలో కొంత అభివృద్ధి జరిగింది. ఇది ఆ దేశాలు, పరిస్థితిని అభివృద్ధి చేయాల్సి వుంటుంది.

సోవియట్ యూనియన్ తన ఇరుగు పొరుగు దేశాలతో సంబంధాల పెంపుదలకు ప్రత్యేక శ్రద్ధతీసుకొంటుంది. సోవియట్ దేశానికీ, ఆఫ్గనిస్తాన్, ఫిన్లాండ్ లాంటి దేశాలకూ మధ్య స్నేహపూర్వకమైన పరస్పర లాభకరమైన సంబంధాల అభివృద్ధికి, సాంఘిక, రాజకీయ వ్యవస్థల మధ్య తేడాలు అడ్డంకిగా లేవు. ఆస్ట్రియా, స్వీడన్‌లతో, మన సంబంధాలు బాగా అభివృద్ధి

చెందుతున్నాయి. నార్వే, డెన్మార్క్‌లతో మనం మంచి సంబంధాలకోసం ప్రయత్నించాం. ఇకముందూ ప్రయత్నిస్తాం. మన పొరుగుదేశం టర్కీతో సంబంధాలు యిటీవల మెరుగవుతున్నాయి. ఇవి అభివృద్ధి చెందుతూ వుండాలని వాంఛిస్తున్నాం.

అలాగే సోవియట్ యూనియన్ తన ఇరుగు పొరుగు దేశాలైన ఇరాక్, పాకిస్తాన్, జపాన్‌లతో కూడా శాంతి స్నేహాలతో జీవించ కోరుతోంది. దురదృష్టవశాత్తూ, యీ దేశాలలోని పాలక వర్గాలు ఇంతవరకూ, తమపై పశ్చిమ రాజ్యాలు రుద్దిన సైనిక కూటాలనుండి విడిపడలేక పోయాయి, లేదా విడివడ్డానికి యిష్టంలేకనైనా వుండాలి. అలాగే యీ దేశాల పాలక వర్గాలు, మన దేశంతో వర్తక సహకారావకాశాలను వినియోగించుకోలేకపోతున్నాయి. ఈ దేశాల ప్రభుత్వాలు ప్రస్తుతం అనుసరించే విధానాలు ఆ దేశాల ప్రజలకు హానికరంగా వున్నాయి. ఈ విషయంలో ఇరాన్ రాజుదే అగ్రతాంబూలం. ఈయన దురాక్రమణపూరితమైన సెంటో ప్రయోజనార్థం, ఇరాన్ దేశంలో దాదాపు సగభాగాన్ని మృత్యుమండలంగా మార్చేంతవరకూ వెళ్ళారు.

జపాన్‌తో తన సంబంధాలను అభివృద్ధిచేసుకోవడానికి సోవియట్ యూనియన్ తగినంత కృషి చేసింది. కాని జపాన్ ప్రభుత్వం, అసమ సైనిక సంధితో అమెరికాకు ముడిపడి వున్నందున, ఇప్పటికీ ద్వితీయ ప్రపంచ యుద్ధావశేషాలకు స్వస్తిచెప్పడానికి నిరాకరిస్తోంది. సోవియట్-జపాన్ శాంతి సంధి లేకపోవడంవల్ల, మన రెండు దేశాల మధ్య విస్తృత సహకారానికి తీవ్రమైన ప్రతిబంధకంగా వుంది. దాని ఫలితంగా జపాన్‌కు అపార నష్టం కలుగుతున్న సంగతిని జపాన్ ప్రజలు నానాటికీ బాగా గుర్తిస్తున్నారు. అక్కడ త్వరలోనే ఎప్పుడో ఒకప్పుడు సామాన్య జ్ఞానం తలెత్తి, జపాన్‌తో మన సంబంధాలు ఉభయ దేశాలకు లాభదాయకంగా వుండేలాగున సరైన అభివృద్ధిని సాధిస్తాయని మనం ఆశిస్తున్నాం.

శాంతియుత సహజీవనంలో ఒక ప్రధానాంశంగా ఆర్థిక సంబం

ధాల పాత్ర ఎక్కువవుతోంది. మనం సమీక్షించుకుంటున్న యీకాలంలో సోవియట్ విదేశ వర్తకం దాదాపు రెట్టింపు పెరిగింది. మనకు 80 దేశాల కన్నా ఎక్కువ దేశాలతో స్థిరమైన వాణిజ్య సంబంధాలున్నాయి. కాని, పశ్చిమరాజ్యాలు తమ ప్రతిబంధక చర్యలను నిలుపుచేసి, సోషలిస్టు దేశాలతో వర్తక సహకారాన్ని దెబ్బతీసేటట్టుగా తరచుగా నిరంకుశ చర్యలను మాను కుంటే, ఈ సంబంధాలలో యింకా చాలా అభివృద్ధిని సాధించవచ్చు ఈ బూజుపట్టిన చర్యలవల్ల ఎక్కువ హాని కలిగేది ఆ రాజ్యాలకేగాని మనకు గాదు. ఎవరూ వివక్షణకూ, వర్తక ప్రతిబంధకాలకూ, విపరీత దిగ్బంధనలకు పూనుకున్నా, అది వారిని యుద్ధ యత్నాలకు అనుకూలు డుగా, శాంతియుత సహజీవనానికి శత్రువులుగా బహిర్గతం చేయడం తప్పదు.

మన దేశ సాంస్కృతిక సంబంధాలు ఇటీవల కాలంలో బాగా అవి స్తృతమైనాయి. ఈనాడు మనకు ఇటువంటి సంబంధాలు నూరుకన్నా, ఎక్కువ దేశాలతో ఉన్నాయి. ప్రతి సంవత్సరమూ 7 లక్షలకు పైచిలుకు సోవియట్ పౌరులు విదేశాలకు వెళ్తున్నారు: ఇంతకన్నా ఎక్కువ సంఖ్యలో విదేశీయులు మన దేశాన్ని సందర్శిస్తున్నారు. ఉభయత్రా లాభదా యకమైన యీ అంతర్జాతీయ సంబంధాలను పెద్ద స్థాయిలో కొనసాగించా లని మనం వాంఛిస్తున్నాం. ప్రజల మధ్య ఈ సంబంధాలు సహకారాన్ని, అవగాహనను పెంపొందించడంలో ప్రధాన పాత్ర వహించగలవు: వహించాలి.

ఇతర దేశాల నాయకులతో సంబంధాలు పెట్టుకోవడం అనేది సోవియట్ విదేశాంగ విధానంలో ఒక ముఖ్యాంశమైంది. ఇక్కడొక విష యాన్ని గుర్తుచేసుకుందాం; సోవియట్ దేశ విదేశాంగ విధానాన్ని నడిపిన లెనిన్, తనకెంత పని ఒత్తిడి వున్నా, అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచి, ఫిన్లాండ్, ఆఫ్గన్ తదితర విదేశీ ముఖ్యులకు స్వాగతం చెప్పి వారితో సంభాషించేవారు. ఆయన 1922 జినోవా సభకు హాజరు కావాలని ఉద్దేశిం

వారు. ఈ లెనిన్ సంప్రదాయాన్ని అనుసరించడం తన విధిగా పార్టీ కేంద్ర కమిటీ భావించింది. చొరవతో విదేశాంగ విధానాన్ని నడపడంలో సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ అధ్యక్ష వర్గ సభ్యులు తరచు సోషలిస్టు దేశాలను సందర్శించడం జరిగింది. వారు 27 సోషలిస్టేతర దేశాలలో 65 పర్యటనలు జరిపారు. నా మట్టుకు నేను సుదీర్ఘ విస్తృత పర్యటన జరిపాను. అలాచేయక తప్పదు—అవసరం అటువంటిది మరి.

మనం అనేకమంది ప్రముఖ విదేశీ అతిధులకు, యూరప్, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల అధిపతులకు, ప్రభుత్వాధిపతులకూ స్వాగతం చెప్పాం. సోషలిస్టు దేశాల పార్టీల, ప్రభుత్వాల నాయకులు తరచు మన దేశానికి ప్రియ అతిధులుగా వచ్చారు. మనం అనేక దేశాధిపతులతో లేదా ప్రభుత్వాధిపతులతో ఇకముందు కూడా సమావేశాలు జరపడానికి సిద్ధంగా వుంటాం.

కామ్రేడ్స్, 20వ పార్టీ మహాసభ వివరించిన మన పార్టీ విదేశాంగ విధానం సరైనదని ఘటనలు నిరూపించాయి. ఈ విధానాన్ని అనుసరించిన మనం, మన విజయాలు సాధించాం. మన బలం ఘనంగా పెరగడంతో పాటు, శాంతియుత సహజీవన భావం విజయం పొందేందుకు కృషిని మన లెనినిస్టు విధానంతో కొనసాగిస్తాం. ఎప్పటికీ శాంతియుత సహజీవనాన్ని సాధించే అవకాశం నేడున్నది. అప్పుడు యీనాడు ప్రపంచాన్ని చీలుస్తున్న సాంఘిక, రాజకీయ సమస్యలు పరిష్కరింపబడాలి. ఈ భూమండలంపై సోషలిజం సంపూర్ణ విజయం సాధించక ముందే, ప్రపంచంలో కొంత భాగంలో పెట్టుబడిదారీ విధానం మనుతూ వుండగా, సమాజ జీవితంనుండి ప్రపంచ యుద్ధాన్ని తుడిచిపెట్టడం నిజంగానే సాధ్యం కావచ్చునన్న సూచనలు కానవస్తున్నాయి.

మూల సూత్రాలకు సంబంధించినంతవరకూ, లొంగుబాటుతనం చూపకుండా, రాజీలేని పద్ధతిలో వ్యవహరించాలని లెనిన్ బోధించారు.

అతి సంక్లిష్ట పరిస్థితుల్లో, ఒకేఒక సోషలిస్టు దేశం మొత్తం పెట్టుబడిదారీ ప్రపంచపు దాడులను ఎదుర్కొనవలసి వచ్చినప్పుడు, యుద్ధరంగంలోనూ, దానికి వెనుకనూ, కుడి ఎడమలలోనూ మనపై శత్రువు దాడి చేస్తున్నప్పుడు లెనిన్ సామ్రాజ్యవాదులతో ఒక వైపున మృదువైన ధోరణిని అనుసరిస్తూనే, ఎల్లప్పుడూ తానే చొరవ తీసుకుంటూ, మరో వైపున నిక్కచ్చిగా, కరాఖండీగా వ్యవహరించేవారు.

నేటి అంతర్జాతీయ పరిస్థితి సోవియట్ విదేశాంగ విధానంముందుంచుతున్న కర్తవ్యాలేమిటి ?

మనం యీ దిగువ వాటిని కొనసాగించాలి :

సోవియట్ విదేశాంగ విధానం యొక్క సర్వసాధారణ మార్గంగా, విభిన్న సాంఘిక వ్యవస్థలు గల దేశాల మధ్య శాంతియుత సహజీవన సూత్రానికి ఎప్పుడూ కట్టుబడి వుండడం;

సౌభ్రాతృత్వ సహకారం, పరస్పర సహాయం ద్వారా, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ శక్తిని బలోపేతం చేసుకోవడం ద్వారా, సోషలిస్టు దేశాల ఐక్యతను పటుతరం చేయడం;

ప్రపంచ శాంతికై కృషి చేసే అందరితోనూ సహకార, సంబంధాలను పెంపొందించుకోవడం; శాంతి కాముకులందరితో కలసి మనం, యుద్ధ కాముకులను వ్యతిరేకించడం;

కార్మిక వర్గంతోనూ, ప్రపంచంలోని శ్రామిక ప్రజలందరితోనూ, శ్రామిక సంఘీభావాన్ని బలోపేతం చేసుకోవడం; సామ్రాజ్యవాద, వలస పీడన నుండి విముక్తి పొందడానికి పోరాటం నడుపుతున్న, లేదా తమ స్వాతంత్ర్య సుస్థిరత కోసం పోరాడుతున్న ప్రజలకు సంపూర్ణ నైతిక, భౌతిక సహకారాన్ని అందించడం;

సోవియట్ యూనియన్‌తో ఐర్తక సంబంధాలు, ఆర్థిక సహకారం, వ్యాపారం నెలకొల్పుకోవాలని వాంఛించే దేశాలన్నింటితోనూ అటి సంబంధాలను బాగా విస్తృత పరిచడం;

చురుకైన, మృదువైన విదేశాంగ విధానాన్ని అనుసరించడం: ప్రపంచ తక్షణ సమస్యలను సంప్రతింపుల ద్వారా పరిష్కరించుకొనడానికి మనం ప్రయత్నించాలి, యుద్ధోన్మాదుల కుట్రలనూ కూహకాలనూ బహిర్గతం చేయాలి, యిచ్చిపుచ్చుకునే ప్రాతిపదికపై అన్ని దేశాలతోనూ వర్తక సహకారాన్ని నెలకొల్పుకోవాలి.

లెనిన్ మహాశయుడు రూపొందించిన శాంతియుత సహజీవన సిద్ధాంతం, విభిన్న సాంఘిక వ్యవస్థలుగల దేశాలమధ్య శాంతియుత సహజీవన సూత్రం, శాంతిని పరిరక్షించి సర్వమానవ విధ్వంసక ప్రపంచ యుద్ధాన్ని నివారించడానికి మార్గమని అనుభవం ఋజువుచేసింది. ప్రపంచమంతటా శాంతియుత సహజీవనం, శాంతియుత ఆర్థిక పోటీ జయం పొందేందుకు మన శాయశక్తులా పనిచేస్తున్నాం, ఇకముందూ పనిచేస్తాం.



# II

# పెద్ద ఎత్తున కమ్యూనిస్టు నిర్మాణ దశలో సోవియట్ యూనియన్ ప్రవేశం

కామ్రేడ్స్, 20 పార్టీ మహాసభనుండే మన పార్టీ కార్యకలాపాలను నిర్ధరించే ప్రధాన లక్షణ మేమంటే—కమ్యూనిజానికి భౌతిక, సాంకేతిక ప్రాతిపదికను సృష్టించడం, సోవియట్ యూనియన్ ఆర్థిక సంపదను మరింత సుస్థిరం చేయడం, శ్రామిక ప్రజలకు కమ్యూనిస్టు విద్యా: పెరుగుతున్న ప్రజల భౌతిక, నైతికావసరాలను యింకా ఎక్కువగా సంతృప్తి పరచడం అనే పెద్ద యెత్తు కమ్యూనిస్టు నిర్మాణ దశ యొక్క ప్రాథమిక కర్తవ్యాలను నెరవేర్చేందుకు కృషి చేయడం.

ఆర్థిక రంగం అన్ని శాఖలూ ఉరకలు వేసుకుంటూ అభివృద్ధి చెందుతున్నాయని ఈ మహాసభకు నివేదించగలుగు తున్నందుకు పార్టీ కేంద్ర కమిటీ సంతసిస్తోంది. సోవియట్ ప్రజల జీవన ప్రమాణాలు స్థిరంగా పెరుగుతున్నాయి. సోవియట్ విజ్ఞాన శాస్త్రం, సంస్కృతీ నూతన ఉన్నతాభివృద్ధి శిఖరాలను అందుకొన్నది. సప్తవర్ష ప్రణాలిక విజయవంతంగా అమలు జరుపబడుతోంది. ప్రజల తలసరి ఉత్పత్తిలో, బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలను అందుకుని మించిపోవాలన్న ప్రాథమిక ఆర్థిక లక్ష్యాన్ని అమలుజరిపడం విషయమై మన దేశం గొప్ప అభివృద్ధి సాధించింది. సోవియట్ యూనియన్ జనాభా బాగా పెరిగిందని కూడా చెప్పాలి, 20వ పార్టీ మహాసభ నాటికి మన జనాభా 20 కోట్లకు తక్కువవుంది. కాగా, 22వ పార్టీ మహాసభ నాటికి ఈ సంఖ్య 22 కోట్లకు పెరిగింది. కామ్రేడ్స్, ఇది సంతృప్తికరమైన పెరుగుదలే.

మన ఆర్థిక రంగాన్ని అభివృద్ధి చేసుకోవడంలో మనం త్వరిత గతిని అనుసరించాం. లెనిన్ సూచించిన మార్గాన మనం, ఒక మెట్టు తర్వాత మరొక మెట్టుకు చేరుకుంటూ విశ్వాసంతో ముందుకు సాగిపో తున్నాం. మన మహోన్నత లక్ష్యానికి మనం చేరువగా చేరుకుంటున్నాం. ఇప్పుడు మనం, అద్యతన భావిలో సోవియట్ ప్రజలు కమ్యూనిజం పతా కను నాటే ఉజ్వల శిఖరాగ్రాన్నే స్పష్టంగా చూడగల్గుతాం.

## 1. దేశ ఆర్థిక సంపదను బలంగా నిర్మించేందుకు పోరాటం. సప్తవర్ష ప్రణాలిక, కమ్యూనిజం భౌతిక, సాంకేతిక ప్రాతిపదిక సృష్టికి ప్రముఖ దశ.

కమ్యూనిజాన్ని భౌతిక, సాంకేతిక ప్రాతిపదికను సృష్టించడంలో, మొత్తం ఆర్థిక రంగానికి పునాదిగా భారీ పరిశ్రమలు నిర్ణయాత్మక పాత్ర నిర్వహించాల్సి వుంటుంది. ఇక్కడ 20వ పార్టీ మహాసభ తరవాత పారి శ్రామికోత్పత్తి అభివృద్ధికి సంబంధించిన కొన్ని లెక్కలను ఉటంకించడా నికి నాకు అనుమతివ్వండి. నేను ఉల్లేఖిస్తున్న లెక్కల్లో, 1961 సంవత్స రానికి ప్రాథమిక లెక్కలు కూడా యిమిడివుంటాయి 1961వ సంవత్స రం యింకా ముగియకపోయినా, నిర్ణయించుకున్న లక్ష్యాలు అనేక ముఖ్య వస్తువుల విషయంలో మించి ఉత్పత్తి జరుగుతుందని మనం యిప్పుడే చెప్పవచ్చు.

ఆరు సంవత్సరాలకు పారిశ్రామికోత్పత్తి పెరుగుదల దాదాపు 80 శాతం వుంటుంది. ముఖ్యమైన వస్తూత్పత్తి అంకెలు యీ క్రింద యిస్తున్నాను:

| | 1955లో ఉత్పత్తి | 1961లో జరుగుతుందనుకున్న ఉత్పత్తి | 1955 నాటి శాతంతో పోల్చితే 1961 ఉత్పత్తి |
|---|---|---|---|
| దుక్క ఇనుము (000,000 టన్నులు) | 33.3 | 51.1 | 153 |
| ఉక్కు ( ,, ) | 45.3 | 71.0 | 157 |
| రోల్డ్‌గుడ్స్ ( ,, ) | 35.3 | 55.0 | 156 |
| బొగ్గు ( ,, ) | 391 | 513 | 131 |
| నూనె ( ,, ) | 70.8 | 166 | 234 |
| గ్యాస్(000,000,000 ఘనపు మీటర్లు) | 10.4 | 59.5 | 575 |
| విద్యుచ్ఛక్తి(000,000,000 కిలోవాటు గంటలలో) | 170 | 327 | 192 |
| రసాయనిక పరిశ్రమల ఉత్పత్తి (000,000,000 రూబుళ్ళు) | 3.7 | 7.6 | 205 |
| యంత్ర నిర్మాణ పరిశ్రమ-లోహపరిశ్రమల ఉత్పత్తి (000,000,000 రూబుళ్ళు) | 17 | 38 | 224 |
| సిమెంటు(000,000టన్నులు) | 22.5 | 51 | 226 |

అన్నింటికంటే ప్రత్యేకంగా పేర్కొనదగ్గవి, భారీ పరిశ్రమలకు చెందిన అగ్రశాఖలు సాధించిన విజయాలు. ఆరు సంవత్సరాలలో కరగబెట్టిన ఉక్కు మొత్తం 2 కోట్ల 60 లక్షల టన్నులు పెరిగింది. ఇది బ్రిటన్ ఏటా ఉత్పత్తిచేసే ఉక్కుకన్నా ఎక్కువ. నూనె ఉత్పత్తి 9 కోట్ల 50 లక్షల టన్నులు పెరిగింది. ఇది, అయిదు 'బాకూ' నూనె గనులకు సమానం. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 157000 మిలియన్ల కిలోవాటు గంటలలో పెరిగింది. ఈ మొత్తం, నీపర్ నదిపై లెనిన్ విద్యుత్ కర్మాగారానికి తులతూగగల 50 అదనపు కర్మాగారాల శక్తికి సమానం.

ఆధునిక భారీ పరిశ్రమలు ప్రాతిపదికగా, ఆర్థిక రంగంయొక్క

అన్ని శాఖలూ త్వరితగతిని అభివృద్ధి చెందుతున్నాయి. లఘు పరిశ్రమలూ, ఆహార పరిశ్రమలూ బాగా అభివృద్ధి చెందుతున్నాయి. ఆహార పదార్థాలు, బట్టలు, జోళ్లు ఎక్కువగా ఉత్పత్తిచేయడానికి, మానవుడికి అవసరమైన ప్రతీదాన్ని ఎక్కువచేయడానికి, ప్రజల జీవన ప్రమాణాల పెరుగుదలపట్ల పార్టీ ప్రత్యేక శ్రద్ధ చూపుతోంది.

జీవితావసర వస్తువుల ఉత్పత్తి ఏ విధంగా పెరిగిందో ఈ క్రింది కొన్ని లెక్కలు పరిశీలించండి:

| | 1955లో ఉత్పత్తి | 1961లో ఉద్దేశింపబడ్డ ఉత్పత్తి | 1955నాటి శాతంలో 1961ఉత్పత్తి |
|---|---|---|---|
| పరిశ్రమల్లో శుద్ధిచేయబడ్డ మాంసం (000,000 టన్నులు) | 2.5 | 4.5 | 178 |
| ఫ్యాక్టరీలో తయారైన వెన్న (000 టన్నులు) | 463 | 794 | 171 |
| మొత్తం పాలచే తయారైన సరుకు (000,000 టన్నులు) | 2.6 | 9.0 | 345 |
| శాకసంబంధమైన క్రొవ్వు పదార్థాలు (000 టన్నులు) | 1,168 | 1,730 | 148 |
| దుంప చక్కెర (000,000 టన్నులు) | 3.2 | 6.5 | 200 |
| చేపలు (000,000 టన్నులు) | 2.7 | 3.7 | 136 |
| వస్త్రాలు, లోపల వేసుకునే బట్టలు (000,000,000 రూబుళ్లు) | 6.0 | 9.2 | 152 |
| తోలు పాదరక్షలు (000,000 జతలు) | 271 | 443 | 163 |
| టెక్స్టైల్స్ (000,000 చ.మీటర్లు) | 5,543 | 6,661 | 120 |
| ఉన్ని బట్టలు (000,000 చ.మీటర్లు) | 321 | 452 | 141 |
| రేడియో, టెలివిజన్ రిసీవర్లు (000) | 4,044 | 6,345 | 157 |
| గృహోపయోగపు రెఫ్రిజేటర్లు(000) | 151 | 731 | 4.8రెట్లు |
| ఫర్నిచర్ (000,000 రూబుళ్లు) | 491 | 1,280 | 361 |

ఈ లెక్కలనుబట్టి మీరు, జీవితావసర వస్తువుల ఉత్పత్తి యిటీ

ఎల కాలంలోకన్నా ఎక్కువ స్థాయిలో పెరుగుతోందని తెలుసుకోగలరు. ఇప్పుడు మనం యీ సరుకుల ఉత్పత్తిని ఏడాదేడాదికీ పెంచుకోవచ్చు. సప్తవర్ష ప్రణాళిక మూడు సంవత్సరాలలో, 100 కోట్ల మీటర్లకు పైగా బట్టలూ, సుమారు 7 కోట్ల బూట్లు, చెప్పుల జతలూ ప్రణాళికా లక్ష్యాలకు మించి ఉత్పత్తి అయినాయి. అయితే సోవియట్ ప్రజల అవసరాలను యింకా ఎక్కువ సంతృప్తికరంగా తీర్చాలి. సప్తవర్ష ప్రణాళికలో మిగిలిన కాలానికి జౌళీ, పాదరక్షల పరిశ్రమల అభివృద్ధికి, ముడి సరుకులు సప్లయిచేసే పరిశ్రమల అభివృద్ధికీ సోవియట్ ప్రభుత్వం సుమారు 250 కోట్ల రూబుళ్ళు అదనంగా కేటాయించుతూంది. సప్తవర్ష ప్రణాళిక ఆఖరికి మన పరిశ్రమలు ఏడాదికి 900 కోట్ల చదరపు మీటర్ల వస్త్రాలను ఉత్పత్తి చేస్తాయి. పాదరక్షల ఉత్పత్తి సంవత్సరానికి జనాభాలో తల ఒక్కంటికి దాదాపు మూడు జతల చొప్పున వుండగలదు. ఈ వస్తువుల ఉత్పత్తిలో సోవియట్ యూనియన్ బ్రిటన్, ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీలు కలసి చేసిన ఉత్పత్తిని బాగా మించిపోతుంది.

ప్రత్తిపంట విస్తీర్ణాన్ని విస్తృతపర్చి, హెక్టారు ఒక్కంటికీ పంటను పెంచాల్సిన అవసరం వుంది. ఇదొక సమస్య. ఇది ఎట్టి సంశయం లేకుండా పరిష్కరింపబడ్తుంది. నూరెక్ విద్యుచ్ఛక్తి కేంద్రం పూర్తయిన తరువాత, తజకిస్తాన్, ఉజ్బెకిస్తాన్‌లలో 12 లక్షల హెక్టార్ల భూమి సేద్యయోగ్యమవుతుంది. చాలా విలువైన, పెద్ద పోగువచ్చే రకాల ప్రత్తి పంటను యీ భూమిలో పండిస్తాం. ఉజ్బెకిస్తాన్‌లో ఎండు బయళ్ళను సాగులోకి తేవడంతో, ప్రత్తి పంటను మరింత పెంచవచ్చు. ఏమైనప్పటికీ కృత్రిమ మిశ్రమ నారను తయారుచేసే పరిశ్రమల నిర్మాణ పథకం పూర్తవడంతో, మన జౌళీ పరిశ్రమకు అవసరమైనంత ముడిసరుకులు బాగా సప్లయి కాగలవు.

మన ప్రణాళికలు శాంతియుత నిర్మాణానికి ఉద్దేశించబడ్డవి. దేశ ఆర్థిక సంపద పెంపుదలకోసం పార్టీ కృషిచేస్తోంది. దేశ రక్షణ శక్తిని

బలోపేతం చేసుకోవలసిన అవసరాన్ని పార్టీ ఎన్నటికీ మరువదు. అతి సున్నితమైన పరికరాలను, స్వయంచలన సాధనాలను, ప్రత్యేక లోహాలను, అణు, ఎలక్ట్రానిక్ పరికరాలను, రాకెట్లను ఉత్పత్తిచేసే పరిశ్రమలను మనం నెలకొల్పుకున్నాం. మనకు జెట్ విమానాలు తయారుచేసే కర్మాగారాలు, అధునాతన నౌకా నిర్మాణ పరిశ్రమలూ వున్నాయి. ఈ శాఖలు యీ భూమండలం పైననేగాక రోదసిలో కూడా పేరును సంపాదించుకున్నాయి। ఇవి శాంతి ఆశయానికీ, రక్షణకోసం తాము జరిపే కృషిలో నమ్మదగినవి. ఇప్పుడు మనవద్ద ఖండాంతర బాలిస్టిక్ మిసిలీలు, శత్రు విమాన విధ్వంసక రాకెట్ పరికరాలు, భూ, నౌకా; విమాన దళాలకు అవసరమైన రాకెట్లూ వున్నాయి.

12 వేల కిలోమీటర్ల పైచిలుకు శ్రేణిగల మన కొత్త రాకెట్లను మనం పరీక్ష చేస్తున్నట్లు వార్తలు పత్రికల్లో పడ్డాయి. రాకెట్ అనుకున్న ప్రాంతానికి దిగిన నిర్ణీతకాలాన్ని, హెచ్చు తగ్గులు లేకపోవడాన్ని నమోదు చేయడానికి మన నౌకలు ఆ నిర్ణీత ప్రాంతంలో లంగరేసుకునివుంటాయి. మన రాకెట్లు వెంట్రుక వాసి తేడా లేకుండా పనిచేస్తున్నాయని మనకు సమాచారం అందుతోంది.

అదే ప్రాంతంలో అమెరికన్ నౌకలు కూడా వున్నాయని నేను మీకు తెలియజేయాల్సి వుంటుంది. ఈ నౌకలు సోవియట్ రాకెట్లు యెలా ప్రయాణిస్తాయో గమనిస్తూ వుంటాయి. మన రాకెట్ల గమనాన్ని గూర్చి అమెరికన్లు తగిన సమాచారాన్నే ప్రచురిస్తున్నారు. ఆ సమాచారం ఒప్పో తప్పో ఇక్కడ మనవద్దనున్న సమాచారంతో మనం పోల్చి చూస్తాం. అయితే మన నౌకలపై వున్న కామ్రేడ్స్‌లో మనం విశ్వాసం వుంచుతామనుకోండి. ఏమైనప్పటికీ ఇక్కడ ఇటు మనవైపు నుండి, అటు వ్యతిరేకులనుండి, ద్వంద్వ నియంత్రణ జరుగుతోంది.

మన వ్యతిరేకులు—నిజంగా వారు మన వ్యతిరేకులుగా వుండాలని మనం కోరడం లేదు. కాని మనం సామ్రాజ్యవాద స్వభావాన్ని గణనలో

నికి తీసుకోక తప్పదు—సోవియట్ రాకెట్లు లక్ష్యాన్ని చేరుతున్నాయని చెప్తారు! యిది బాగానే వుంది! యీ విషయమై మనకెట్టి అనుమానాలూ లేవు.

నేనిప్పుడు అసలు విషయాన్ని విడిచి మాట్లాడుతున్నాను కాబట్టి యిక అసలు విషయాలకు వస్తాను. మనం క్రొత్త అణు ఆయుధాల పరీక్షలను కూడా చాల విజయవంతంగా జరుపుతున్నాం. త్వరలోనే మనమీ పరీక్షలను పూర్తిచేస్తాం. బహుశా యిది యీ నెలాఖరుకు జరుగవచ్చు. ఈ పరీక్షలను నిలిపివేసేముందు మనం, 5 కోట్ల టన్నుల టి ఎన్ టి ప్రేలుడు శక్తిగల హైడ్రోజన్ బాంబు నొకదాన్ని ప్రేల్చవచ్చును. ఇదేగాక మన వద్ద 10 కోట్ల టన్నుల టిఎన్‌టి ప్రేలుడు శక్తిగల బాంబు వున్నదని చెప్పాం. ఇది నిజం. కాని దాన్ని మనం ప్రేల్చం. ఏమంటే, యీ బాంబును ప్రేల్చినట్లయితే, యీ ప్రయోగాన్ని బాగా దూరప్రాంతాల్లో జరిపినా, మన దేశంలోని కిటికీతలుపులే ఎగిరిపోవచ్చును. అందువల్లనే మనం యీ బాంబును ప్రేల్చకుండా వున్నాం. ఏమైనప్పటికీ, 5 కోట్ల టన్నుల టి ఎన్ టి ప్రేలుడు శక్తిగల బాంబును ప్రేల్చడం ద్వారా, తరువాత మనం 10 కోట్ల టన్నుల బాంబును ప్రేల్చడానికి కూడా ఏర్పాట్లు చేసుకోగలుతాం.

కాని, వారు అన్నట్లు, యీ బాంబులను ఏ భూభాగంపైనా, అదెవరిదైనాసరే, ప్రయోగించకుండా దేవుడు మనల్ని కాపాడుగాక! ఇదే మన జీవితంలో అన్నిటికంటె ఎక్కువగా కోరుకునే కల!

మన మహాద్భుతమైన రాకెట్లను, వాటికి మోటార్లను, సరిగ్గా సరిపోయే పరికరాలనూ తయారుచేసిన కామ్రేడ్స్ ఇక్కడ నాకు కనుపిస్తున్నారు. న్యూక్లియర్ ఆయుధాలను శ్రేష్టం గావించడానికి కృషిచేస్తున్నవారిని కూడా నేనిక్కడ చూస్తున్నాను. ఈ కామ్రేడ్స్‌ను చూచి మనం గర్వపడుతున్నాం. వారికి తగ్గ గౌరవాన్ని మనం ఇస్తాం. మనదేశ రక్షణ శక్తి పెంపుదలకు, ప్రపంచ శాంతి సుస్థిరతకూ తోడ్పడుతోన్న వారి

సృజనాత్మక విజయాలకు మనం ఆనంద పరవశులమవుతున్నాం.

మనం సోవియట్ జలాంతర్గామి నౌకలను జయప్రదంగా నిర్మిస్తున్నాం. మన వ్యతిరేకులు, బాలిస్టిక్ మిసిలీలు అమర్చబడ్డ జలాంతర్గామి నౌకలను నిర్మిస్తున్నారు. మనం కూడా మన నౌకలకు బాలిస్టిక్ మిసిలీలనూ, లక్ష్యాన్వేషణచేసే రాకెట్లనూ అమర్చుతున్నాం. పరిస్థితులే మనల్ని యీ పనికి పురికొల్పుతున్నాయి. సైనిక కూటాలలోని మన వ్యతిరేక శక్తులు జలాంతర్గాములనుండి, మన భూభాగంపైనా, సోషలిస్టు దేశాల పైనా ప్రేల్చడానికి ప్రయత్నాలు జరుపుతున్నారు. మనం భూ, జల మార్గాల ద్వారా శత్రు యత్నాలను త్రిప్పికొట్టి, శత్రు నిర్దేశిత ప్రాంతాలపై దెబ్బ తీయడానికి సిద్ధంగా వున్నాం. సోవియట్ యూనియన్, ఖండ వ్యాప్తమైన రాజ్యం. మనపై యుద్ధం ప్రారంభించ కోరేవారు జలనిరోధాలను దాటి రావాల్సి వుంటుంది. అందుకనే మనం, లక్ష్యాలను అన్వేషించే మిసిలీలు కూడాగల శక్తివంతమైన జలాంతర్గామి నౌకలను నిర్మించుతున్నాం. ఇవి సోషలిస్టు దేశాల సరిహద్దులను సమీపించే శత్రు నౌకలను వందలాది కిలోమీటర్ల దూరంగా సముద్రంలో ముంచివేస్తాయి.

బాలిస్టిక్, తమకు తాముగా గురిచూసే రాకెట్లు అమర్చబడి వున్న సోవియట్ అణుశక్తిచోదక జలాంతర్గామి నౌకలు, మన సోషలిస్టు విజయాలను అప్రమత్తతతో కాపాడుతుంటాయి. దురాక్రమణదారులను యీ జలాంతర్గామి నౌకలు గుండ పిండిచేస్తాయి. వారి విమాన వాహక నౌకలను కూడా దెబ్బతీస్తాయి. యుద్ధ సమయంలో, జలాంతర్గాములనుండి ప్రేల్చబడే మన రాకెట్లకు మంచి గురిగా వారి విమాన వాహక నౌకలు వుండగలవు.

సోవియట్ సైన్యానికి అణు, రాకెట్ ఆయుధాలను అమర్చడం పూర్తయిందని మహాసభకు నివేదించడానికి నాకు అనుమతిస్తుంది. ఏ దురాక్రమణ దారుణ్నయినా నులిమివేయగల శక్తివంతమైన ఆయుధాలు మన సాయుధసేనలకు యిప్పుడు వున్నాయి. మన సాయుధ

సేనలకు రాకెట్లు మార్చడం, అణు జలాంతర్గామి నౌకలను నిర్మించడంతో పాటు, మనం వైమానిక దళాలను విస్మరించలేదు; ఈ దళాలను అభివృద్ధిచేసి మరింత పకడ్బందీగా చేస్తున్నాం.

సోవియట్ సైన్యానికి అత్యంత ఆధునిక ఆయుధాలను తయారుచేసిన శాస్త్రజ్ఞులకూ, ఇంజనీర్లకూ, కార్మికులకూ మహాసభ తరఫున నేను హృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు తెలియజేయడానికి అనుమతించండి. సమస్త మానవ జాతికీ వీరు మహోన్నత సేవచేశారు! ఇప్పుడు సామ్రాజ్యవాదులు, యుద్ధపు బెదిరింపులతో శాంతియుత దేశాలను అదిరించలేరు. కమ్యూనిజం నిర్మాతలైన సోవియట్ ప్రజల చేతుల్లోని అణు, హైడ్రోజన్ ఆయుధాలు, శాంతి లక్ష్యసాధనకై నమ్మకమైన సేవ చేస్తాయి.

సోవియట్ ప్రజలకు యుద్ధావసరం లేదు. శాంతికాల ఆర్థికాభివృద్ధిలో వారిమనస్సులన్నీ నిమగ్నమైయున్నాయి. కమ్యూనిస్టు నిర్మాణానికి మహాపథకాలు అమలు చేయడంలో, సమస్త శ్రామిక ప్రజలకు అపారమైన భౌతిక, నైతిక విలువలను సృష్టించడంలో వారిమనసులు నిమగ్నమైయున్నాయి.

20వ పార్టీ మహాసభ అనంతరం పరిశ్రమలు, గృహనిర్మాణం, రవాణా శాఖల్లో ముఖ్యమైన గుణాత్మకమైన మార్పులు వచ్చాయి. భౌతిక వస్తూత్పత్తికి సంబంధించిన అన్ని శాఖలనూ సాంకేతికంగా పునర్నిర్మించడంలో ఎంతో యెక్కువ పని జరిగింది. వేలకొలది కొత్త రకాల యంత్రాలు, యంత్ర పరికరాలు, పనిముట్లూ, కొలత సాధనాలు, స్వయం చలన పరికరాలు డిజైన్ చేయబడ్డాయి. దేశ ఇంధనం సప్లయి ఏర్పాట్లు పెద్దగా అభివృద్ధి చెందాయి. 1955 నాటి ఇంధనం ఉత్పత్తిలో నూనె, గ్యాస్ ఉత్పత్తి 23.5 శాతం వుంది. ఈనాడు యీ శాతం 42కు పెరిగింది. చౌక ఇంధనం వాడకం వల్ల యీ ఆరు సంవత్సరాలలోనూ 300 కోట్ల రూబుళ్ళు పొదుపు చేయబడింది.

విద్యుచ్ఛక్తి పరిశ్రమకు నూతన సాంకేతిక ప్రాతిపదిక ఏర్పడింది. 2 లక్షలు—2 లక్షల 25 వేల కిలోవాట్ల శక్తిగల ఆవిరి, జలశక్తి టర్బైన్లు నిర్మింపబడుతున్నాయి. 5 లక్షల కిలోవాట్ల శక్తిగల టర్బైన్లు కూడా రూపొందింపబడుతున్నాయి. ప్రపంచంలోకల్లా పెద్దవైన పవర్ గ్రిడ్స్ ఏర్పడ్డాయి. 5 లక్షల వోల్టుల ట్రాన్స్మిషన్ లైన్లు వేయబడ్డాయి. పారిశ్రామిక కార్మికుని తలసరి విద్యుచ్ఛక్తి వాడకం సుమారు 40 శాతం పెరిగింది.

రసాయన పరిశ్రమలు నానాటికీ ఎక్కువగా సహజ, పెట్రోలియం గ్యాస్‌ను వాడుతున్నాయి. ఇందువల్ల మనం తగినంతగా ఉత్పత్తి ఖర్చులను తగ్గించుకోగల్గుతున్నాం. తద్వారా శుద్ధిగాని ఆహార పదార్థాలను ఎక్కువ మొత్తాల్లో పొదుపు చేసుకోగల్గుతున్నాం. ఆల్కహాల్ ఉత్పత్తికి ముడిసరుకులు వినియోగించిన మూలంగా, యీ ఒక్క సంవత్సరంలోనే 21 లక్షల టన్నుల ధాన్యం పొదుపు అయింది. ఈ ఆరు సంవత్సరాల్లోనూ ప్లాస్టిక్, కృత్రిమ నార ఉత్పత్తి రెట్టింపుకు పైగా అయింది.

అన్ని రకాల రవాణా సాంకేతిక పునర్నిర్మాణానికై పెద్ద కృషి జరిగింది. దాని రవాణాశక్తి 72 శాతం పెరిగింది. 10 వేల కిలోమీటర్లకు పైగా రైల్వేలు విద్యుచ్ఛక్తీకరించబడ్డాయి. మన దేశంలో నడచే రైళ్ళలో సగం ఇప్పుడు ఎలక్ట్రిక్, డీసెల్ ఇంజన్లు వాడుతున్నాయి. ఫలితంగా, యీ సమీక్షింపబడుతోన్నకాలంలో 250 కోట్ల రూబుళ్ళు ఆదాఅయింది. సోవియట్ పతాక క్రింద ప్రయాణించే నౌకలు అన్ని ఖండాలలోనూ మొత్తం 80 దేశాలకు పైంచి రేవులకు వెళ్తున్నాయి. వ్యాపార నౌకల టన్నేజి సుమారు 50 శాతం పెరిగింది. బ్రహ్మాండమైన విమానాలు గల పౌర విమానశాఖ రోజుకు యించుమించు లక్షమంది ప్రయాణీకుల్ని తీసుకెళ్తుంది. ప్రత్యేక మోటారు రవాణా ఏజెన్సీల ద్వారా సాగే కేంద్రీకృతమైన సరకుల రవాణా ఆరురెట్లకు పైగా పెరిగింది.

ముందుగానే తయారు చేయబడ్డ కాంక్రీటు సరకులు ఉత్పత్తి చేసే పరిశ్రమలు 1955లో 53 లక్షల ఘనపు మీటర్ల సరుకును ఉత్పత్తి చేయగా

యిప్పుడు, 4 కోట్ల ఘనపు మీటర్ల సరుకును ఉత్పత్తి చేస్తున్నాయి. ఈ పరిశ్రమ యించుమించు రెడ్డుపరికరాలతో నిర్మించబడింది. ఇటీవల సంవత్సరాలలో గృహనిర్మాణ పద్ధతులలో మూలమైన మార్పులు వచ్చాయి. పెద్దపెద్ద చట్రపు ఇళ్ళు నిర్మాణం చురుగ్గా సాగుతోంది. గృహ నిర్మాణం పూర్తిగా పారిశ్రామిక పద్ధతుల్లో సాగి ఆధునిక సౌకర్యాలు అమరిక చేయబడే రోజు అట్టే దూరాన లేదు. ఇవీ—సమీక్షింప బడుతోన్న కాలంలో పరిశ్రమల్లో, రవాణాలో, గృహనిర్మాణంలో, అభివృద్ధికి సంబంధించిన ప్రముఖాంశాలు.

1956-1961 సంవత్సరాల మధ్యకాలంలో ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వ పెట్టుబడుల మొత్తం 15 వేల 600 కోట్ల రూబుళ్ళు. ఈ మొత్తం, సోవియట్ పరిపాలనాకాలమంతట్లో 20వ పార్టీ మహాసభ వరకూ పెట్టిన పెట్టుబడుల మొత్తంకన్నా ఎక్కువ! సుమారు ఆరు వేల భారీ ప్రభుత్వ సంస్థలు ఉత్పత్తి ప్రారంభించాయి, వాటిలో ఓల్గా నదిపై నిర్మించబడ్డ లెనిన్ పేరుతో వెలసిన జల విద్యుత్ కర్మాగారం, 22వ పార్టీ మహాసభ పేరుతో వెలసిన మరో కర్మాగారం, కారగండా క్ర్యావిషేవ్ ఉక్కు కర్మాగారాలు, ఉక్రైన్, కజకస్తాన్, కుర్స్క్ ఇనుప గనులవద్దనున్న బ్రహ్మాండమైన ముడి లోహపు శుద్ధి పరిశ్రమలూ, యింకా అనేక యింజనీరింగ్, రసాయన, చక్కెర, జౌళీ పరిశ్రమల్లాంటి పెద్దవి వున్నాయి. 30 వేల కిలోమీటర్లకు పైగా గ్యాస్, నూనె పైప్ లైను వేయబడింది. ప్రపంచంలోకల్లా పెద్దదిగా వుండబోయే బ్రత్స్క్ విద్యుచ్ఛక్తి కర్మాగార నిర్మాతలు తమ గొప్ప విజయాన్ని సూచించే, ప్రప్రథమ 2 లక్షల 25 వేల కిలోవాట్ల శక్తిగల కర్మాగారాన్ని అనుకున్న కాలానికన్నా ముందుగానే నిర్మించారు.

క్రెమెంచుగ్ వద్దనున్న జల విద్యుత్ కర్మాగార నిర్మాతలు కూడా మహాసభకొక చక్కని బహుమతి ప్రదానం చేశారు—వీరు అనుకున్న కాలానికన్నా చాలా ముందుగానే నీపర్ ప్రాంతంలోని తృతీయ విద్యుత్

కర్మాగారం నిర్మాణాన్ని పూర్తిచేశారు. ఈ కర్మాగారం ఉత్పత్తి ప్రారంభిస్తే, నీపర్ విద్యుత్ కర్మాగారపు శక్తి ఉత్పత్తి స్థిరంగా 20 శాతం పెరుగుతుంది; నీపర్ నదిపై నౌకాయానం బాగా అభివృద్ధి చెందగలదు. ఇటీవల ఓల్గా పైన స్త్రావ్రోపోల్, వోల్జాస్కీ, తిమిర్-తవ్, రూస్కి, బ్రత్స్కీ యింకా అనేకచోట్ల అనేక క్రొత్త పట్టణాలు వెలిశాయి.

ఈ సమీక్షింపబడుతున్న కాలంలో శ్రామిక ఉత్పాదక శక్తి త్వరితగతిని వృద్ధిపొందింది. 1961లో పరిశ్రమల్లో 1955 నాటి శ్రామికోత్పాదక స్థాయికన్నా 43 శాతం మించుతుంది; గృహనిర్మాణంలో యీ స్థాయి 60 శాతమూ, రైల్వేలలో 56 శాతమూ పెరుగుతుంది అధికమైన శ్రామికోత్పాదక శక్తి మూలంగా, పారిశ్రామికోత్పత్తి దాదాపు 70 శాతం పెరిగింది ఉత్పత్తి ఖర్చులు సుమారు 11 శాతం, రైల్వే రవాణా ఖర్చులు 22 శాతం తగ్గిపోయాయి. గత సంవత్సరం పరిశ్రమలు, రవాణాద్వారా వచ్చిన లాభాలు 1955 నాటికన్నా రెట్టింపు.

అన్ని యూనియన్ రిపబ్లిక్‌లూ తమ ఆర్థిక సాంస్కృతికాభివృద్ధిలో ముఖ్యమైన విజయాలు సాధించాయి. ఈ రిపబ్లిక్ లన్నింటిలోనూ 1955తో పోల్చితే, పారిశ్రామికోత్పత్తి, పెట్టుబడులూ 50 నుండి 100 శాతానికి పైగా పెరిగాయి.

దేశపు తూర్పు ప్రాంతాలలో ఉత్పత్తిశక్తులను అభివృద్ధి చేయడానికి సంబంధించిన పార్టీ విధానం నిరంతరం అమలుపర్చబడుతూవచ్చింది. సైబీరియా నదులనుండి లభ్యమయే అపారమైన శక్తి వనరులను బొగ్గును వినియోగించుకునేందుకై బ్రహ్మాండమైన విద్యుత్ కర్మాగారాలు నెలకొల్పబడుతున్నాయి. కజకస్తాన్, సైబీరియాలలోని విస్తారమైన ముడి ఇనుము నిల్వలు ప్రజోపయోగానికై వినియోగించబడుతున్నాయి. లోహాల, బొగ్గు ఉత్పత్తి త్వరితగతిని అభివృద్ధి చెందుతోంది. ఉజ్బెకిస్తాన్‌లోని బ్రహ్మాండమైన సహజ వాయు నిల్వలు వినియోగంలోకి తెచ్చుకోవడం వల్ల మధ్యాసియా రిపబ్లిక్‌లకు తగినంత ఇంధనాన్ని సప్లయి చేయవచ్చు.

అక్కడ లభించే చౌక గ్యాస్‌ను ఎక్కువ మొత్తాలలో కజకస్తాన్‌కు, ఉరల్స్‌కూ అందించ వీలవుతుంది. రసాయన పరిశ్రమలు కూడా అధిక స్థాయిలో అభివృద్ధిచెందుతున్నాయి.

పారిశ్రామిక, గృహనిర్మాణ నిర్వహణ పునఃవ్యవస్థీకరణ ఆర్థికాభివృద్ధిని బాగా త్వరితం చేసింది. అది దేశ ఆర్థిక జీవనంయొక్క ప్రతీ హంశాన్నీ వృద్ధిచేసింది; ఆర్థిక నిర్మాణంలో యూనియన్ రిపబ్లిక్‌ల పాత్రను ఉన్నత స్థాయికి చేర్చింది; స్థానిక పార్టీ, ప్రభుత్వ, ఆర్థిక సంస్థల చొరవనూ, శ్రామిక ప్రజల్లో అత్యధిక సంఖ్య చొరవను ఉత్తేజపరిచింది; ఆర్థిక వనరులను కార్యాచరణలోకి తేవడానికి దోహదం చేసింది.

కామ్రేడ్స్, సోవియట్ యూనియన్ ఆర్థికాభివృద్ధికి ఉద్దేశించబడ్డ సప్తవర్ష ప్రణాళిక, 21వ పార్టీ మహాసభ ఆమోదించిన ఈ ప్రణాళిక, కమ్యూనిజం నిర్మాణానికి భౌతిక, సాంకేతిక ప్రాతిపదికను వేయడంలో ఒక ముఖ్యమైన దశగా వుంది

ఏడు సంవత్సరాలకు నిర్దేశింపబడ్డ లెక్కలు, మొత్తం పారిశ్రామికోత్పత్తిలో సుమారు 80 శాతం సాధించాలని లక్ష్యంగా పెట్టుకున్నాయి. మనం ఈ ఏడు సంవత్సరాలకు ఉద్దేశించిన మొత్తం పెరుగుదల, గత రెండు దశాబ్దాలలో సాధించిన విజయాలకు సరిసమానమైనట్టిది. ఈ ప్రణాళికను యావన్మంది సోవియట్ ప్రజలూ, విదేశాలలోని కోట్లాది శ్రామిక ప్రజలూ ఉత్సాహంలో హర్షించారు. బూర్జువా రాజకీయవేత్తలు మాత్రం మన సప్తవర్ష ప్రణాళికను, పెట్టుబడిదారీ ప్రపంచానికి సరికొత్త సోవియట్ సవాలుగా అంచనా వేశారు. నిజమే, శాంతియుత ఆర్థిక పోటీలో పాల్గొనమని ఇది సవాలే!

బూర్జువా రాజకీయవేత్తలలో, మొదటి పంచవర్ష ప్రణాళికలప్పుడు అల్లిన పాత కట్టుకథలనే తిరిగివల్లించే వారుకూడా వున్నారు. ఇది మరొక ప్రచారపత్రమనీ, తమ అవకాశాలను సరిగ్గా అంచనా వేసుకోకుండా కమ్యూనిస్టులు యీ ప్రణాళికలను తయారుచేశారనీ, సప్తవర్ష ప్రణాళికను సవ

రించకతప్పదనీ వీరు ముందుగానే ప్రకటనలు చేశారు. కాని ఈ ప్రణాలిక ఇప్పటికి సుమారు మూడు సంవత్సరాలుగా అమలు జరుగుతోంది.

సంభవించినదేమిటి? సప్తవర్ష ప్రణాలికా లక్ష్యాలను కొన్నింటిని గూర్చి మనం వాస్తవంగా సమీక్షించుకోవాల్సి వచ్చిందన్న సంగతిని మనం ఒప్పుకోవాలి. ఏడు సంవత్సరాలు దీర్ఘమైన కాలం, ప్రతిఒక్కదాన్నీ మనం జోశ్యం చెప్పలేం. ప్రణాలికలో అనేక ముఖ్యాంశాల విషయంలో మనం తప్పులు దిద్దుకున్నాం ఈ విధంగా మనం కమ్యూనిజం శత్రువుల "విమర్శను పరిశీలించా"మనే చెప్పాలి. ఇంకా సరిగ్గా చెప్పాలంటే, యీ మార్పులు అభివృద్ధినిబట్టి చేసినవి, సోవియట్ ప్రజల అచంచలమైన శ్రమ శక్తి సాధ్యం చేసినవి. మొదటి మూడు సంవత్సరాలలోనూ సప్తవర్ష ప్రణాలిక పారిశ్రామికోత్పత్తిలో 8.3 శాతం సగటు సంవత్సరాభివృద్ధిని తలపెట్టింది. కాని వాస్తవంగా యీ మూడు సంవత్సరాలలోను సాలు పెరుగుదల 10 శాతం వుంటుంది. సోవియట్ పరిశ్రమలు, మొదటి మూడు సంవత్సరాలకు ఉద్దేశించబడ్డదానికన్నా, ఎక్కువగా సుమారు 1900 కోట్ల రూబుళ్ల విలువగల వస్తువుల్ని ఉత్పత్తి చేస్తాయి. ఈ కాలంలో దేశంలో సుమారు 20 లక్షల టన్నుల దుక్క ఇనుము, 90 లక్షల టన్నులకు మించిన ఉక్కు, సుమారు 80 లక్షల టన్నుల రోల్డ్‌గుడ్స్, 1 కోటి టన్నుల నూనె, తదితర అనేక సరుకులు అదనంగా ఉత్పత్తి కాగలవు.

గత సంవత్సర ప్రణాలికలో సరిదిద్దబడ్డ లక్ష్యాలు యిలా వున్నాయి:

ఇంతకుముందు 6 కోట్ల 50 లక్షలు-7 కోట్ల టన్నుల దుక్క ఇనుము కరగపోయాలని అంచనా. కాని యిప్పుడు 7 కోట్ల 20 లక్షలు-7 కోట్ల 30 లక్షల టన్నుల దుక్క ఇనుము కరగపోయబడ్తుందని మన అంచనా.

మొదట్లో అనుకున్న 8 కోట్ల 60 లక్షలు-9 కోట్ల పది లక్షల టన్నుల ఉక్కు కాక బహుశా మనం 9 కోట్ల 50 లక్షలు-9 కోట్ల 70లక్షల టన్నులు, కాక అంతకన్నా మించి ఉత్పత్తిని సాధించవచ్చు.

కొంతమంది ఉక్కు ఉత్పత్తిని ఏడాదికి పదికోట్ల టన్నులకు పెంచాలని సూచించారు. కాని, ఆర్థిక రంగంలో అన్ని శాఖలూ సమంగా అభివృద్ధి కావాలని, లోహ ఉత్పత్తిలో పాటు గృహ నిర్మాణం, బాల సదనాలు, పాదరక్షల ఉత్పత్తి, వస్త్రోత్పత్తి వగైరాలను కూడా మనం దృష్టిలో వుంచుకోవాలని, వారికి చెప్పాం. ఈ విషయంలో మనం 21వ పార్టీ, మహా సభ ఆమోదించిన ఆదేశాలకు పూర్తిగా బద్ధులమై ఉండాలి.

రోల్డ్ గుడ్స్ ఉత్పత్తి ఇంతకు ముందు నిర్ణయించిన 6 కోట్ల 50 లక్షలు_7 కోట్లు టన్నులు గాక 7 కోట్ల 30 లక్షలు_7 కోట్ల 40 లక్షల టన్నులు వుండగలదు;

23_24 కోట్ల టన్నుల నూనె గాక మనం, 24 కోట్ల టన్నుల నూనెకు పైగా ఉత్పత్తి చేయగలం:

విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 50 వేల కోట్లు_52 వేల కోట్ల కిలోవాట్లు గాక, 52 వేల కోట్ల కిలో వాట్లకు మించగలదు.

యంత్ర నిర్మాణ పరిశ్రమల, లోహ నిర్మాణ పరిశ్రమల ఉత్పత్తి ఇంతకు ముందు అనుకున్నట్లు 4900 కోట్ల రూబుళ్ళు గాక 5,600 కోట్లు_ 5,700 కోట్ల రూబుళ్ళ విలువగలది అవుతుంది.

ఈ లెక్కలు, కాలం గడిచినకొలదీ మారవచ్చు ననుకోండి. ప్రణాళికా లక్ష్యాలను మించి జరిగిన అదనపు ఉత్పత్తిపై ఆధారపడి ఏదో ఒక పరిశ్రమ అభివృద్ధికి, లేదా సాంస్కృతిక తదితర సంక్షేమ కార్యక్రమాలకూ పెట్టుబడి కేటాయింపులను మనం పెంచవచ్చు. తప్పకుండా తగినంత అదనపు కేటాయింపులు మనకు వస్తుంటాయి. వీటిని, బాగా అవసర మున్న, సద్వినియోగం చేసుకోగల జాతీయ ఆర్థిక శాఖలకు పార్టీ కేంద్ర కమిటీ, ప్రభుత్వమూ యిస్తాయి.

మనం మరింతగా సిమెంటును, ట్రాక్టర్లు, వ్యవసాయ యంత్ర పరికరాలు, కాగితం, పాదరక్షలు, వెన్న, చక్కెర, ఫర్నిచర్, రేడియో, టెలివిజన్ రిసీవర్లు, రెఫ్రిజిరేటర్లు, వాషింగ్ మెషీన్లు, దేశ ఆర్థిక రంగానికి

ప్రజలకు అవసరమైన అనేక యితర వస్తువులను, మదింపు వేసిన అంచనాలకన్నా ఎక్కువ ఉత్పత్తి చేయగలం.

ఇదీ, మనం సప్తవర్ష ప్రణాళికను రూపొందించేటప్పుడు వేసిన "తప్పు అంచనాలు!" ఈ రకమైన "తప్పు అంచనాల"ను ఒప్పుకోవడానికి మనం సిగ్గుపడం. సోవియట్ ప్రజలు విచారం లేకుండా యీ సవరణలను ఆమోదిస్తారనే నా తలంపు. మన పథకాలు విఫలమవుతాయని జోశ్యం చెప్పేవారిని, తామే రొంపిలో చిక్కుకుని తన్నుకులాడుతున్నారో ఆ రొంపినుండి బయటపడే మార్గమేదో ఆలోచించుకోమనండి. అందుకు మనకు తలనొప్పి అనవసరం.

కామ్రేడ్స్, మన మొదటి పంచవర్ష ప్రణాళికల దినాల్లో కూడా మన పారిశ్రామికాభివృద్ధి స్థాయి అమెరికా పారిశ్రామికాభివృద్ధి స్థాయిని మించివున్నదన్న సంగతిని మీరు గుర్తు తెచ్చుకోండి. అయితే మనం సమగ్ర అభివృద్ధిలో వెనుకబడివున్నాం. ఇక ఉత్పత్తి స్థాయిలో వున్న పెద్ద భేదం సంగతి చెప్పనక్కర్లేదు. ఇటీవలి సంవత్సరాలలో మన దేశం, పారిశ్రామికాభివృద్ధి స్థాయికి సంబంధించినంతవరకూ అమెరికాకన్నా ముందడుగులోనే వుంటోంది. అనేక ముఖ్య వస్తూత్పత్తికి సంబంధించిన సమగ్ర అభివృద్ధిలో మన దేశం అమెరికాను మించిపో ప్రారంభించింది. ఇక యిప్పుడు సమస్య ఏమిటంటే, ఉత్పత్తి స్థాయిల మధ్య అంతరాన్ని త్వరితంగా పూడ్చివేయడం; అనేక ఆహార పదార్థాలు, తయారైన సరుకుల ఉత్పత్తిలో ప్రపంచంలో సోవియట్ దేశానికి ప్రథమ స్థానాన్ని సంపాదించడం.

ఇక్కడే నేను కొన్ని వాస్తవ విషయాల్ని పేర్కొంటాను. 1956–1961 సంవత్సరాలలో సోవియట్ పారిశ్రామికాభివృద్ధి సగటు సాంవత్సరిక స్థాయి 10.2శాతం కాగా, అమెరికాది 2.3 శాతం వుంది. జనాభాలో తలసరి తయారైన వస్తువుల సాంవత్సరిక సగటు ఉత్పత్తి సోవియట్ దేశంలో 8.2 శాతానికి పెరుగగా, అదే ఉత్పత్తి అమెరికాలో 0.6 శాతం పెరిగింది.

గత ఆరు సంవత్సరాలలో సోవియట్ యూనియన్‌లో పెట్టుబడులలో సాంవత్సరిక సగటు పెరుగుదల 12 శాతం కాగా, అమెరికాలో పెరుగుదల లేదు సరికదా కొద్దిగా తగ్గింది కూడా.

అయినప్పుడు, సమగ్రమైన ఉత్పత్తి లెక్కలు, ఉత్పత్తి స్థాయిల్లో అంతరం పూడ్చబడడం సంగతేమిటి? ఆరు సంవత్సరాల్లో మన దేశంలో ఉక్కు ఉత్పత్తి 2 కోట్ల 60 లక్షల టన్నులు పెరిగింది. కాగా అమెరికాలో యీ ఉత్పత్తి 1 కోటీ 50 లక్షల టన్నులు తరిగింది. సోవియట్‌లో నూనె ఉత్పత్తి 9 కోట్ల 50 లక్షల టన్నులు పెరిగితే, అమెరికాలో నూనె ఉత్పత్తి సుమారు 2 కోట్ల టన్నులు పెరిగింది.

ఈరోజున సోవియట్‌లో పారిశ్రామికోత్పత్తి అమెరికా పారిశ్రామికోత్పత్తిలో 60 శాతానికి పైగా వుంటుంది. 1961 సంవత్సరానికి అతి ముఖ్యమైన సరుకుల ఉత్పత్తికి సంబంధించిన లెక్కలు (యివి ప్రాథమిక అంచనాలు) చూడండి:

| | సోవియట్ దేశం | అమెరికా | అమెరికాతో పోల్చితే సోవియట్ దేశపు శాతం |
|---|---|---|---|
| దుక్క ఇనుము (000,000 టన్నులు) | 51.1 | 62.0 | 82 |
| ఉక్కు (000,000 టన్నులు) | 71.0 | 91.0 | 78 |
| బొగ్గు, నూనె, గ్యాస్, తదితర ఇంధనాలు (సంప్రదాయక ఇంధనానికి మదింపు-000,000 టన్నులు) | 724 | 1,430 | 51 |
| విద్యుచ్ఛక్తి (బస్ బార్లపైని 000,000,000 కిలోవాట్ గంటలు) | 306 | 872 | 35 |
| పరిశ్రమల్లో వినియోగించే విద్యుచ్ఛక్తి (000,000,000 కిలోవాట్ గంటలు | 213 | 425 | 50 |
| సిమెంటు (000,000 టన్నులు) | 51 | 54 | 94 |

| | సోవియట్ దేశం | అమెరికా | అమెరికాతో పోల్చితే సోవియట్ దేశపు శాతం |
|---|---|---|---|
| నూలు బట్టలు (బ్లీచ్ చేయనివి— 000,000,000 చదరపు మీటర్లు) | 5.3 | 8.5 | 62 |
| ఉన్ని వస్త్రాల (000,000 లీనార్ మీటర్లు) | 353 | 270 | 131 |
| తోళ్ళ పాదరక్షలు (000,000 జతలు) | 443 | 610 | 73 |
| ముతక చక్కెర (000,000 టన్నులు) | 6.5 | 3.7 | 175 |

మీకొక విషయాన్ని గుర్తుచేస్తాను: పది, పదకొండు సంవత్సరాల క్రితం సోవియట్ పారిశ్రామికోత్పత్తి, అమెరికా ఉత్పత్తితో పోల్చితే 30 శాతంకన్నా తక్కువగా వుండేది. ప్రస్తుత కాలంలో సోవియట్ యూనియన్ ముడి ఇనుము, బొగ్గు త్రవ్వకాల్లోను, కోక్ ఉత్పత్తిలో, ముందే సిద్ధంచేయబడ్డ కాంక్రీట్ వస్తువుల, హెవీ డీజిల్, ఎలక్ట్రిక్ రైలు యింజన్లు, కోసిన కలప, ఉన్ని వస్త్రాలు, చక్కెర, వెన్న, చేపలు, తదితర చాలా ఆహార పదార్థాల ఉత్పత్తిలోను, తయారైన సరుకుల ఉత్పత్తిలోనూ అమెరికాను మించిపోయింది.

ఈనాడు మన దేశం, ప్రపంచ పారిశ్రామికోత్పత్తిలో దాదాపు ఐదవ వంతు ఉత్పత్తిచేస్తోంది. బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీ, కెనడా, జపాన్, బెల్జియం, నెదర్లెండ్స్ కలసి చేసిన ఉత్పత్తి మొత్తంకన్నా మించింది. ఈ దేశాలన్నీ చాల అభివృద్ధి చెందినవి; వాటి మొత్తం జనాభా 28 కోట్లు 22 కోట్ల జనాభా వున్న మన దేశం పారిశ్రామికోత్పత్తి మొత్తం ప్రమాణంలో యీ దేశాలను అధిగమించడాన్నిబట్టి సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ ఎంత వేగంగా, నిశ్చయంగా అభివృద్ధి చెందుతోందో తెలుసుకోవచ్చు.

సప్తవర్ష ప్రణాళిక అమలు జరగడంతో మన దేశం ఎటువంటి స్థాయికి వచ్చిందంటే, అది ఆర్థికంగా అమెరికాను అధిగమించిపోవడానికి యింక కొద్ది కాలం మాత్రమే సరిపోతుంది ఈ ప్రథమిక ఆర్థిక

కర్తవ్యాన్ని నెరవేర్చడండ్వారా సోవియట్ యూనియన్, అమెరికాతో జరిపే శాంతియుత పోటీలో ఒక చారిత్రక విజయాన్ని సాధిస్తుంది.

## 2. సోవియట్ ఆర్థిక రంగంలో వెలికి తీయబడని సంపదను పూర్తిగా వినియోగించడం; దుబారాను, అవకతవక నిర్వహణను తొలగించడం; శ్రామికోత్పాదక శక్తి సర్వతోముఖాభివృద్ధిని సాధించడం

కామ్రేడ్స్, మనకు రోజులు అనుకూలంగానే వున్నాయన్న సంగతి మీకు తెలుసు. మనం సప్తవర్ష ప్రణాళికా లక్ష్యాలను పూర్తిచేయడమేగాక లక్ష్యాలను మించి కూడా పోగల ప్రతి ఒక్క అవకాశం మనకు వుంది. ఈ విధంగా పార్టీ ముసాయిదా కార్యక్రమంలో చెప్పబడ్డ మరిన్ని బృహత్తర కర్తవ్యాలకు సరైన పునాది వేయడానికి మనకు అన్ని అవకాశాలూ వున్నాయి. ఈ అవకాశాలు వాస్తవాలు గావడానికి మనం ఎంతో కృషి చేయాలి; మనకున్న సంపదను బాగా, తెలివిగా వినియోగించుకోవాలి; మన ఆర్థిక వ్యవస్థ ప్లానింగు, మేనేజిమెంటు అభివృద్ధికి పట్టుదలగా కృషి చేయాలి.

శ్రామికోత్పాదక శక్తి సర్వతోముఖాభివృద్ధి పైన మనం దృష్టిని కేంద్రీకరించడం ప్రధాన విషయం. శ్రామికోత్పాదక శక్తి అభివృద్ధికి సప్తవర్ష ప్రణాళిక పెట్టిన లక్ష్యాన్ని అధిగమించవచ్చునని అనుభవం చెపుతోంది. ఇది బృహత్తర కర్తవ్యం, చాల ముఖ్యమైనదిన్నీ. ఈ కర్తవ్య నిర్వహణకు నిజమైన పరాక్రమం అవసరం. నేడు పరాక్రమం అంటే, కేవలం ఉత్సాహం, గట్టి పట్టుదల, కష్టపడ్డమే గాదు. అది సామర్థ్యం, జ్ఞానం, ఉన్నతమైన సాంస్కృతిక స్థాయి, అత్యాధునిక సాంకేతిక జ్ఞానం, కల్పనా శక్తి కూడా.

మనషుల్ని పనికి తరిమేందుకు వినియోగించబడ్డ కమ్చీని (దుబి నుష్కా) గూర్చి మన పూర్వీకులు ఒక ప్రముఖమైన పాటను అల్లారు. పాటలోని మాటల్ని తొలగించలేమన్న సంగతి నిజమే, కాని విప్లవానికి ముందు కూడా మన ప్రజలు ఆ పాటలో దిబినుష్కా బదులు మషి నుష్కా* అనే మాట చేర్చారు. అంటే ఆ రోజుల్లో కూడా మన ప్రజలు, యంత్రాల మహాశక్తిని గుర్తించారన్న మాట. ఈనాడు సోవియట్ యూని యన్ సాంకేతికంగా అభ్యున్నతి సాధించిన దేశం. నిజమైన కమ్యూనిస్టు శ్రామికోత్పాదన కోసం జరిపే పోరాటంలో మనం, శక్తివంతమైన యంత్రాలపై గట్టిగా ఆధారపడాల్సి వుంది.

ఒక వైపున మన సాంకేతిక విజయాలను గౌరవిస్తూనే మరో వైపున మనం, ఇంకా పరిష్కారంకాని చాలా సమస్య లున్నాయని గుర్తించక తప్పదు. ఉత్పత్తి రంగంలో నూతన సాంకేతిక పద్ధతులను చాల మందకొడిగా ప్రవేశ పెట్టబడుతున్న ఉదాహరణలు యిప్పటికీ వున్నాయి. ఉదాహరణకు మాస్కోలోని లికచోవ్ మోటారుకార్ల పరిశ్రమనే తీసు కోండి. ఈ పరిశ్రమ యిప్పటికీ మొదట్లో 14 సంవత్సరాల క్రితం ఉత్పత్తి చేసిన 4 టన్నుల లారీలనే ఉత్పత్తి చేస్తోంది, డిజైన్‌లో స్వల్పమైన మార్పులతో. కాలంచెల్లిన యంత్రాల పట్ల యీ పరిశ్రమ కార్యకర్తలూ, మాస్కో నగర ఆర్థిక సమితి పెద్దలూ తమ ప్రేమను ఎలా సమర్థించుకోగలరు? ఒక కొత్త లారీ డిజైన్ ఆరు సంవత్సరాలుగా ఎందుకు జరుగుతుంది? అభివృద్ధి అయిన లారీ నిర్మాణ నిర్వహణకు సహాయమంతా చేసినా జరిగిన పని యిది.

ఒక్కొకటప్పుడు కొత్త వాటిని ప్రవేశ పెట్టాలంటే, అందుకు కొంత ఉత్పత్తి ఖర్చులూ, అదనపు బాధలూ, చివరకు అశాభంగాలు కూడా సంభవిస్తాయి. నిన్న మీరు చేసిన పనిని ఈ రోజు చేయడం, నేటి పనిని రేపు

* అంటే యంత్రం. 'మషీనా' అన్న రష్యన్ మాటకు సంగ్రహం రూపం.
—అనువాదకుడు.

చేయడం, చాలా తేలికే. దురదృష్ట వశాత్తూ తమ మిగత రోజుల్ని కష్ట పడకుండా గడప గోరుతున్న కార్యనిర్వాహకులింకా మనకు వున్నారు.

కాని, ఆ రకంగా పనిచేసే సోవియట్ కార్యనిర్వాహకులను మనం భరించలేము. సజీవమూ, విప్లవకరమూ, ఎల్లప్పుడూ ముందు చూపుగల సోషలిస్టు ఉత్పత్తి స్వభావానికే, మామూలు రొడ్డకొట్టుడూ, స్థబ్దతా విరుద్ధం. మన దేశంలో విజ్ఞాన శాస్త్రమూ, సాంకేతిక శాస్త్రమూ సృష్టించే ప్రతి ఒక్క పద్ధతినీ ఎక్కువ త్వరగా, సంపూర్ణంగా వినియోగంలోకి తేవడం, విదేశాల అనుభవాలలో మంచి వాటిని యింకా ధైర్యంగా తీసుకోవడం, నిర్దిష్ట వస్తూత్పత్తిలో ప్రత్యేక ప్రావీణ్యతనూ, సహకారాన్ని బాగా విస్తృతంగా వృద్ధిలోకి తెచ్చి మొత్తం ఉత్పత్తి రంగాన్నంతనూ యాంత్రీకరించి, స్వయంచలనీకరించడమూ అత్యావసరం. మనం కమ్యూనిస్టు ఆర్థిక వ్యవస్థను నిర్మించుకుంటున్న దశలో సాంకేతిక విషయాల్లో ఛాందస వైఖరులను సహించలేం. "పాతదీ చిన్నదీ అయిన గుర్రంమీద హైజంపు లేమి చేస్తావు" అనేది ఒక సామెత!

ప్రతీ ఫ్యాక్టరీ, గని, గృహ నిర్మాణ స్థలం వద్దా అక్కడ వినియోగించే, సాంకేతిక పరికరాలను మనం పూర్తిగా శ్రద్ధతో పరిశీలించాలి. కాలం తీరిన వాటన్నిట్నీ, అవతలపెట్టాలి. ఉత్పత్తి శ్రేణులు లేనిచోట వాటిని నెలకొల్పాలి. మనం కొత్త పరిశ్రమల్ని నెలకొల్పాలి. ఇప్పుడు పనిచేస్తున్న వాటిలో సాంకేతిక పునర్నిర్మాణం చేయాలి. అత్యంత ఆధునిక యంత్ర పరికరాలను మనం ఉత్పత్తి చేయాలి, ఉత్పత్తి శ్రేణులను పెట్టాలి, స్వయంచలనీకరణను ప్రవేశపెట్టాలి, సాంకేతిక క్రమాలను శ్రేష్ఠంచేయాలి.

సాంకేతికాభివృద్ధిలో విద్యుద్దీకరణ ప్రధాన పాత్ర వహిస్తుంది. దీని ప్రాతిపదికపైననే స్వయంచలనీకరణ, రేడియో ఇంజినీరింగ్, ఎలక్ట్రానిక్స్, సైబర్నెటిక్స్, ఉత్పత్తి సాంకేతిక స్థాయిని నిర్ణయించే ఆధునిక పరికరాలన్నీ అభివృద్ధి అయినాయి. ఎక్కువ త్వరితగతిని కొత్త విద్యు

చ్ఛక్తి కర్మాగారాలను పనిచేయించాలి, ఆర్థిక రంగం అన్ని శాఖల్లోనూ యింకా త్వరితగతిని విద్యుదీకరణ జరగాలి.

దేశమంతటా పూర్తి విద్యుదీకరణతో, బ్రహ్మాండమైన జల విద్యుత్ కర్మాగారాల నిర్మాణంతో, ఇతర చిక్కు ఆర్థిక సమస్యల పరిష్కారానికి పూనుకోవడం కూడా సాధ్యపడుతుంది. ఓల్గా, నీపర్‌లపై గొలుసు విద్యుత్ కర్మాగారాల నిర్మాణాన్ని మనం పూర్తిచేయాలి; ఇవి లోతయిన జల రవాణా మార్గాలను లభ్యంచేసి కోట్లాది హెక్టార్ల భూమిని సాగుచేయడానికి దోహదం చేస్తాయి.

ఓల్గా, కామా, నీపర్ నదులపై నిర్మించిన పది జల విద్యుత్ కర్మాగారాలు తమ పూర్తి ఉత్పాదక శక్తితో నడుస్తున్నాయి. ఇంకా నాలుగు కర్మాగారాలు నిర్మాణంలో వున్నాయి. ఓల్గా-కామా బేసిన్ పునర్నిర్మాణాన్ని పూర్తిచేయడానికి మనమింకా నాలుగు జల-సాంకేతిక శాఖలను నిర్మించి, ఉత్తరాది నదులు పెచోరా, వైచెగ్దాల నుండి కామా, ఓల్గాల మీదుగా కాస్పియన్ సముద్రానికి నీటిని తరలించేందుకు కేంద్రాలను నెల కొల్పాల్సి వుంటుంది. నీపర్ విద్యున్మండలంలో ఆరవ కేంద్రాన్ని-కానేవ్ జల విద్యుత్ కర్మాగారం యింకా నిర్మింపబడాల్సి వుంది. బాల్టిక్ సముద్రాన్ని నీమెన్ నది, కొన్ని కాల్వల ద్వారా నల్ల సముద్రంతో కలుప డానికి ప్రిపెట్ నది పునర్నిర్మాణం సాగాలి.

ఇవీ, లెనిన్ పార్టీ పెంపొందిస్తున్న బృహత్ పథకాలు. సప్తవర్ష ప్రణాళికా కాలంలో వీటిని జరపడం సాధ్యమే.

కామ్రేడ్స్, సమస్యల్లోకల్లా సమస్య, పెట్టుబడుల నిర్మాణం.

సప్తవర్ష ప్రణాళికలో, ప్రభుత్వ పెట్టుబడులు 19 వేల 400 కోట్లు-19 వేల 700 కోట్ల రూబుళ్ళ మేరకు వుండాలని వుంది. ఇంత పెద్ద పెట్టున పెట్టుబడులను సేకరించడం మనకు సాధ్యంకాని పని అని మన వ్యతిరేకులు కొంతమంది హేళన చేశారు. కాని వాస్తవంగా జరిగిం దేమిటి? సాలీనా సగటున పెట్టుబడుల పెరుగుదల 8.6 శాతం వుండాలని

అంచనా వేసుకోగా, అది మూడు సంవత్సరాలకు ఏడాదికి సగటున 11 శాతం పెరిగింది. పెట్టుబడుల విషయంలో ప్రణాళిక అంచనాలను మించిన ఫలితంగా, మొత్తం ఏడు సంవత్సరాలలోను మూడు సంవత్సరాల కాలములో, మన ఆర్థిక వ్యవస్థలో అదనంగా 350కోట్ల రూబుళ్ళకు పైచిలుకు మొత్తాన్ని పెట్టుబడిగా పెడుతున్నాము.

ఇప్పుడు మనం నిర్మాణం బాగా త్వరితగతిని సాగిస్తున్నామనడంలో సందేహం లేదు. కాని నిర్మాణ విషయాల్లో అనేక లోటుపాట్లు యింకా వున్నాయి. ప్రస్తుతం దేశంలో లక్ష నిర్మాణ స్థలాలున్నాయి. వీటిలో సగం పారిశ్రామిక స్థలాలు. ఇన్ని నిర్మాణపనులను ఒకేసారి నిర్వహించ వలసిరావడంతో నిధులు, సామగ్రి చెల్లాచెదరై వుండడంతో, సాంకేతికావకాశాలు అనుమతించిన మేరకన్నా రెండు లేదా మూడు సంవత్సరాలకుగాని అనేక పరిశ్రమలు ఉత్పత్తిని ప్రారంభించవు. ఖర్చుపెట్టబడ్డ నిధులు చాలకాలంగా పేరుకుని వున్నాయి; అవి మూలపడి వున్నాయి, ప్రభుత్వానికి తన డబ్బు తిరిగి తనకు రావడం లేదు.

ఇలా యెందుకు జరిగింది? గొప్ప లక్ష్యాలు సాధించాలన్న వాంఛ, హేతుపూర్వకమైన, వాస్తవిక దృష్టిని వమ్ముచేయడమే కారణం. రాష్ట్ర ప్రయోజనాలకు న్యాయంగా అవసరమన్న సాకుతో కేవల ప్రాంతీయ తత్వాన్ని ప్రచ్ఛన్నంగా ప్రదర్శించడం తరచు సంభవిస్తుంది. మోటుగా చెప్పాలంటే, ప్రాంతీయ, మండల, ఒక్కొకప్పుడు రిపబ్లిక్ స్థాయిలో దురాశ. రిపబ్లికన్ మంత్రి మండలులు, ఆర్థిక సమితులూ, మంత్రిత్వ శాఖలూ, స్థానిక పార్టీ శాఖలూ, అవసరమైన నిర్మాణ వస్తువులు, మానవ బలం, సామగ్రి సప్లయి అవుతుందీ లేనిదీ పరిశీలించకుండానే సాధ్యమైనన్ని యెక్కువ నిర్మాణాలకు పూనుకునేందుకు నిధులకోసం ప్రయత్నిస్తూంటాయి. ప్రణాళికా సంఘాలు దేశ ప్రయోజనాలకు విరుద్ధమైనా యీ చర్యలను నిరోధించడం లేదు. ఉత్పత్తి ఆగిపోవడానికి. శ్రామికోత్పాదిక శక్తి తగ్గడానికి, అనుకున్న ప్రకారం లక్ష్యాలు సకాలంలో నెరవేరకుండా వుండ

డానికి, అదనపు ఖర్చులకూ, నిర్మాణ ఖర్చులు పెరిగిపోవడానికీ యిది దారి తీస్తుంది.

మనం ఈ లోపాన్ని సరిచేసుకుంటే—ఈ లోపాన్ని తొలగించుకోవడమనేది, ఒక మార్గం చూపగల సామర్థ్యంమీదా, మన మనోనిశ్చయం పైననే పూర్తిగా ఆధారపడివుంది—నిర్మాణ కార్యక్రమాన్ని మనం బాగా త్వరితం చేయడానికి తగ్గ పరిస్థితులను సృష్టించుకోగలం. కొంత కాలం పాటు, బహుశా ఒక సంవత్సరంపాటు కొత్త ప్రాజెక్టుల నిర్మాణాన్ని ఆపి యీ కాలంలో చేకూరే నిధులన్నింటినీ. యిప్పటికి ప్రారంభమైయున్న నిర్మాణాలను పూర్తిచేసేందుకు వినియోగించాల్సివచ్చేటట్లు వుండి. అయితే ప్రత్యేకంగా ముఖ్యమైన ప్రాజెక్టులకు మాత్రం మినహాయింపు వుంటుంది. అది కూడా కేంద్ర ప్రభుత్వ నిర్ణయానుసారంగానే జరగాలి. కేపిటల్ నిర్మాణానికి ఒక వరుసలో పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వమూ ఇటీవల నిర్ణయించాయి.

ఆర్థికాభివృద్ధి సమపాళ్ళలో వుండేటట్లు, ఉన్న వనర్లన్నింటినీ సంపూర్ణంగా వినియోగించేటట్లు విషయాలను సరిచూసుకోవాలి; ఆ విధంగా పథకాన్ని వేసుకోవాలి. ఈ విషయంలో, ఇటీవల నిర్మింపబడి విస్తృతపర్చబడిన ఆర్థిక ప్రాంతాలూ, ఆ ప్రాంతాల్లో ఏర్పాటైన బోర్డులూ ఆర్థిక సమితుల మధ్య సమన్వయ సాధనకూ వాటి పని విధాన నిర్ణయం విషయంలోనూ ప్రధాన పాత్ర వహించాలి.

గొప్ప ప్రాధాన్యతగల విషయం ఏమంటే, ఆర్థిక వ్యవస్థ వివిధ శాఖలో అభివృద్ధిచెందడానికి సరియైన, ఆర్థికంగా సమర్థనీయమైన మార్గం ఎంపిక చేసుకొవడం. కొత్త పరిశ్రమల నిర్మాణ పథకాలలోనూ, ప్రస్తుతం పనిచేస్తున్న పునర్నిర్మాణంలోనూ, అతి తక్కువ ఖర్చుతో అత్యుత్తమమైన సాంకేతిక పద్ధతులను ఎన్నిక చేసుకోవడం అవసరం.

ఉదాహరణకు, ఉక్కు పరిశ్రమనెలా అభివృద్ధిచేయాలి అన్న సమస్యకు ఆర్థిక ప్రాధాన్యత చాలా వుంటుంది. ఓపెన్—హర్త్ ఫర్నెస్‌లలో

కన్నా ప్రాణవాయువు వినియోగించబడ్డ కన్వర్టర్లలో ఉక్కును ఉత్పత్తి చేయడం ఎక్కువ లాభకరమని మనకు అనుభవం రుజువు చేసింది. ఇందుకై ప్రాథమిక పెట్టుబడులలో ఆదా అయిన మొత్తం, 10 లక్షల టన్నుల ఉక్కు పైన సుమారు 60 లక్షల రూబుళ్ళు వుంటుంది; త్రవ్వ కాలలో మరో 10 లక్షలు కలిసివచ్చింది. కన్వర్టర్లవల్ల లాభాలు స్పష్టంగా అవుపిస్తూవున్నా, చాల తక్కువ శ్రద్ధచూపబడుతోంది.

మీకు గుర్తుండే వుంటుంది, రైల్వే రవాణాలో నిపుణులమని చెప్పుకునే ఛాందసులపైన 20వ పార్టీ మహాసభలో నిశిత విమర్శ చేయబడింది. వీరి సైద్ధాంతికులెవరంటే, కగనోవిచ్. ఈయన తానొక "ఆవిరి కమ్యూనిస్టు" నని చెప్పుకున్నారు. చాల కాలంపాటు వారు ఆవిరి యింజన్లకు మాత్రమే అంటిపెట్టుకుని వున్నారు; ఎలక్ట్రిక్, డీజిల్ యింజన్ల వినియోగాన్ని అడ్డుకున్నారు. అప్పుడు మనం వాళ్ళ ప్రతిఘటనను బద్దలు కొట్టాం. చాల త్వరితగతిని రైల్వేల సాంకేతిక పునర్నిర్మాణ కార్యక్రమం ముందుకు సాగిపోయింది. ఆర్థిక రంగానికి చెందిన మరికొన్ని ఆర్థిక శాఖలలో కూడా చాందసులైనవారు, పాపాత్ముడ్ని దయ్యం పట్టుకున్నట్లు పట్టుకున్నారు.

పరిశ్రమల, నిర్మాణ పథకాల, మొత్తం పారిశ్రామిక శాఖలన్నింటి యొక్కపని విధానానికి సంబంధించిన ఆర్థికాంశాలను చాల లోతుగా, జ్ఞానంతో విశ్లేషించి చూడగల శక్తి, సోషలిస్టు ఆర్థిక నిర్వహణకు అవసరం. అలవాటులేని, లేదా ప్రభుత్వపు డబ్బును లెక్కించలేని, పథకాలను ఎలా అయినా అమలుపరచడమే తమ లక్ష్యంగా భావించేవారిని, ఆర్థిక నిర్మాణ కార్యకలాపాల్లో పై స్థానాల్లో వున్న నిర్వాహకులను అలా వదిలి వేయలేము. ఉదాహరణకు పెర్మ్ ఆర్థిక సమితి నాయకులనే తీసుకోండి. వారి వ్యవహారమంతా బాగానే వున్నట్లు అనిపిస్తుంది. మొత్తం ఉత్పత్తి లక్ష్యాల అమలు విషయమై వీరు సకాలంలో నివేదిక యిస్తూంటారు. కాని వారెలా తమ ఆర్థిక వ్యవహారాలను నిర్వహిస్తున్నారో ఒక్కసారి పరిశీలిం

చండి. గత సంవత్సరం పెర్మ్ ఆర్థిక ప్రాంతంలోని ప్రతి ఒక్క మూడో పరిశ్రమ లాభదాయకంగా ప్రణాళికను అమలు జరుపలేక విఫలమైంది. ఫలితంగా నిల్వ నిధులకు 2 కోట్ల 70 లక్షల రూబుల్ల నష్టం వచ్చింది. ఆర్థిక సమితి వివిధ జరిమానాల రూపంలో 80 లక్షల రూబుళ్ళకు పైగా చెల్లించింది. దండగవల్ల 70 లక్షల రూబుల్ల నష్టమైంది. ఆ సంవత్సరం ఆవృత్త (సర్క్యులేటింగ్) నిధులలో 2 కోట్ల 60 లక్షల రూబుళ్ళ లోటుతో ఆఖరయింది!

ఈ ఆర్థిక సమితి అధ్యక్షుడు కామ్రేడ్ సోల్దతోవ్‌ను తీవ్రంగా విమర్శించారని మీరు భావిస్తున్నారా? లేదు, అటువంటిదేమీ జరగలేదు. అఖిల రష్యా ఆర్థిక సమితిలో ఒక ఉన్నత పదవికి ఆయన పంపబడ్డారు.

ముడి సరుకా, తదితర వస్తువుల, విద్యుచ్ఛక్తి దండగ పై గట్టి పోరాటం నడుపవలసిందే. ఉదాహరణకు ఎంతో లోహం అహేతుకంగా ఖర్చు చేయబడుతోందని ఎన్నిసార్లు చెప్పలేదు. ప్రతీ సంవత్సరం 40 లక్షల టన్నులకుపైగా లోహం రద్దుక్రింద పోతోంది. పైగా దానికోసం శ్రమ, పని కాలం, విద్యుచ్ఛక్తి, పనిముట్లు వ్యయపడడం కాస్తా కూస్తా కాదు.

సహజ వాయువు, నూనె బావుల గ్యాస్ విషయంలో మనమేమైనా మితవ్యయం చేశామా? గత మూడు సంవత్సరాలలోనూ, 3,000 కోట్ల ఘనపు మీటర్ల గ్యాస్ ఊరికే వాతావరణంలో వృథా అయిపోయింది, లేదా నూనె గనుల్లోనే మండిపోయింది. ఈ రకమైన అవకతవక నిర్వహణ వల్ల ప్రభుత్వానికి ఎంత నష్టమో యింకా స్పష్టంగా తెలుసుకోవాలంటే, వృథా అయిన సహజ వాయువు మాస్కో, లెనిన్‌గ్రాడ్, కీవ్, మిన్‌స్క్, గోర్కీతో గోర్క్సి లాంటి పెద్ద పారిశ్రామిక కేంద్రాలన్నింటికి కలిపి సాంవత్సరిక అవసరాలను తీర్చగలదు. ఇక నూనె బావులలోనుండి వెలువడే వృథా పోయిన గ్యాస్, సుమారు 10 లక్షల టన్నుల కృత్రిమ రబ్బర్ ఉత్పత్తికి తగినంతగా సరిపోతుంది.

ఉత్పత్తి శాఖలన్నింటిలోనూ ఆర్థిక నియంత్రణ యింకా పకడ్బం

డిగా వుండాలి. చిన్న, పెద్ద విషయాలన్నింటిలోనూ పొదుపును, ప్రయోజనాత్మకంగా సహజ వనర్ల, భౌతిక విలువల వినియోగాన్ని ప్రభుత్వ విధాన స్థాయికి తీసుకుపోవాలి.

ప్రణాలికా పద్ధతి పెద్దగా అభివృద్ధి పొందాలి, ప్రణాళికా శాఖలు ఉత్పత్తి పరిమాణాన్ని అంచనా వేయడంలో తరచు తప్పులు చేస్తున్నాయని చెప్పక తప్పదు. తప్పుడు లెక్కలు వేస్తున్నాయి. ఉత్పత్తికి సంబంధించిన పథకాలు ఎల్లప్పుడూ సరకులు, యంత్రాల సప్లయి పథకాలతో సమన్వయతతో వస్తువులను అందజేయడంతో ముడిపడి వుండవు. గృహ నిర్మాణ పథకాలకూ ద్రవ్య కేటాయింపులకూ సరుకు సప్లయిలకూ, పరికరాల అప్పగింతకూ పొత్తు కుదరడం లేదు. ఏ ఆర్థిక రంగంలోనైనా కొన్ని నిలవలు యెప్పుడూ వుండాలి. ప్రణాలిక చాలీ చాలనిదిగా వుండకూడదు.

ఇప్పుడు మనకు పరిశ్రమల్లోనే అవసరమైనన్ని ఆవృత్త నిధులను ఏర్పర్చుకోవడం సాధ్యమవుతుంది. ఈ పని, వెనకైతే చాల కష్టంగా వుండేది. ఏమంటే అప్పుడు, ప్రతి ఒక్క ఆర్థిక మండలంలోనూ డజన్ల కొలది మంత్రిత్వ శాఖలకు పాత్ర వుండేది. వీటిల్లో ప్రతి ఒకటి తన స్వంత సరిహద్దు కేంద్రాలలోనే వేరుపడిపోవడానికి ప్రయత్నించేవి. ఇప్పుడా సరిహద్దు కేంద్రాలు రద్దుచేయబడ్డాయి. ఆర్థిక మండలం అనేది ఇప్పుడు, ఆర్థిక సమితి నాయకత్వాన వుండే ఏకైక ఆర్థిక శాఖ. ఈ సంస్థ, తన క్రింద వుండే పరిశ్రమలకూ, నిర్మాణ స్థలాలకూ అవసరమైన, అటు ఉత్పత్తికీ, యిటు బాగుచేత పనులకూ అవసరమైన, తగినన్ని పరికరాలను అందజేయాలి.

పార్టీ, ప్రభుత్వ నిర్ణయాలను, ఆదేశాలనూ అమలుపర్చడంలో పార్టీ, ఆర్థిక సంఘాలూ గట్టిగా బాధ్యత వహించేటట్లు చేయాలి. పార్టీ, ప్రభుత్వ క్రమశిక్షణను మొత్తం ప్రభుత్వ యంత్రాంగమంతటా పెంచాలి. ఎటువంటి పెత్తందారు పద్ధతుల్నిగాని లేదా క్రమశిక్షణారాహి

త్యాన్నిగాని ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థలో సహించరాదు. అనేక ఆర్థిక సమితులు, ఉదాహరణకు నీప్రొపెత్రోవస్క్, బ్రియాన్స్క్, ఉజ్బెక్ సమితులు, "తమ స్వంత ఆర్థిక ప్రాంతాల అవసరాలకై తమకు కేటాయించబడ్డ కొన్ని సరుకులు, పనిముట్లకు మించి ఖర్చుచేశాయి. ఫలితంగా ఇతర ప్రాంతాలకు వెళ్ళాల్సిన సరుకుకు సంబంధించిన పథకాలు దెబ్బతిన్నాయి. "స్నేహితుడికి ఉపకారం చేయకుండా వుండడం ఎలా:" అన్న సూత్రాన్ని అనుసరించే వారు చేసిన పనే ఇది: ప్రభుత్వ నష్టంతో, స్థానికాధికారులకు "ఉపకారం" చేసే: పార్టీ, ప్రభుత్వ క్రమశిక్షణను ఉల్లఘించే నియమరహితులైన కార్యనిర్వాహకులను తీవ్రంగా శిక్షించాలి.

ఉత్పత్తి నిర్వహణను అభివృద్ధిచేయడం ద్వారా, నిపుణులైన కార్మికుల పద్ధతులను పరిశ్రమలు, గృహనిర్మాణ శాఖలన్నింటిలోనూ విస్తారంగా వినియోగంలోకి తేవడంద్వారాను సరుకుల ఉత్పత్తిని తగినంతగా పెంచడమే మన కర్తవ్యం.

మంచి పద్ధతులను మరింత చురుగ్గా వినియోగించాలి. వెనుకబడిన. ఒక మోస్తరు అనబడే పరిశ్రమలను మంచివాటి స్థాయికి తీసుకుపోవాలి.

మన పరిశ్రమల, నిర్మాణ, రవాణా రంగాల్లో సోవియట్ కార్మిక వర్గ, యింజనీర్లు, సాంకేతిక విషయజ్ఞులు, డిజైనర్లు, శాస్త్రవేత్తల భక్తి శ్రద్ధాపూర్వకశ్రమ వల్లనే బ్రహ్మాండమైన విజయాలు సాధించబడ్డాయి. భవిష్యత్తులో వారి అనుభవం, జ్ఞానం, రాజకీయ శ్రామిక కార్యకలాపాలపై ఆధారపడుతూ, 22వ పార్టీ మహాసభ సూచించబోయే కమ్యూనిస్టు నిర్మాణ మహోన్నత లక్ష్యాలను మనం సాధిస్తాము.

## 3. కమ్యూనిజం స్థాపనకు కావలసిన అంశాల్లో బాగా అభివృద్ధిచెందిన వ్యవసాయ రంగమొకటి. భూమిభాగాలను అభివృద్ధిపరచడం సోవియట్ ప్రజలు సాధించిన మహత్తర విజయం.

కామ్రేడ్స్, ప్రస్తుతం మనం సమీక్షించుకొంటున్న కాలంలో వ్యవసాయాభివృద్ధికి పార్టీ ప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నది. దీనికి కారణం ఏమిటో సులభంగానే తెలుసుకోవచ్చు. యుద్ధంవల్లా, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల నిర్వహణలో జరిగిన తప్పులు, పొరపాట్లవల్ల కూడా మన వ్యవసాయరంగం దెబ్బతిన్నది.

వ్యవసాయ రంగంలోని అడ్డంకులను తొలగించడం, ప్రజల ఆహార అవసరాలను తీర్చడం, పరిశ్రమలకు అవసరమైన ముడిసరుకు ఉత్పత్తి చేయడం పార్టీని కీలకమైన, తప్పనిసరైన సమస్యలుగా ఎదుర్కొన్నాయి. వ్యవసాయ రంగం నిర్వహణలోని తప్పులకు, పొరపాట్లకు గల కారణాలను 1953 సెప్టెంబరులోను, ఆ తర్వాత జరిగిన కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశాలు వెల్లడించి, వ్యవసాయాభివృద్ధిని పెంపొందించేందుకొక సమగ్రమైన కార్యక్రమాన్ని రూపొందించాయి. తీసుకొన్న చర్యలను పార్టీ 20వ మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించింది; ధాన్యం, పారిశ్రామిక పంటలు, మాంసం, పాలు, తదితర పదార్థాల ఉత్పత్తిని శరవేగంతో పెంచేందుకు శక్తినంతా వినియోగించి కృషిచేయవలసిందిగా కేంద్ర కమిటీకి ఆజ్ఞాపించింది.

ఇటీవలి సంవత్సరాల్లో వ్యవసాయ రంగంలో ముఖ్యమైన చర్యలు తీసుకోబడ్డాయి. కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణానికివి యిప్పటికే తోడ్పడ్డాయి. అందుకివి భవిష్యత్తులో యింకా తోడ్పడతాయి. వ్యవసాయాభివృద్ధి నెదుర్కొనే ముఖ్య సమస్యల పరిష్కారానికి ప్రజా సహకారంతో పార్టీ పూనుకుంది.

సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల భౌతిక, సాంకేతిక పునాది పటిష్టపర్చబడింది. 1956 నుండి 1960 వరకు వ్యవసాయానికై పెట్టిన పెట్టుబడి 2 వేల 720 కోట్ల రూబుళ్ళు. అంతకుముందు 5 సంవత్సరాలకాలంలో పెట్టిన పెట్టుబడి 1 వెయ్యి, 390 కోట్ల రూబుళ్ళు మాత్రమే. అంటే యించుమించుగా రెట్టింపు అన్న మాట. అంతకుముందు 5 సంవత్సరాల్లో మన వ్యవసాయ క్షేత్రాలకు సప్లయి చేసిన ట్రాక్టర్లు 4 లక్షల 27 వేలు కాగా యిప్పుడు అందించినవి 7 లక్షల 47 వేలు; యితర యంత్రాలు కూడా పెద్ద ఎత్తున సప్లయి చేయడమైంది.

యంత్రాల, ట్రాక్టర్ల కేంద్రాలు పునర్వ్యవస్థీకరించబడ్డాయి. ఆ విధంగా భూమి, యంత్రాలు ఒకరి చేతుల్లోనే ఉంచడానికి వీలైంది. వ్యవసాయ రంగంలోని ఉత్పత్తి శక్తులను మరింత బాగా వినియోగించుకొనడానికి తగిన పరిస్థితులేర్పడ్డాయి.

అంతవరకు సాగులోకి రాని, పనికిరానివని తోసివేసిన భూములు అభివృద్ధి చేయబడ్డాయి. తత్ఫలితంగా ధాన్యం ఉత్పత్తిలో ఖచ్చితమైన పెరుగుదల కనిపిస్తూ వుంది. పశు పోషణ కేంద్రాల అభివృద్ధి త్వరితగతికి అవకాశాలేర్పడ్డాయి.

కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణంలో ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల పాత్ర పెరిగింది. ఏడేళ్ళలో 3 వేలు కొత్త ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు స్థాపించబడ్డాయి. వాటి మొత్తం సంఖ్య యిప్పుడు దాదాపు 8 వేలు. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లో అనేకం ఎక్కువ ఉత్పత్తి శక్తిగల ఆదర్శ క్షేత్రాలు. సోషలిస్టు వ్యవస్థా వ్యవసాయోత్పత్తికవి ఉదాహరణలు. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకింద సాగవుతున్న భూ విస్తీర్ణం ఒక కోటి 5 లక్షల హెక్టార్లనుండి 8 కోట్ల హెక్టార్లకు పెరిగింది. ప్రభుత్వ మొత్తం కొనుగోలులోవాటి వాటా: ధాన్యం 43 శాతం; మాంసం 28 శాతం, పాలు 32 శాతం, ఉన్ని 31 శాతం.

ప్రణాళికా విధానంలో నూతన పద్ధతి ప్రవేశపెట్టబడింది.

ప్రజల సృజనాత్మక చొరవను ప్రోత్సహించడంతో ప్రభుత్వ నాయకత్వాన్ని జోడించడం అనే సూత్రంపై యిది ఆధారపడి వుంది. దీనివల్ల గ్రామీణ ప్రాంతాల శ్రామిక ప్రజల పని చురుకుదనం పెరిగింది. భూమిని, సాంకేతిక పరికరాలను ఎక్కువ ప్రయోజనకరంగా వినియోగించాలనే ఎక్కువ బాధ్యతాయుత మనస్తత్వం సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లోను, స్థానిక ప్రభుత్వ సంస్థల్లోను పనిచేసేవారిలో పెరిగింది.

సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతులకు, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల కార్మికులకు, నిపుణులకు వ్యవసాయోత్పత్తిని పెంచేందుకై భౌతికమైన ప్రోత్సాలాలను కల్పించాలన్న లెనినిస్టు సూత్రం తిరిగీ అమలు జరుపబడింది. ఉత్పత్తిని తప్పనిసరిగా ప్రభుత్వానికివ్వాలనే పద్ధతికి బదులు, కొనుగోలు పద్ధతిని ప్రభుత్వం ప్రవేశపెట్టింది. బాగా అది కొనుగోలు ధరలు పెంచింది; గ్రామీణ ప్రాంతాల్లో వినియోగించుకొనే కేపిటల్ సరకుల ధరలు తగ్గించింది.

సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను అగ్ర కార్యకర్తలు, నిపుణులు నియమింపబడ్డారు. పార్టీ పిలుపు నందుకొని లక్షలాది కమ్యూనిస్టులు, పార్టీ సభ్యులు కాని వారూ గ్రామీణ ప్రాంతాల్లో పని చేయడానికై వెళ్ళారు.

ఇవి పార్టీ అమలు జరిపిన అతి ముఖ్యమైన చర్యలు. వ్యవసాయ రంగంలోను, మొత్తం సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలోను విప్లవాత్మకాభివృద్ధికివి తోడ్పడ్డాయి. గత ఐదు సంవత్సరాల్లో అంతకు ముందు ఐదు సంవత్సరాలకంటే, మొత్తం వ్యవసాయోత్పత్తి 43 శాతం పెరిగింది. ధాన్యం, మాంసం, పాలు, వ్యవసాయ క్షేత్రాల ఇతర వస్తువుల ఉత్పత్తి బాగా పెరిగింది. సమిష్టి ఉత్పత్తి పెరుగుదల వల్ల సమిష్టి వ్యవసాయ క్షేత్రాల ద్రవ్యాదాయం, వాటి పంపకం చేయబడని ఆస్తులు రెట్టింపైనాయి. సమిష్టి వ్యవసాయంలో సాధించిన అభివృద్ధి ద్వారా రైతుల జీవన స్థాయి పెరిగింది.

వ్యవసాయ రంగంలోని ప్రధాన శాఖల పరిస్థితిని గురించి ఇప్పు డాలోచిద్దాం.

వ్యవసాయాభివృద్ధికి ధాన్యం అధికంగా ఉత్పత్తి చేయడం పునాదిగా, గ్రామీణ శ్రామిక ప్రజలను పని నిర్వహణలో పార్టీ కేంద్ర కమిటీ నడిపిస్తున్నది. పచ్చికబీడు–సాగు మార్పిడి పద్ధతిని విచక్షణా రహితంగా ఉపయోగించడాన్ని పార్టీ విమర్శించింది. గోధుమ, మొక్కజొన్న లాంటి ఎక్కువ ఉత్పత్తి దాయకమైన, విలువైన పంటలు ఎక్కువ భూముల్లో పండించేందుకు చర్యలు తీసుకోబడ్డాయి. నారుమళ్ళ పెంపకం చెప్పుకోదగినంతగా పెంపొందింప బడింది.

పార్టీ తీసుకొన్న ముఖ్య చర్యల్లో బీడు భూములను, ఉపయోగించకుండావున్న భూములను అభివృద్ధి పరచడం ఒకటి. ఈ కార్యక్రమాన్ని జయప్రదంగా నిర్వహించినట్లు మహాసభకు తెలియజేయడానికి కేంద్ర కమిటీ సంతోషిస్తున్నది. కజకస్తాన్, సైబీరియా, ఓల్గా ప్రాంతం, ఉరల్స్, తదితర తూర్పు ప్రాంతాల అపారమైన స్టెప్పీ భూముల్లో 4 కోట్ల 17 లక్షల హెక్టార్ల భూమి కొత్తగా సాగులోనికి వచ్చి ప్రజావసరాలకు పయోగపడుతున్నది. ప్రభుత్వం కొనుగోలు చేస్తున్న ధాన్యంలో 40 శాతానికి మించి కొత్తభూములు సప్లయి చేస్తున్నాయి. కమ్యూనిస్టు వ్యవస్థానిర్మాణంలో యీ భూముల నభివృద్ధి పరచడం మన వీర ప్రజలు సాగించిన మహత్తర కృత్యం. ఈ విజయం చిరకాలమూ స్మరించబడుతుంది.

కొత్తగా అభివృద్ధిచెందిన భూములవల్ల, మనదేశపు అనేక ప్రాంతాల్లోని ధాన్యం నిల్వ పరిస్థితి పూర్తిగా మారింది. కొత్త భూముల నభివృద్ధి పరచడం ద్వారా దేశంలో ధాన్యపు ఉత్పత్తిలో సాధింపబడిన పెరుగుదల— యీ చారిత్రిక సత్యం గురించి సగర్వంగా చెప్పుకుంటాము. కొత్త భూముల నభివృద్ధి పరచకముందు యిందుకు సంబంధించిన ప్రాంతాలలో ఏడాదికి సగటు ధాన్యం ఉత్పత్తి 2 కోట్ల 27 లక్షల టన్నులు. 1956–1960

మధ్య ఏడాదికి సగటు ధాన్యం ఉత్పత్తి 5 కోట్ల 51 లక్షల టన్నులు.

ధాన్యపు అమ్మకం కూడా బాగా పెరిగింది. ఈ విషయాన్ని దిగువ అంకెలు వివరిస్తున్నాయి.

ప్రభుత్వానికి ధాన్యం అమ్మకం

[ఏడాదికి సగటున, 000 టన్నులలో]

| | 1949_53 | 1956_60 |
|---|---|---|
| రష్యన్ రిపబ్లిక్ | 19,587 | 28,409 |
| ఆల్తాయ్ ప్రాంతం | 800 | 4,009 |
| ఓరెన్‌బర్గ్ ప్రాంతం | 699 | 1,881 |
| ఓమ్స్క్ ప్రాంతం | 585 | 1,456 |
| నొవోసిబిర్స్క్ ప్రాంతం | 423 | 1,317 |
| క్రాస్నొయార్స్క్ ప్రాంతం | 716 | 1,196 |
| కజక్ రిపబ్లిక్ | 1,819 | 11,545 |
| త్సెలిన్నీ ప్రాంతం | 1,031 | 8,316 |
| త్సెలినోగ్రాడ్ ప్రాంతం | 210 | 2,483 |
| కుస్తానాయ్ ప్రాంతం | 275 | 2,263 |
| కోక్‌చేతవ్ ప్రాంతం | 203 | 1,520 |
| పావ్‌లోదార్ ప్రాంతం | 82 | 1,216 |
| ఉత్తర కజకస్తాన్ ప్రాంతం | 261 | 834 |

దీన్నిబట్టి కొత్త భూముల శక్తెంతో బోధపడుతున్నది. పార్టీ విధానాలవల్ల సాధించిన ఫలితాల్లో ఇవి కొన్ని. కొత్త భూముల అభివృద్ధిలో సోవియట్ యూనియన్‌లోని సోదర రిపబ్లిక్‌లన్నిటి ప్రజలూ పాల్గొనడం సంతోషకరమైనది. ప్రత్యేకించి మన మంచి యువజనులు, లెనినిస్టు యువ కమ్యూనిస్టు లీగ్ సభ్యులు పాల్గొన్నారు. పార్టీ పిలుపునందుకొని లక్షలాది దేశ భక్తులు ఎవరూ నివసించని స్టెప్పీ భూములకు వెళ్ళారు. అక్కడ వారు వీరోచిత శ్రమశక్తి ద్వారా సాహస కృత్యాలను నెరవేర్చారు, వారి మహా దేశానికి ఖ్యాతి తెచ్చారు.

కొత్త భూముల విలువ, అవి మన దేశానికి యిచ్చే లక్షలాది టన్నుల ధాన్యం కంటె అధికమైనది. వాటి అభివృద్ధి తూర్పు నున్న పెద్ద పెద్ద ప్రాంతాల్లో గొప్ప పరిణామాలు తెస్తున్నది. స్టెప్పీ భూముల్లో పెద్ద పెద్ద ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు, నూతనమైన పేటలు, పరిశోధనా సంస్థలు, విద్యా సంస్థలు ఉద్భవించాయి. కొత్త రైల్వేలు, రోడ్లు, ఎక్కువ ఓల్టేజి శక్తిగల విద్యుచ్ఛక్తి లైన్లు కూడా మీరిప్పుడు చూడగలరు. తూర్పున ఒక పెద్ద పారిశ్రామిక మండలాన్ని పార్టీ, ప్రజలు అభివృద్ధి చేశారు. కొత్త భూముల అభివృద్ధివల్ల ధాన్యాన్ని, పశువుల ద్వారా ఉత్పత్తి అయ్యే వస్తువులను మన తూర్పు ప్రాంతాలు యిప్పుడు అపారమైన మొత్తాలలో సప్లయి చేస్తున్నాయి. కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణ మహత్కార్యానికి తూర్పు ప్రాంతం ఆ విధంగా తోడ్పడుతూంది. భూమిని పునరుజ్జీవం చేసే నిజమైన కమ్యూనిస్టు పద్ధతికి ఉదాహరణ ఇక్కడే మనకు కనుపిస్తుంది.

ధాన్యం ఉత్పత్తికి వ్యవసాయాన్ని పెంపొందిస్తూనే, పంచదార దుంప, పత్తి, నార, సూర్యకాంతం పూవు విత్తులు, బంగాళా దుంపలు, కూరగాయలు, నిమ్మజాతి పండ్లు, ద్రాక్ష, తేయాకులతో సహా పళ్ళ ఉత్పత్తి పెంచడానికి కూడా పార్టీ కృషి చేస్తున్నది. ఈ రంగాల్లో కూడా చెప్పుకోదగినన్ని విజయాలను సాధించాము. వ్యవసాయాభివృద్ధిని గురించి దిగువ పట్టీ ద్వారా తెలుసుకోవచ్చును :

సాంవత్సరిక సగటు ఉత్పత్తి

| | 1951_55 | 1956_60 | 1951_55లో 100 అయితే 1956_60లో |
|---|---|---|---|
| ధాన్యం (000,000 టన్నుల్లో) | 89.1 | 126.8 | 142 |
| పంచదార దుంప (రిఫైనరీలలో) (000,000 టన్నుల్లో) | 24.0 | 45.6 | 190 |
| పత్తి (000 టన్నుల్లో) | 3 888 | 4,365 | 112 |

| | 1951–55 | 1956–60 | 1951–55లో 100 అయితే 1956–60లో |
|---|---|---|---|
| సూర్యకాంత పూవు విత్తనాలు (000 టన్నుల్లో) | 2,456 | 3,672 | 150 |
| నార (000 టన్నుల్లో) | 234 | 438 | 187 |
| బంగాళాదుంపలు (000,000 టన్నుల్లో) | 69.5 | 88.3 | 127 |
| కూరగాయలు (000,000 టన్నుల్లో) | 11.2 | 15.1 | 134 |
| పండ్లు (000 టన్నుల్లో) | 2,100 | 2,905 | 138 |
| ద్రాక్ష (000 టన్నుల్లో) | 1,021 | 1,592 | 156 |
| తేయాకు (000 టన్నుల్లో) | 105.8 | 134.0 | 127 |

పైవిధంగా ఐదు సంవత్సరాల్లో వ్యవసాయోత్పత్తి చెప్పుకోదగినంతగా పెరిగింది. ఫలితంగా ధాన్యం, వ్యవసాయ క్షేత్రాలు ఉత్పత్తి చేసే యితర సరుకులను ప్రభుత్వం కొనడం బాగా పెరిగింది. ముందు మూడు, మూడున్నరకోట్ల టన్నుల ధాన్యాన్ని ప్రభుత్వం కొనుగోలు చేసేది, కాని యిటీవలి సంవత్సరాల్లో ఐదు, ఐదున్నర కోట్ల టన్నుల ధాన్యాన్ని లేదా దీనికి ఎక్కువను ప్రభుత్వం కొంటున్నది.

అత్యవసరంగా పరిష్కరించవలసిన వ్యవసాయాభివృద్ధి సమస్యల్లో పశుపోషణను పెంపొందించడం ప్రత్యేక స్థానం వహిస్తున్నది. ఇటీవల కొంతకాలంవరకు యీ కీలకమైన రంగం పూర్తిగా నిర్లక్ష్యం చేయబడిందనీ, ప్రజలకు ఆహారం అందించడంలో తీవ్రమైన యిబ్బందులు ఎదురయ్యాయనీ మీకు జ్ఞాపకం వుండే వుంటుంది. చాలకాలంగా వున్న యీ లోటును తీర్చడానికి గొప్ప కృషి అవసరమైంది. ఆహార ఉత్పత్తిని పెంచవలసిన సమస్యను అన్నిటికంటె ముందుగా పరిష్కరించడం తప్పనిసరి. ఆహారం సప్లయి ఎక్కువ చేయాలంటే, కొత్త భూములనభివృద్ధి చేయడంతోపాటు మొక్కజొన్న ఎక్కువగా పంట పండించటం చాలా అవసరం. పాలుపట్టే దశలో పశుగ్రాసం నిలవకోసం మొక్కజొన్న పంట

పండించచడం, సాగుభూమి విస్తీర్ణాన్ని బాగా పెంచింది. ఆ విలువైన పంటను దేశంలోని అన్ని ప్రాంతాలకు యింతమించు విస్తరించేటట్టు చేసింది. 1953లో మొక్కజొన్న పంట 34 లక్షల 85 వేల హెక్టార్లలో పండిస్తే, ఇప్పుడు దాదాపు 2 కోట్ల 60 లక్షల హెక్టార్లలో ఆ పంటను పండిస్తున్నారు. సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు పశుగ్రాసపు ధాన్యం ఉత్పత్తిని బాగా పెంచాయి, పశుగ్రాసపు నిల్వమొత్తాన్ని ఎంతో హెచ్చించాయి. పశువులకు, కోళ్ళకు, క్షీర క్షేత్రాలకు ఆవరణలు ఏర్పరచడంలో పెద్ద కృషి జరిగింది. ఎక్కువ శ్రమశక్తి అవసరమైన పనుల్లో యాంత్రీకరణ ప్రవేశపెట్టడానికి పెద్ద కృషి జరిగింది.

సమిష్టి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లో పశు ప్రజననంలో పెద్ద మార్పులు వచ్చాయని మనం గట్టిగా చెప్పవచ్చు. పశువుల సంఖ్యనే తీసుకొందాం. చాల కాలం వరకు పశువుల సంఖ్యలో ఎదుగూ, బొదుగూ లేదు. ఇటీవలి కొద్ది సంవత్సరాల్లో మాత్రమే ఆ పరిస్థితిలో చెప్పుకోదగిన మార్పు వచ్చింది. అన్ని రకాల వ్యవసాయ క్షేత్రాల్లో పశువుల సంఖ్య దిగువ విధంగా పెరిగింది.

| | 1955 (000,000లలో) | 1960 | 1955లో 100 అయితే 1960లో |
|---|---|---|---|
| పశువులు | 58.8 | 75 8 | 129 |
| ఆవులు | 27.7 | 34.8 | 126 |
| పందులు | 34.0 | 58.7 | 173 |
| గొర్రెలు | 103.3 | 133.0 | 129 |

పశుగణం ప్రధానంగా సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లో పెరుగుతున్నదని గుర్తించుకొనడం అవసరం. వ్యవసాయ క్షేత్రాల్లోని పశువుల సంఖ్య గత ఐదు సంవత్సరాల్లో 68 శాతం పెరిగింది; పందుల సంఖ్య 150 శాతం పెరిగింది.

మాంసం, పాలు, తదితర వస్తువుల కొనుగోలు పెరుగుదల, పశు పోషణలో సాగించిన కృషిని స్పష్టం చేస్తుంది.

కొ ను గొ లు

[పాలుకు సగటున, 000 టన్నులలో]

| | 1951-55 | 1956-60 | 1951-55లో 100 అయితే 1956-60లో |
|---|---|---|---|
| మాంసం (బతికివున్నప్పటి బరువు) | 3,523 | 6,111 | 173 |
| పాలు | 10 987 | 22,231 | 202 |
| గుడ్లు (000,000) | 2,582 | 4,841 | 187 |
| ఉన్ని | 190.6 | 310 6 | 163 |

పశువుల సంబంధమైన వస్తువుల కొనుగోలు బాగా పెరిగినట్లు మీరు గమనించవచ్చును. ఈ వస్తువులను దేశానికి సప్లయి చేయడంలో సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు అత్యంత ప్రధానమైనవిగా రూపొందాయనే అంశాన్ని నొక్కి చెప్పటం అవసరం. గత ఏడాది మొత్తం మాంసం అమ్మకంలో వ్యవసాయ క్షేత్రాల వాటా 87 శాతం, పాల విషయంలో 93 శాతం. మన పార్టీ విధానానికిదొక పెద్ద విజయం, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థకు విజయం.

కామ్రేడ్స్, వ్యవసాయ రంగంలో మనం సాధించిన అభివృద్ధి, ప్రశంసనీయమైనది, నిర్వివాదమైనది. అయినప్పటికీ కొన్ని వస్తువులు, ముఖ్యంగా మాంసం మనకు ఎందుకు కొరతగా వున్నాయనే ప్రశ్న ఉదయిస్తుంది. మొత్తంమీద మనం అనేక ముఖ్యమైన విజయాలు సాధించినప్పటికీ, పశు సంబంధమైన వస్తువులను ప్రజల కందించడంలో మనం ఎందుకిబ్బంది పడుతున్నామనే ప్రశ్న ఎదురౌతుంది.

పారిశ్రామికోత్పత్తి పెరుగుతున్నంత వేగంగా వ్యవసాయోత్పత్తి పెరక్క పోవడమూ ప్రజల పెరుగుతున్న అవసరాలకు తగినట్లుగా వ్యవ

సాయోత్పత్తి జరగక పోవడమూ, ప్రప్రధానంగా యిందుకు కారణం.

ఇటీవలి సంవత్సరాల్లో మన దేశంలో వచ్చిన మార్పులను పరిశీలిద్దాం. మన జనాభా బాగా పెరిగింది. 1955తో పోల్చితే, నేను చెప్పినట్లు, రెండు కోట్ల మందికి పైగా అది పెరిగింది. శ్రమ జీవుల ఆదాయాలు ఏటేటా పెరుగుతున్నాయి. వేతనాలు పెరిగాయి; పన్నులు రద్దయ్యాయి; ప్రభుత్వం అప్పులు కోరుతూ ప్రకటించడం మానివెయ్యడం జరిగింది; పింఛన్లు పెరిగాయి; వీటన్నింటి కారణంగా 1955 లో కంటే 1960 లో ప్రజల ఆదాయం 2వేల 400 కోట్ల రూబుళ్ళు పెరిగింది. కార్మికులు, కర్షకులు తమ డబ్బు నిల్వ చేయడం లేదనీ, ఆహారం, తదితర వస్తువుల కొరకు ఖర్చు చేస్తున్నారనీ వేరే చెప్పనక్కరలేదు. అందువల్ల మాంసం, పాలు, వెన్న వినియోగం ఎక్కువగా పెరగడం సహజం. పశు సంబంధమైన వస్తువులను ప్రభుత్వ, సహకార సంస్థలు ప్రజలకు చేసే అమ్మకాలు దిగువ విధంగా పెరిగాయి :

| | 1953 | 1960 |
|---|---|---|
| | (000 టన్నులలో) | |
| మాంసం, మాంసం సరుకులు | 1,757 | 4,158 |
| పాలు, యావత్తు పాల వస్తువులు | 1,980 | 8,214 |
| వెన్న | 330 | 613 |

ఎక్కువ విలువైన ఆహార పదార్థాలను ప్రజలు ఎక్కువగా వినియోగించుకొంటున్నారంటే అది మనందరికీ సంతోషదాయకం. సోవియట్ ప్రజలు మరింత బాగా తినేటట్టు చేయడానికి, జీవన ప్రమాణం అభివృద్ధికీ పార్టీ కృషిచేస్తున్నది. ఆహార వినిమయం ఇంకా పెరుగుతూనే వుంటుంది. అంటే వ్యవసాయ సమస్యల పరిష్కారానికి మనం ఎప్పుడూ ప్రాధాన్యత నివ్వాలి: ప్రజల అవసరాలను మించి ఉత్పత్తి కొనసాగేటట్టు చూడాలి. అయినా పార్టీ ప్రభుత్వ సంస్థలనేకం వ్యవసాయం పట్ల శ్రద్ధ చూపడం 1959, 1960 సంవత్సరాల్లో తగ్గించాయి. అందువల్ల ఉత్పత్తి స్థాయి

ముఖ్యంగా మాంసం, పాల విషయంలో, సప్తవర్ష ప్రణాళిక లక్ష్యాలకంటె బాగా తగ్గింది.

ఈ పరిస్థితి పార్టీని బాగా ఆందోళన పరిచింది. వ్యవసాయ నిర్వహణలో జరిగిన పొరపాట్లను 1961 జనవరిలో జరిగిన కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం నిశితంగా విమర్శించింది; అన్ని రకాలైన అశ్రద్ధనూ, అతి ధైర్యాన్నీ ఖండించింది. వ్యవసాయ పరిస్థితిని మెరుగు పరచేందు కవసరమైన మార్గాలు, సాధనాల గురించి కేంద్ర కమిటీ సమావేశం, మండల మహాసభ లోతుగా పరిశీలించాయి; ఉత్పత్తి పెంచేందుకై తీసుకొనవలసిన స్పష్టమైన చర్యలను రూపొందించాయి.

పార్టీ రూపొందించిన పథకాలను సోవియట్ ప్రజలు సంపూర్ణంగా బలపరిచారు. ఈ చర్యలన్నీ వాస్తవికమైన దృక్పథంతో కూడినవని ప్రజలు నమ్ముతున్నారు. కేంద్రకమిటీ జనవరి సమావేశ నిర్ణయాలను ప్రజలు పట్టుదలతో ఆచరణలో పెడుతున్నారు. ఈ చర్యల నమలు పరచడం గురించి పార్టీ నిర్ణయించి కొద్దికాలం మాత్రమే గడిచింది, నిజమే. అందువల్ల వ్యవసాయ పరిస్థితి పైన యీ చర్యల సంపూర్ణ ప్రభావమింకా పడలేదు. కాని యిప్పటివరకూ చేయబడిన కృషినిబట్టీ, యీ సంవత్సరం వచ్చిన ఫలితాలనుబట్టి చూస్తే, త్వరలోనే వ్యవసాయోత్పత్తి బ్రహ్మాండంగా పెరగవచ్చుననే నిర్ణయానికి రావొచ్చు.

ఈ సంవత్సరం మనం సాధించిందేమిటి? గత సంవత్సరం కంటె మొత్తం ధాన్యం ఉత్పత్తి పెరిగింది. ప్రభుత్వపు కొనుగోలు కూడ ఎక్కువే. అక్టోబరు 15వ తేదీనాటికి ధాన్యం కొనుగోలు 5 కోట్ల 5 లక్షల టన్నులు; లేదా గత సంవత్సరం అదే తేదీని ప్రభుత్వం చేసిన దానికంటె ఇది 58 లక్షల టన్నులు అధికం. ఈ సంవత్సరాంతానికి మొత్తం కొనుగోలు సుమారు 5 కోట్ల 40 లక్షల టన్నులవుతుంది. అది గత సంవత్సరం చేసిన కొనుగోలుకంటే 74 లక్షల టన్ను లెక్కువ అవుతుంది. పార్టీ, ప్రజల కృషికిదొక పెద్ద విజయం. ఈ సంవత్సరం వాతా

వరణ పరిస్థితులు బాగా లేవు. అలాంటి పరిస్థితుల్లో యిలాంటి విజయాలు సాధించడమంటే ఎక్కువ విలువైన విషయం.

గతంలో కంటే ఎక్కువ ధాన్యాన్ని ఉత్పత్తి చేయడానికి, ఎక్కువ కొనుగోలు చేయడానికి మనకు సహాయపడ్డ అంశాలేమిటి? కేంద్ర కమిటీ నిర్ణయాలను అమలు జరపడంలో తమ పంటల పథకాలను సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు పునఃపరిశీలించాయి; తక్కువ ఉత్పత్తి దాయకమైన పంటల స్థానంలో ఎక్కువ ఉత్పత్తిదాయకమైన పంటలను, ముఖ్యంగా మొక్కజొన్న, లెగూము పళ్ళను ఎక్కువగా వేశాయి. ఇది అత్యంత ప్రధాన విషయం. ఈ ముఖ్యమైన చర్యలను అన్ని సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలూ అమలు జరపలేదనే విషయాన్ని ఇక్కడ చెప్పవలసి వుంటుంది.

పార్టీ అనుసరించిన పద్ధతులవల్ల, వ్యవసాయం బాగుపడ్డ వాటిలో ఉక్రెయిన్ మంచి ఉదాహరణ. వ్యవసాయ వ్యవహారాల నిర్వహణలోని లోపాలకూ, ముఖ్యంగా ధాన్యం ఉత్పత్తి తగ్గినందుకూ ఉక్రెయిన్ కమ్యూనిస్టు పార్టీ నాయకులను, ఆ రిపబ్లిక్ మంత్రివర్గ మండలిని, ప్రాంతీయ పార్టీ కమిటీలను, ప్రాంతీయ సోవియట్ల కార్యవర్గాలను, జనవరి కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం నిశితంగా విమర్శించిన విషయం మీకు గుర్తుంటుంది. గత సంవత్సరం 59 లక్షల టన్నుల ధాన్యాన్ని మాత్రమే ఉక్రెయిన్ అమ్మింది.

ఉక్రెయిన్ కామ్రేడ్స్, బహుశా, మీకీవిషయం గుర్తుండేవుంటుంది. మీరు మర్చిపోయి వుండరు.

"మేం మరచిపోలేదు. ఈ విషయాన్ని గుర్తుంచుకొనేది ఉక్రెయిన్ వాసులొక్కరే కాదు," అన్నారొకరు సభలోనుండి.

"బాగా వుంది!" అన్నారు కృశ్చేవ్.

తమపై చేసిన విమర్శలనుండి సరియైన గుణపాఠాలను పార్టీ సంస్థలు నేర్చుకొన్నాయి. నూతనమైన పెద్ద కర్తవ్యాలను నిర్వహించేందుకు,

గ్రామీణ ప్రాంతాల్లోని కార్మికులను అవి సమీకరించాయి; వారికి నాయకత్వం వహించి పనిచేశాయి. తమ భూమిని, వనరులను యీ రిపబ్లిక్ సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు మరింత బాగా వినియోగించుకొన్నాయి. లక్ష్యాలను, పథకాలను సాధించేందుకై అనుకరణ ఉద్యమాన్ని సాగించాయి. మొక్కజొన్న పండించడంలో అభివృద్ధికరమైన పద్ధతులను గురించి లక్షలాది ప్రజలకు బోధించబడింది. ధాన్యం బదులు మొక్కజొన్న పంట వేసిన భూమి ఈ సంవత్సరం బాగా విస్తరించింది ఒక్కొక్క హెక్టార్ నుండి లభించే ఉత్పత్తిలో కూడా చెప్పుకోదగ్గ పెరుగుదల కన్పించింది. అదనంగా మరో 3 లక్షల, 42 వేల హెక్టార్లలో బటాణీల పంట వేయబడింది. హెక్టారుకు సగటు ఉత్పత్తి 1.74 టన్నులు, ధాన్యం ఉత్పత్తిని పెంచడంలోను, ప్రభుత్వానికి ఎక్కువ ధాన్యాన్ని అమ్మడంలోను ఇవి గొప్ప పాత్రను నిర్వహించాయి.

ఉక్రెయిన్‌లోని వివిధ ప్రాంతాల ధాన్యం అమ్మకంలో వచ్చిన మార్పులను, దిగువ పట్టీద్వారా తెలుసుకోవచ్చును:

ప్రభుత్వానికమ్మిన ధాన్యం
(000 టన్నుల్లో)

| ప్రాంతం | 1961 (అక్టోబరు 15వ తేదీ నాటికి) | ఏడాదికి సగటు 1956-60 |
|---|---|---|
| పోల్తావా | 1,197 | 359 |
| నిప్రొపెత్రోవ్‌స్క | 1,142 | 717 |
| ఖార్కొవ్ | 982 | 406 |
| కిరోవోగ్రాడ్ | 986 | 504 |
| జపోరోజ్యే | 891 | 676 |
| వన్నిత్స | 669 | 439 |
| లుగన్‌స్క | 657 | 169 |
| చెర్కాస్క | 602 | 325 |

ఈ సంవత్సరానికి దాదాపు ఒకకోటి, 40 లక్షల టన్నుల ధాన్యాన్ని ఉక్రెయిన్ సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు ప్రభుత్వానికమ్మతాయి. ఇందులో ఒక కోటి 22 లక్షల టన్నుల ధాన్యాన్ని అక్టోబరు 15 సరికి అమ్మాయి. ఇంత ధాన్యాన్ని అమ్మినప్పటికీ సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు విత్తనాలకై పుష్కలంగా ధాన్యాన్ని అట్టిపెట్టాయనీ, పశుగ్రాసం కొరకు గతంలో ఎన్నడూ లేనంత ధాన్యం నిల్వ వుంచాయనే విషయాన్ని గుర్తించుకొనడం అవసరం. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు సభ్యులకు పని రోజుకు సమృద్ధిగా ధాన్యాన్ని సప్లయి చేస్తాయి. పెద్ద పంటలు పండించినందుకు బోనస్సులను పూర్తిగా చెల్లిస్తాయి.

కామ్రేడ్స్, యిది సంతోషించదగిన సంగతి. ఉక్రెయిన్‌లో నేను చాలా సంవత్సరాలున్నాను. ఉక్రెయిన్ ప్రజలెంత శ్రమశీలురో నాకు బాగా తెలుసు. ఆర్థిక పునర్నిర్మాణానికై వారితో కలిసి యుద్ధానికి పూర్వమూ యుద్ధం తర్వాత కూడ నేను పనిచేశాను. ధాన్యం ఉత్పత్తిలో ఉక్రెయిన్ ప్రజలు నేడు సాధించినంతటి విజయాలు సాధిస్తారని అప్పుడు మనకు ఊహలో సైతం తట్టలేదనే విషయాన్ని నేను అంగీకరించాలి. వ్యక్తి చైతన్యాన్ని "అస్తిత్వం" నిర్ణయిస్తుందని మనం తరచు చెప్పుకొంటాం. కొన్ని సమయాల్లో "దెబ్బ" పడితేగాని తెలివిరాదని కూడా తమాషాగా అనుకొంటుంటాము. అంచేత, మన ఉక్రెయిన్ కామ్రేడ్స్ పైన చేసిన విమర్శ ఘాటుగానే ఉన్నప్పటికీ, సమర్థనీయమైందే. విమర్శ సక్రమంగా స్వీకరించబడింది, సరిగ్గా అర్థం చేసుకోబడింది. విమర్శ ఉక్రెయిన్ ప్రజలను ఉత్తేజపరిచింది, తమ శక్తిని వారు రుజువు చేసుకొన్నారు. ఈ సందర్భంలో ఉక్రెయిన్ కామ్రేడ్స్‌ను మనం ప్రశంసింపుతాము, వ్యవసాయోత్పత్తిని వారు యింకా పెంచగలరని ఆశిస్తాము.

ఉక్రెయిన్ కమ్యూనిస్టు పార్టీ, ఉక్రెయిన్ ప్రజలంతా ఘనమైన విజయాన్ని సాధించారు. తాము గొప్ప విజయాలను సాధించగలిగామని యీ మహాసభకు చెప్పుకొనగల ఉక్రెయిన్ శ్రామికులకు గొప్ప ఘనత చెల్లుతుంది.

ధాన్యం ఉత్పత్తిలో రష్యన్ సమాఖ్యలోని అనేక ప్రాంతాల శ్రామిక జనులు యీ సంవత్సరం మంచి విజయాలను సాధించారు. అక్టోబరు 15వ తేదీనాటికి యీ రిపబ్లిక్ సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు ప్రభుత్వానికి 2 కోట్ల 99 లక్షల టన్నుల ధాన్యాన్ని అమ్మాయి. ఈ మొత్తం గత సంవత్సరం యిదే తేదీనాటికి అమ్మిన ధాన్యంకంటె 15 లక్షల టన్నులు అధికం. రష్యన్ సమాఖ్యలో 3 కోట్ల 30 లక్షల టన్నుల ధాన్యాన్ని ప్రభుత్వం కొంటుంది. ప్రజల ఆహార, పశుగ్రాసం అవసరాలను యీడేర్చడంలో మొక్కజొన్న పంట, ఉక్రెయిన్‌లో వలెనే యీ రిపబ్లిక్‌లో కూడా ముఖ్య పాత్రను నిర్వహించింది.

పెద్ద, పెద్ద ప్రాంతాల్లో మొక్కజొన్న పంట ఎక్కువగా పండించబడింది. ఉదాహరణకు క్రాస్నొదార్ భూభాగాన్ని తీసుకొందాం. ఈ సంవత్సరం వర్షాభావం వల్ల క్యూబన్ ప్రాంతంలో ధాన్యం హెక్టారుకు 1.9 టన్నులు మాత్రమే పండింది. అంటే గత సంవత్సరం హెక్టారుకు 2.3 టన్నులు పండితే యీ యేడాది ఐదింట రెండు టన్నులు తక్కువన్నమాట. అయినప్పటికీ పండించిన మొత్తం ధాన్యం, ప్రభుత్వానికమ్మిన మొత్తం ధాన్యం చెప్పుకోదగినంతగా పెరిగాయి. అక్టోబరు 15వ తేదీనాటికి ఆ ప్రాంతంలోని సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు ప్రభుత్వానికి 19 లక్షల టన్నుల ధాన్యాన్ని అమ్మాయి. గత సంవత్సరం యిదే నాటికి అమ్మిన దానికంటె యిది 5 లక్షల 71 వేల టన్నులధికం ఇదెలా సాధ్యమైంది? ఆ ప్రాంతంలోని సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు 4 లక్షల హెక్టార్ల భూమిలో మొక్కజొన్న పంటను బాగా పండించాయి. ఆ విధంగా 1961వ సంవత్సరం అక్టోబరు 15వ తేదీనాటికి 5 లక్షల 48 వేల టన్నుల మొక్కజొన్నను ప్రభుత్వానికి వ్యవసాయ క్షేత్రాలు అమ్మగలిగాయి. గత సంవత్సరం యిదే తేదీకి అవి అమ్మగలిగింది 3 లక్షల 8 వేల టన్నులు మాత్రమే.

కేంద్ర నల్లమట్టి ప్రాంతాలలో ఓల్గా ప్రాంతపు కొన్ని మండలా

లలో, ఉరల్స్, సైబీరియాలలో ధాన్యం ఉత్పత్తి పెంచడంలో అక్కడి సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతులు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల పని వారూ గొప్ప విజయాన్ని సాధించారు. వ్యవసాయోత్పత్తిని పెంచేందుకు రష్యన్ సమాఖ్యలో అమోఘమైన అవకాశాలున్నాయని వారు చాటి చెప్పారు. కొన్ని ప్రాంతాలు ప్రభుత్వానికమ్మిన ధాన్యపు మొత్తాలు దిగువ యివ్వబడ్డాయి:

ప్రభుత్వానికమ్మిన ధాన్యం
[000 టన్నులలో]

| ప్రాంతం | 1961 (అక్టోబరు 15వ తేదీకి) | 1956_60లో సంవత్సరానికి సగటు |
|---|---|---|
| స్టాలిన్‌గ్రాడ్ | 2,036 | 1,229 |
| వోరొనెజ్ | 1,084 | 630 |

మొక్కజొన్నలు పండించడంలో ట్రాక్టరుచే లాగబడే బదీని ఉపయోగించి, "కొత్త పద్ధతు"లను గత సంవత్సరం కనిపెట్టింది వోరోనెజ్ ప్రాంతమేననే విషయం మీకు గుర్తు ఉండేవుంటుంది. గతంలో వోరోనెజ్ కాంగ్రేడ్స్ తీవ్రమైన విమర్శకు గురయ్యారు. భూమిని సాగుచేసేందుకుపయోగించే పనిముట్లు వాళ్లు మార్చారు, సత్ఫలితాలను సాధించారు.

| | 1961 (అక్టోబరు 15వ తేదీకి) | 1956_60 మధ్య సాలు శగటు |
|---|---|---|
| తాంబోవ్ | 862 | 458 |
| పెంజా | 696 | 150 |
| బెల్గొరోడ్ | 600 | 315 |
| కుర్స్కు | 582 | 375 |
| లిపిత్స్కు | 461 | 277 |

సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లోని రైతులు, ప్రభుత్వ వ్యవసాయ

క్షేత్రాల్లోని కార్మికులు, వ్యవసాయశాస్త్ర నిపుణులు, దృఢదీక్షతో సాగించిన శ్రమ ద్వారాను, బాధ్యతల నిర్వహణకు విస్తృతమైన అనుకరణోద్యమాన్ని పెంపొందించిన పార్టీ సంస్థలు సాగించిన నిర్మాణ, రాజకీయ కార్యక్రమంవల్లనూ యీ విజయాలు సాధించబడ్డాయి.

1961లో ఉక్రెనియన్లు తమ శక్తి యుక్తులను ప్రదర్శించారు. వారి అనుభవాలను రష్యన్ సమాఖ్య కార్మికులు బాగా గమనించాలి, అందునుండి సరైన నిర్ణయాలకు రావాలి. రష్యన్ సమాఖ్యకు గొప్ప అవకాశాలున్నాయి. వారికి కావలసిందల్లా తమ శక్తిని గుర్తించి, సమస్యలను సమర్థవంతంగా ఎదుర్కొనడమే.

"పారిశ్రామికంగా మీరు సాధించిన అభివృద్ధిని మేము నమ్ముతాము. కాని వ్యవసాయ సమస్యలనెలా పరిష్కరిస్తారో మేము అర్థంచేసుకోలేకుండా వున్నాము," అని చాలమంది పశ్చిమ రాజ్యాల రాజకీయవేత్తలు అంటూ వుంటారు.

"కొంచెం వేచి చూడండి. వ్యవసాయోత్పత్తిలో కూడా ఒకటి, రెండు మంచివాటిని మీకు చూపిస్తాము," అని నేను వారితో మాటాడేటప్పుడు చెబుతూండేవాణ్ని.

మనకు తరిగిపోని అవకాశాలున్నాయి. ఇది మనం బాగా గుర్తించి వాటిని వినియోగించుకోవాలి. పార్టీ మహాసభ ముగిసిన తర్వాత రిపబ్లిక్కుల, మండలాల, ప్రాంతాలలో వ్యవసాయ కర్తల మహాసభలను మళ్ళీ జరపడం అవసరమని తోస్తున్నది. ఆ విధంగా కొన్ని స్థానాల్లో వున్న కొంతమందిని బాగా క్రిందికి లాగివెయ్యాలి; శరీరానికి బాగా ప్రాణవాయువు సరఫరా అయేట్టుగా, రష్యన్ స్నానాలు యిష్టమయ్యేవారు చేసేలాగున రోమ కూపాలను పరిశుభ్రం చేయాలి.

తమకున్న శక్తులన్నింటినీ సంపూర్ణంగా రష్యన్ సమాఖ్య శ్రామికులు ఉపయోగించుకొనగలరనడంలో నాకు నమ్మకముంది. వ్యవసాయ రంగంలోని అన్ని శాఖలనూ అభివృద్ధిపరచడంలో నూతన విజయాలను వారు సాధించుతారని నా విశ్వాసం.

తృణధాన్యాలు, లెగూమ్సు పండ్ల ఉత్పత్తిలో చాలప్రాంతాలు క్షమించవీల్లేనంతగా వెనకబడి వున్నాయని జనవరిలో జరిగిన కేంద్ర కమిటీ సమావేశం ఎత్తిచూపింది. ఈ సంవత్సరం ఈ పంటల ఉత్పత్తిలోను, అమ్మకంలోను చెప్పుకోదగ్గ అభివృద్ధి కనపడింది. గత సంవత్సరం ప్రభుత్వానికి 3 లక్షల 50 వేల టన్నుల లెగూమ్సు అమ్మబడ్డాయి. కాని ఈ సంవత్సరం అమ్మకం 6 లక్షల 76 వేల టన్నులు. బక్‌వీట్, జొన్నలు ఎక్కువగా, ప్రభుత్వం కొనుగోలు చేసింది.

పత్తి, పంచదార దుంప, పొద్దు తిరుగుడు పూవు విత్తనాలు, తదితర పంటల ఉత్పత్తి కూడ పెరిగింది. ఈ సంవత్సరం నీటి పారుదల కొరత యిబ్బందులున్నప్పటికీ ఉజ్బెకిస్తాన్, తజికిస్తాన్, తుర్క్‌మెన్, కిర్గిజ్ రిపబ్లిక్కుల్లోని, కజకస్తాన్ రిపబ్లిక్‌లోని, దక్షిణ కజకస్తాన్ ప్రాంతంలోని సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతులు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల పనివారు గట్టి పట్టుదల చూపారు. మంచి పత్తి ఉత్పత్తిని వారు సాగించారు. తమ లక్ష్యాలను విజయవంతంగా నెరవేర్చుతున్నారు. అక్టోబరు 15వ తేదీనాటికి మొత్తం 30 లక్షల టన్నులు పత్తిని ప్రభుత్వం కొనుగోలు చేసింది. అది గత సంవత్సరం కొనుగోలుకంటె 6 లక్షల 63 వేల టన్నులు అధికం. అన్నిటికంటె ఎక్కువగా పత్తి పండించే ఉజ్బెకిస్తాన్ 19 లక్షల 82 వేల టన్నుల పత్తి ప్రభుత్వానికమ్మింది. గత సంవత్సరానికంటె యిది 4 లక్షల 53 వేల టన్నులు అధికం.

జార్జియా సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు గత సంవత్సరంలోవలెనే, యీ యేడు కూడా తేయాకును అద్భుతంగా పండించాయి. ప్రణాళికా లక్ష్యాలను 100కి 107 పాళ్ళను నెరవేర్చి, ప్రభుత్వానికి 1 లక్ష 54 వేల టన్నుల తేయాకును అవి అమ్మాయి.

ఇవీ వ్యవసాయంలో యీ సంవత్సరపు ప్రాథమిక ఫలితాలు. పశు ప్రజననం విషయంలో కూడా మనం కొంత విజయాన్ని సాధించాం. సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోని పశువుల సంఖ్య అదనంగా యీ

యేడు 40 లక్షలు పెరిగింది. ఆవుల సంఖ్య పెరుగుదల 17 లక్షలు. పందుల సంఖ్య పెరుగుదల 50 లక్షలు; గొర్రెల సంఖ్య 30 లక్షలు పెరిగింది. పశు సంబంధమైన సరకులను ప్రభుత్వం కొనడం హెచ్చింది.

అయితే మాంసం, పాల ఉత్పత్తి పెరుగుదల రేటు అవసరమైన దాని కంటె చాల తక్కువగా వున్నది. 1962 నాటికి వస్తువుల ఉత్పత్తిని చెప్పుకోదగ్గట్టుగా పెంచడానికి మరింత శ్రమ చేయాలి; ఉన్న శక్తులన్నింటినీ వినియోగించుకొనడం అన్నింటికంటె అవసరం.

## 4. వ్యవసాయాభివృద్ధిని ఇంకా ముందుకు తీసుకొని పోవాలి. వ్యావసాయక వస్తువుల విషయమై ప్రజల అవసరాలను మరింత సంపూర్ణంగా తీర్చాలి.

కామ్రేడ్స్, మన అవకాశాలు లెక్కకు మించి వున్నాయి. జనవరి కేంద్ర కమిటీ నిర్ణయించినట్లుగా వచ్చే కొద్ది సంవత్సరాల్లో ధాన్యం కొనుగోలును ఏడాదికి 6 కోట్ల 89 లక్షల టన్నులకు, మాంసం కొనుగోలును ఒకకోటి 30 లక్షల టన్నులకు, పాల కొనుగోలు 5 కోట్ల టన్నులకు పె[illegible] గలుగుతాము. ఏ విధంగా ఉత్పత్తిని పెద్దగా అభివృద్ధిచేయగలం, వ్యవసాయ సరకుల కొనుగోలు ఏ విధంగా అంత స్థాయికి తీసుకొనిరాగలం?

ధా[illegible] ఉత్పత్తి పెంచడానికి, పంట తరిహాను అభివృద్ధి చేసుకుంటూ వెళ్ళడమూ ఉత్పత్తి శక్తి హెచ్చు చేయడం చాలా అవసరం. తక్కువ ఉత్పత్తి దాయకమైన పంటలు వేయడం పూర్తిగా మానివేయాలి, వాటి [illegible] ఎక్కువ ఉత్పత్తిదాయకమైన వాటినే వేయాలి పంటల మార్పిడిలో సరియైన పద్ధతిని రూపొందించాలి వ్యవసాయ రంగంలో ఇది సాధ[illegible] కామ్రేడ్స్: అత్యంతావశ్యకమైనది. చాల

ప్రాంతాల్లో మన వ్యవసాయ పద్ధతులు చాల తెలివి తక్కువగా వున్నాయి. ఇందుకు కిరోవ్, కోస్త్రామా, యారోస్లావల్ ప్రాంతాలు ప్రత్యేకమైన దృష్టాంతాలు.

ఉదాహరణకు గత సంవత్సరం కిరోవ్ ప్రాంతంలో 4 లక్షల 77 వేల హెక్టార్లలో ఓట్లు పంట వేయబడింది: ఏడాది పర్యంతమూ, శాశ్వతంగా ఉండే తృణాలు 5 లక్షల 15 వేల హెక్టర్లలో వేయబడింది. ఈ పంటలు పది లక్షల హెక్టార్ల భూమిలో వేయడమైంది. అది మొత్తం సాగు చేసిన భూమిలో 44 శాతం. మరో 5 లక్షల 11 వేల హెక్టార్ల భూమి పూర్తి బీడు. ఒక్కొక్క హెక్టారు భూమిలో శాశ్వత తృణాలు 0.7 నుండి 0.8 టన్ను వరకు గడ్డిని ఉత్పత్తి చేశాయి. ఓట్లు హెక్టారు భూమికి 0.5 నుండి 0.7 టన్ను వరకు పండాయి. దీన్నిబట్టి సేద్యయోగ్యమైన భూమి సగానికి పైగా మనం కేవలం ఉపయోగించుకోలేదని బోధపడుతుంది. మొక్కజొన్న, బఠాణీలు వేసిన భూమి ఒక లక్ష 55 వేల హెక్టర్లు మాత్రమే: ఆ ప్రాంతంలోని మొత్తం సాగు చేసిన భూమిలో యిది 7 శాతం మాత్రమే. అలాంటి పరిస్థితుల్లో సరిపడినంత ధాన్యం ఉత్పత్తిగాని, మేత ఉత్పత్తిగాని ఎలా సాధ్యపడుతుంది? అలాంటి పంటల విభాగంతో పశుపోషణ ఎలా వృద్ధిచెందుతుంది? వ్యవసాయ నైపుణ్యం పైన అనేకులు కిరోవ్ ప్రాంతంలో ప్రసంగించారు: కాని అందరు వక్తలూ ప్రధానాంశాన్ని మరచి పోయారు.

భూమిని సమర్ధవంతంగా సాగుచేయడమంటే అర్థమేమిటి? ఒక హెక్టారుకు, ఒక యూనిట్ శ్రమకు గరిష్ఠంగా ఉత్పత్తిని సాధించడం మొదటిది. ఇది సాధించాలంటే అత్యంత ఉత్పత్తి దాయకమైన పంటలు వేయాలి; పంటల మార్పిడి పద్ధతిని క్రమబద్ధం చేయాలి; శాస్త్రీయ పద్ధతులను నూతన పద్ధతులు కనిపెట్టిన వారి అనుభవాన్ని సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు విరివిగా ఉపయోగించాలి; సాధ్యమైనంత అత్యధిక స్థాయిలో ఉత్పత్తిని సాధించేదిగాను, భూమిని ఉత్తమోత్తమంగా విని

యోగించేదిగాను, ఎక్కువ సారవంతంగానూ పంటలు నాటే పద్ధతి వుండాలి.

దురదృష్టవశాత్తు చాలమంది మన శాస్త్రవేత్తలు, వ్యవసాయ శాస్త్రజ్ఞులు, రైతులు ఇప్పటికీ ఒకసారి భూమిని సాగుచేయం, మరో సారి బీడు పెట్టటం అనే పద్ధతినే అనుసరిస్తున్నారు. ఈ పద్ధతిని విచక్షణా రహితంగా ఉపయోగించినందువల్ల వ్యవసాయానికి చాల నష్టం కలిగింది. వ్యవసాయ రంగంలో మనం అనుసరించుతున్న విచక్షణా రహితమైన అలవాట్లను ఎంత త్వరగా మానివేస్తే, మన అత్యవసర సమస్యలను పరిష్కరించడంలో అంత సృజనాత్మకమైన ఆలోచనను తలపెట్టిన వాళ్ళమవుతాము: ఉన్నతమైన సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల, పరిశోధనా సంస్థల అనుభవాలను మనమెంత ఎక్కువగా వినియోగించుకొంటే అంత త్వరగా ధాన్యం ఉత్పత్తిని, తదితర వ్యవసాయ వస్తువుల ఉత్పత్తిని పెంచగలుగుతాము.

ఏ పంటలు వేయాలనే విషయంలో మొక్కజొన్న, లెగూమ్స్ పంటల ఉత్పత్తిని అధికం చెయాలనే అంశం పైన ప్రత్యేక శ్రద్ధ కనపరచాలి. ఉక్రెయిన్, రష్యన్ సమాఖ్యలోని దక్షిణ ప్రాంతాలు, మోల్దావియా, జార్జియా, అజెర్‌బైజాన్, కజకస్తాన్‌లోని దక్షిణ ప్రాంతాలు, మధ్య ఆసియా రిపబ్లిక్కులు మొక్కజొన్న పంటకు ఎక్కువ అనుకూలమైనవి. పెద్దపెద్ద భూ ఖండాల్లో హెక్టరుకు 5 టన్నుల పొడి ధాన్యాన్ని యిక్కడ పండించవచ్చు. ఏ రకమైనవి మంచివో ముందుగానే ఎంచుకోవాలి. సంకర జాతులను ఎంచుకోవాలి. కేంద్ర నల్లమట్టి ప్రాంతాల్లోను, ఓల్గా ప్రాంతంలోను, తదితరమైన చోట్ల మొక్కజొన్న ధాన్యం పెంచాలి; ఉత్తర ప్రాంతాలకు కూడ మొక్కజొన్నను విస్తరింప చేయాలి.

కామ్రేడ్స్, మొక్కజొన్న పంట లేకుండా అవసరమైన ధాన్యం ఉత్పత్తి దశకు చేరుకొనడం సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు సాధ్యపడదనే విషయాన్ని గుర్తించడం అవసరం. సోవియట్ యూని

యన్‌లో ప్రతిచోట మొక్కజొన్న పంటకు ఎక్కువ అవకాశాలున్నాయని రుజువైంది. దేశంలో కొన్ని ప్రాంతాల్లో మొక్కజొన్నను సరిగా సాగుజేయడం లేదన్నా, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు తక్కువ ఉత్పత్తిని పొందుతున్నాయన్నా, నిందార్హులు నిర్వాహకులేగాని వాతావరణం ఎంతమాత్రం కాదు. ఎక్కడైనా మొక్కజొన్న పండటం లేదంటే, అక్కడేదో ఆ పంటకు అడ్డంకి అవుతున్న "అంశం" ఉన్నదన్నమాట. ఆ "అంశం" నాయకత్వంలో ఉన్నది. మొట్టమొదటగా సమిష్టి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలది ఆ లోపం. తరవాత జిల్లా, ప్రాంతీయ, రిపబ్లిక్ స్థాయిలో సైతం కూడా ఉండి వుండాలి. ధూళితో సమానంగా నిస్సారంగా పనికిరాకుండా పోయిన అధికార్లను తొలగించాలి. ఈ అధికారులు విలువైన మొక్కజొన్న పంటను ఎండబెడుతున్నారు; అది తన విలువను సంపూర్ణంగా నిరూపించకుండా అడ్డుకొంటున్నారు.

ఈ సంవత్సరం ధాన్యం ఉత్పత్తి పెరగడానికి మొక్కజొన్నతో పాటు బఠాణీలు, చిక్కుళ్ళలాంటి వసంతకాలపు పంటల ఉత్పత్తి బాగా అభివృద్ధి చెందడంకూడ ఒక ముఖ్య కారణమని వేలాది సమిష్టి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల అనుభవం నిస్సందేహంగా నిరూపించింది. కార్పేతియన్ కొండల దిగువ ప్రాంతాలు మొదలు సైబీరియా, కజకస్తాన్లోని బీడు స్టెప్పీల వరకూ విశాల ప్రదేశంలో ఒక్కొక్క హెక్టారులో రెండు, మూడు టన్నులు, అంతకు మించి కూడా బఠాణీలు పండుతాయి. మొక్కజొన్న, బఠాణీలు, గ్రాసపు చిక్కుళ్లు పెద్ద ఎత్తున పండించడం మామూలు పనిమాత్రమే కాదు; పంటల నభివృద్ధి చేయడానికి అత్యంతావశ్యకమైంది.

కొత్త భూములను ఎక్కువగా అభివృద్ధి పరచడం, వాటిని బాగా వినియోగించుకొనడం, అధిక ధాన్యోత్పత్తికి ఒక ప్రధాన సాధనం. రానున్న కొద్ది సంవత్సరాల్లో కనీసం 80 లక్షల హెక్టార్ల అదనపు భూమిని మనం సాగులోకి తీసుకొని రావాలి. మొత్తం సాగుబడికింద వున్న కొత్త

భూమిని యిది 5 కోట్ల హెక్టార్లకు పెంచుతుంది. ఈ ప్రాంతాలన్నింటినీ సక్రమంగా వినియోగించుకొనడం జాతీయ ప్రాముఖ్యం గలది. కొత్త భూములను వినియోగించుకొనడంలో తీవ్రమైన తప్పులున్నాయని నేను చెప్పక తప్పదు. ఉదాహరణకు కజకస్తాన్‌లో ఒకే పంట పద్ధతి ఎక్కువ ఆచరణలో ఉన్నది: వసంతకాలంలో నాటే గోధుమ తప్ప, అనేక సంవత్సరాలుగా అక్కడి సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు మరింకే పంటను వేయడం లేదు. అంటే ధాన్యం వెంట ధాన్యాన్ని పండిస్తున్నారన్న మాట. ఫలితంగా భూములు కలుపు మొక్కల మయమయ్యాయి. ఉత్పత్తి పెరుగుదలకు ఆటంక మేర్పడింది కొత్తగా అభివృద్ధి పొందిన భూముల భవిష్యత్తును గురించి కజకస్తాన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీగాని, ఆ రిపబ్లిక్ మంత్రిమండలిగాని ఆలోచించ లేదు; వాటిపైన పంటలు పండించడంలో వచ్చే సమస్యల పరిష్కారానికి తప్పుడు దృక్పథాన్ని అవలంబించాయి.

చేసిన తప్పులను సవరించుకోవాలి. కొత్త భూములను సంపూర్ణంగా వినియోగించుకోవాలి. బంజరుగా ఉన్న భూముల్లో వరుసలో నాటుకొంటూ వెళ్ళే పంటలు విస్తృతంగా పండించడం అవసరం. మొక్కజొన్న, బఠాణీలు, మేత, చిక్కుళ్లు, పంచదార దుంప పంటలను ప్రవేశపెట్టాలి అవసరమైనచోటల్లా శుభ్రమైన బీడు భూముల నట్టిపెట్టాలి. కొత్త భూముల్లో ఉపయోగించే యంత్రాలు వరుస-పంట పద్ధతికి తగినవిగా ఉండాలి. సాగును అక్కడ పెద్ద ఎత్తున యాంత్రికం చేసినప్పుడే వరుసల్లో నాట్లువేసే పంటలను పండించవచ్చును.

ఖచ్చితమైన వ్యవసాయశాస్త్ర నిబంధనలను అమలు జరపడం, పరిశ్రమల్లో సాంకేతిక పద్ధతులు ఎంత తప్పనిసరో భూమిపైని వ్యవసాయ సాంకేతిక పద్ధతులను అంతే తప్పనిసరి చేయడం చాలా ముఖ్యం. పరిశ్రమల్లో ఇంజనీరుకున్న ఉన్నత స్థాయికి భూమి పైన సమిష్టి, ప్రభుత్వ క్షేత్రాల వ్యవసాయ శాస్త్రవేత్త స్థాయిని పెంచాలి.

క్రామేన్స్, కొత్త భూములనభివృద్ధి చేయడం మన పార్టీ సాధించిన విజయాల్లో ఒకటి. అందుకు మనం గర్వపడవచ్చు కూడా. సోషలిస్టు వ్యవసాయ సామర్థ్యానికి, కొత్త భూముల్లోని వ్యవసాయాన్ని మనం ఆదర్శ ప్రాయమైన చిహ్నంగా చేయాలి.

పశుపోషణను పెంచినందువల్ల ఉత్పన్నమైన సమస్యలను, ధాన్యం ఉత్పత్తి పెంచడం ద్వారా పరిష్కరించడానికి వీలౌతుంది. ధాన్యం, మాంసం, పాలు—వీటన్నింటినీ ఉత్పత్తి చేయడం ఒకే సమస్యగా మనం పరిగణిస్తాము. ధాన్యం సమస్యా పరిష్కారాన్ని, పశుపోషణ సమస్యా పరిష్కారాన్నుండి వేరుచేయడం తప్పు. ఈ రెండు సమస్యలను సంయుక్తంగానే యెదుర్కోవాలి, సంయుక్తంగానే పరిష్కరించాలి. ధాన్యం సమస్యా పరిష్కారమంటే నా భావమేమిటి? ఆహారం, మేత అవసరాలకు తగినంతగా ధాన్యం ఉత్పత్తిని సాధించడమే. పశుపోషణ సమస్యా పరిష్కారమంటే నా భావమేమిటి? ప్రధానంగా మాంసం, పాలు, వెన్న ఉత్పత్తిని పెంచడమే. రష్యన్ భాషలో మనం చెప్పినట్టు, పొడి గరిటె నాలుకకు గీసుకుంటుంది. రొట్టె రుచిగా వుండాలంటే దానికి వెన్న, పంది మాంసం, మాంసంగాని, పశు సంబంధమైన పదార్థాలతో కలిపి రుచి పెరిగేట్టు చేసుకోగలగాలి. ఇవన్నీ తగినంత పరిమాణంలో లభ్యం కావాలంటే తగినంత ధాన్యం ఉత్పత్తి తప్పనిసరి. పశుపోషణ సమస్యను పరిష్కరించడమంటే, ఎక్కువ ఎరువు సప్లయి చేయడమన్నమాట. అంటే ఎక్కువ పండాలన్నమాట.

మాంసం, పాలు ప్రజలకు కావలసినంత అందించాలంటే, పశువుల ద్వారా ఉత్పత్తి అయ్యే పదార్థాల తలసరి ఉత్పత్తిలో అమెరికాను మించి పోవాలంటే, ఇంత వరకూ తాము చేసిన అభివృద్ధిని సమష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు వినియోగించుకోవాలి.

అమెరికన్ పాత్రికేయులు ఇక్కడ ఉన్నారు. మన యీ నినాదాన్ని ఎగతాళి చేయడానికి వారు ప్రయత్నిస్తారు. పెద్ద మనుషులారా, మీకో

సంగతి చెపుతున్నాను. ఈ నినాదాన్ని మేము చేసినట్టయితే, దాన్ని తప్ప కుండా మా ప్రజలు సాధించి తీరుతారు. మా పార్టీ ఒక నినాదమిస్తే ప్రజలు దాన్ని బలపరుస్తారు. దాన్ని తప్పకుండా సాధింపుతారు.

సాగుచేసిన నూరు హెక్టార్ల భూమికి సగటున 7.5 టన్నులకు తక్కువ కాకుండా మాంసం, తదితర వ్యవసాయ భూమి నూరు హెక్టార్లకు సగటున 1.8 టన్నుల మాంసం మన దేశంలో ఉత్పత్తి చేయాలనేది మన తక్షణ కర్తవ్యం. ప్రతి సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రం మీద పైస్థాయినిసాధించడానికి మనకు ప్రస్తుత మన్ని అవకాశాలున్నాయి. అయితే ఇవి దేశం మొత్తంమీత సగటు సంఖ్యలు. రష్యన్ సమాఖ్య, ఉక్రేనియన్, బైలో రష్యన్, లిథుయేనియన్, లాత్వియన్, ఇస్తోనియన్, మాల్దేవియన్ రిపబ్లిక్కులలో చాలచోట్ల వంద హెక్టార్ల సాగు క్రింది భూమి, తదితర భూమిలో మాంసాన్ని, పాలనూ చాలా ఎక్కువ ఉత్పత్తి చేయాలి, చేయగలరు.

కామ్రేడ్స్, ధాన్యం ఉత్పత్తి పెంచడంలో కొత్తగా అభివృద్ధి పరచిన భూముల పాత్ర ఏమిటో నేనింతకుముందే చెప్పాను. కాని ఆ విధంగా మనం మొదటి కర్తవ్యాన్ని మాత్రమే నెరవేర్చాము; కొత్త భూముల అభివృద్ధిలో ప్రాథమిక దశను మాత్రమే గడిచాము. మనమింకా ముందుకు పోవాలి. ఏమిటంటే ధాన్యం ఉత్పత్తికి మాత్రమే కొత్త భూములను పరిమితం చేయరాదు. ధాన్యం ఉత్పత్తిని ఆధారంగా చేసుకొని పశుపోషణాభివృద్ధికై పట్టుదలతో కృషి చేయడం, మన ప్రస్తుత కర్తవ్యం. కొత్త భూముల అభివృద్ధిలో ఇది రెండవ దశ అవుతుంది.

మాంసం, పాలు, వెన్న ఉత్పత్తిని పెంచడానికి కొత్తగా అభివృద్ధి పరచిన భూముల్లో భారీ యెత్తున, మంచి నిర్మాణంతో పశుపోషణను పెంపొందించడం ఒక చక్కని మార్గం, తద్వారా ప్రజావసరాల నెక్కువగా తీర్చడానికి వీలుకలుగుతుంది. కొత్త భూములు మన ప్రజలకు లక్షలాది టన్నుల ధాన్యాన్ని సష్లయి చేశాయి. ధాన్యంతోపాటు

లక్షల టన్నుల మాంసం, పాలు, పశువుల ద్వారా తయారు చేసె తదితర వస్తువులు కూడా అవి సప్లయి చెయాలి.

పశుగణాభివృద్ధికి మొక్కజొన్న, లెగూమ్స్‌పప్పు, పంచదార దుంపపై ఆధారపడవచ్చును. ఈ పంటలను ప్రతిచోట ఎక్కువగా పండించడం నేర్చుకొంటే, మాంసం, పాలు, తదితర వస్తువులనెంత ఉత్పత్తి చేయాలని మనం నిర్ణయించుకొంటే అంత మేరకు ఉత్పత్తి చేయగలుగుతాము.

పట్టణ, తదితర పారిశ్రామిక కేంద్రాల్లోని ప్రజల అవసరాలను సంపూర్ణంగా తీర్చడం మన ముఖ్య కర్తవ్యాల్లో ఒకటి. ఆ ప్రజలకు పాలు, వివిధ తరగతులకు చెందిన పాల వస్తువులు, ఉత్తమ తరగతికి చెందిన బంగాళా దుంపలు, తదితర కూరగాయలు అందించాలి. నగరాల పరిసర ప్రదేశాల్లో కూరగాయలు, పాలు ఉత్పత్తి చేసే కేంద్రాలు ఏర్పాటు చేయాలని మన దేశంలో ఇటీవలే పెద్దగా చెప్పుకొనడం జరిగింది. కాని యీ రంగంలో అభివృద్ధి చాల మందకొడిగా జరుగుతున్నది.

ఈ వస్తువుల అవసరాలను త్వరగా తీర్చేందుకై మరికొంత వివేకవంతమైన పరిష్కారాన్ని పార్టీ కేంద్ర కమిటీ, ప్రభుత్వమూ యిప్పుడు ఆలోచించాయి. నగరాల, పారిశ్రామిక కేంద్రాల చుట్టూ ప్రత్యేకత గల ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను స్థాపించే కార్యక్రమాన్ని పార్టీ పెద్ద ఎత్తున నిర్వహిస్తున్నది. నగరాల, పారిశ్రామిక కేంద్రాల చుట్టూ వున్న ప్రత్యేక ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల ద్వారా పాలు, బంగాళా దుంపలు, కూరగాయల ఉత్పత్తివి ప్రజల కవసరమైనంత ఎక్కువ మొత్తంలో సాధించేందుకు మనం మరింత బాగా, ప్రయోజనాత్మకంగా కృషి చేయవలసి వున్నది.

ప్రభుత్వ ప్రయోజనాల దృష్ట్యా పత్తి ఉత్పత్తి త్వరగా, పెంచడం చాల అవసరం. ఇక మిగిలివున్న సప్తవర్ష ప్రణాళికా కాలంలో పత్తి ఉత్పత్తిని మనం దాదాపు 50 శాతం పెంచాలి.

పత్తి పంటకిందికి ఎక్కువ భూమిని తీసుకొనిరావాలి; మధ్య ఆసియా

లోని నీటి పారుదల సౌకర్యాలు గల భూముల్లోకి యీ పంటను సాధ్యమైనంత త్వరలో విస్తరింపజేయాలి. నీటి పారుదల సౌకర్యాలు గల భూములను బాగా సద్వినియోగం చేసుకొనడం ద్వారాను, సాగును యాంత్రికం చేయడంద్వారాను పంటను అభివృద్ధి పరచడం చాలా ముఖ్యమైన పని.

పత్తి పండించే ప్రాంతాలైన ఉజ్బెక్, తజక్, తుర్కమెన్, కిర్గిజ్, కజక్, అజెర్‌బైజాన్, ఆర్మీనియన్ రిపబ్లిక్కులు ఇప్పుడు రెండు కార్యాలను నిర్వహించవలసి వున్నది. వారి ముఖ్యమైన పంట పత్తి గనుక అందులో యెక్కువ ఉత్పత్తిని సాధించడ మొకటి; పశు పోషణను పెంపొందించడం రెండవది. పత్తి పండించే ప్రాంతంలో పరిశ్రమకోసం పత్తిని యెక్కువగా పండించాలి. అదే సమయంలో అది పశువుల మేతను సమృద్ధిగా సప్లయి చేయాలి; మాంసం, పాలు, తదితర పదార్థాల అవసరాలను కూడా తీర్చగలగాలి. తిండి పదార్థాలకు, పత్తికి ఒకేసారి ఉత్పత్తి నభివృద్ధి చేయాలంటే, పంటల మార్పిడిని గురించి లోతుగా అధ్యయనం చేయాలి. నీటి పారుదల సౌకర్యాలు గల ప్రాంతంలో మొక్కజొన్నను పండించడం ద్వారాను, అల్ఫల్ఫా, పంచదార దుంపలు ఉత్పత్తిని పెంచడం ద్వారాను తగినంతగా తిండి పదార్థాలు ఉత్పత్తి చేయవచ్చును.

కొద్ది సంవత్సరాల్లో ప్రతి సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రం కూడా హెక్టారుకు కనీసం 2.5 టన్నుల పత్తికి తగ్గకుండా పండించ గలగాలి, అలా జరిగినప్పుడు ప్రస్తుతం మనం పత్తి పండించే భూములనుండే అదనంగా మరో పది లక్షల టన్నుల పత్తిని ఉత్పత్తి చేయగలుగుతాము. సాధారణ సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు హెక్టారుకు రెండున్నర టన్నుల పత్తిని ఉత్పత్తి చేస్తున్నాయి. ఇంకా బాగా అభివృద్ధి పొందిన వ్యవసాయ క్షేత్రాలు హెక్టారుకు నాలుగు టన్నులు, అంతకు మించి కూడా ఉత్పత్తి చేస్తున్నాయి.

బీటు-దుంపలు, పొద్దు తిరుగుడు పూవు విత్తనాలు, అవిసె

నార, జనప నార, బంగాళాదుంపలు, కూరగాయలు, పండ్లు, ద్రాక్ష, తేయాకు మొదలైన వాటి ఉత్పత్తిని పెంచేందుకు యెక్కువ కృషి చేయాలి: పెద్ద యెత్తున యంత్రాలను ప్రవేశపెట్టాలి. శ్రమశక్తి వ్యయాన్ని తగ్గించడానికి. చౌక ధరలకు వస్తువులను తయారు చేయడానికి యిదే మార్గం.

కామ్రేడ్స్, కమ్యూనిస్టు సమాజ నిర్మాణ మూల ప్రయోజనాలు మన వ్యవసాయ లక్ష్యాలను నిర్ణయించుతున్నవి. ప్రజల జీవన ప్రమాణం నిరంతరం పెరుగుతుండాలంటే, వ్యవసాయాభివృద్ధి సాధించడం అత్యంత ముఖ్యమైన అంశం అని మనమంతా గుర్తిస్తాము.

వచ్చే యిరవై సంవత్సరాల్లో వ్యవసాయాభివృద్ధి ఎలా వుంటుందో పార్టీ అంచనా వేస్తున్నది. ధాన్యం, మాంసం, పాలు, తదితర వ్యవసాయ పదార్థాల ఉత్పత్తిలో గొప్ప పెరుగుదల వస్తుందని పార్టీ భావిస్తున్నది. ఈ లక్ష్యాన్ని సాధించడానికి వ్యవసాయ రంగంలోని అన్ని శాఖల్లోను ఉత్పత్తి శక్తి పెరగాలి: కార్మికులు శ్రమలో వీరత్వం చూపాలి; నిర్మాణంలో ఉన్నత ప్రమాణాల నందుకోవాలి. సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లో ఆధునిక యంత్రాలను ప్రవేశపెట్టాలి; వాటిని సక్రమంగా వినియోగించుకోవాలి. ఈ మహత్తర ప్రణాళికను గట్టిగా అమలు జరిపేందుకు అవసరమైన పునాది సప్తవర్ష ప్రణాళికను అమలు జరపడం ద్వారా వేయబడుతున్నదని కార్మికులు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతులు, కమ్యూనిస్టులు, పార్టీకి చెందనివారు సోవియట్ స్త్రీ పురుషులంతా గ్రహించాలి. వ్యవసాయాభివృద్ధిలో మరిన్ని విజయాలు సాధించేందుకవసరమైన గట్టి పునాదిని, సప్తవర్ష ప్రణాళికను అమలు జరపడంద్వారా వేయగలుగుతాము.

వ్యవసాయోత్పత్తిని ఇంకా పెంపొందించడం పార్టీ మొత్తానికి, సోవియట్ ప్రజలందరికీ సంబంధించిన సమస్య. కమ్యూనిస్టు సమాజ నిర్మాణంలో అదొక ఉన్నతమైన మెట్టు. సోవియట్ వ్యవస్థకున్న శక్తినంతా ఉపయోగించి, ఆ మెట్టును మనం చేరుకోగలగాలి.

## 5. ప్రజల జీవన ప్రమాణాల అభివృద్ధి. శాస్త్ర విజ్ఞానం, విద్య, సాహిత్యం, కళల వికాసం.

కామ్రేడ్స్, సోవియట్ ప్రజల జీవన ప్రమాణాలను పెంచడం, వారి భౌతిక, ఆత్మికావసరాలను పెంపొందించడం, వాటినన్నింటినీ పూర్వం కంటె బాగా తీర్చడం పార్టీ కార్యకలాపాల లక్ష్యం. మన దేశంలోని సోషలిస్టు వ్యవస్థ పరిపక్వ దశకు చేరుకొన్నది. గతంలో యెన్నడూ లేనంత శక్తిని తనంతట తానే ఆ వ్యవస్థ ప్రదర్శిస్తున్నది. ఆర్థికాభివృద్ధి రేటు పెరుగుదలలో సోషలిజానిది పైచేయి అయింది. దీనివల్ల ఉత్పత్తే గాక వస్తు వినియోగం కూడా రానురాను యెక్కువవుతున్నది.

సోషలిస్టు వ్యవస్థలో జాతీయాదాయం పెరిగేకొలదీ ప్రజల జీవన స్థాయి పెరుగుతుంటుంది. సోవియట్ యూనియన్ జాతీయాదాయంలో నాలుగింట మూడు వంతులు ప్రజల వ్యక్తిగత అవసరాలను తీర్చడానికే వినియోగించబడుతున్నది. సోవియట్ యూనియన్ జాతీయాదాయం 1955తో పోల్చితే 1960లో 50 శాతం పైగా పెరిగింది. గత పది సంవత్సరాల్లో జనాభా తలసరి ఆదాయం 120 శాతం పెరిగింది. బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల్లోకంటె తలసరి ఆదాయం మరింత త్వరితగతిని అభివృద్ధి చెందుతున్నది.

జాతీయాదాయం పెరిగినందువల్ల, పరిశ్రమల్లోను, కార్యాలయాల్లోను, తదితర వృత్తులు చేసుకొనే కార్మికుల ఒక్కొక్కరి నిజ ఆదాయం గత ఐదు సంవత్సరాల్లో 27 శాతం పెరిగింది; సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లోని రైతుల నిజ ఆదాయం 33 శాతం పెరిగింది. సప్తవర్ష ప్రణాళికలో పరిశ్రమల్లోను, కార్యాలయాల్లోను, తదితర వృత్తులు చేసుకొనే కార్మికుల, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతుల నిజ ఆదాయం 40 శాతం పెరుగుతుంది.

జీవన ప్రమాణాల్లో, బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలను

మించి పోవాలనే లక్ష్యం పెట్టుకొన్నాము. ఏ యే రంగాల్లో పెట్టుబడిదారీ దేశాలను అందుకొని, అధిగమించి పోవాలో అవి మనస్సుల్లో ఉన్నాయి. అత్యధికంగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలకంటె అనేక విష యాల్లో సోవియట్ యూనియన్ ముందున్న దనేది నిర్వివాదాంశం. సోష లిస్టు వ్యవస్థలోని ప్రత్యేక సదుపాయాలను సోవియట్ ప్రజలు అనుభవిస్తు న్నారు. అందుకు తోడు ప్రత్యేకించి సోవియట్ ప్రజలకు విద్య ఉచితం; వైద్య సౌకర్యాలు ఉచితం నిరుద్యోగమనేది కూడా లేదు. ఇవన్నీ సోవియట్ ప్రజలకు పరిపాటి అయిపోయింది. కామ్రేడ్స్, యివి అత్యు త్తమమైన సదుపాయాలు; అందుకు మన ప్రజలు గర్వించడం న్యాయమే. ఈ రంగంలో పెట్టుబడిదారీ దేశాలను మనం ఏనాడో వెనుకవేశాం. ఇలాంటి సౌకర్యాలు తెచ్చుకోవాలంటే పెట్టుబడిదారీ దేశాల్లోని కార్మికులు యెక్కువ శ్రమపడవలసి వస్తున్నది. కార్మికులు తీవ్ర పోరాటాలు సాగించవలసి వున్నది.

సోవియట్ యూనియన్‌లో ప్రజల వినిమయం స్థిరంగా పెరుగు తున్నది. ప్రభుత్వ, సహకార విక్రయశాలల ద్వారా చిల్లర వ్యాపారం 1955తో పోల్చుకొంటే 1960లో, 50 శాతానికి పైగా పెరిగింది. సప్తవర్ష ప్రణాలిక మొదటి మూడు సంవత్సరాల్లో అనుకొన్నదానికంటే వ్యాపారం పెరిగింది. మాంసం, పాలు, పాల వస్తువులు, పంచదారను సోవియట్ ప్రజలు రాను రాను యెక్కువగా వాడుతున్నారు. వస్త్రాల, పాదరక్షల, ఫర్నిచర్, యింటి సామాన్ల తదితర వస్తువుల అమ్మకాలు పెరిగాయి. అయినప్పటికీ ప్రజలకు కావలసినంత మోతాదులో యీ వస్తువులను సప్లయి చేయలేకపోతున్నాము. విక్రయశాలల్లో కొన్ని వస్తువులు లేక పోవడంపై చాలా తీవ్రమైన విమర్శలు మన పనిపై వస్తున్నాయి. పెరు గుతున్న ప్రజావసరాలను తీర్చడానికై, వినిమయ వస్తువుల ఉత్పత్తిని పెంచాలని పార్టీ, ప్రభుత్వం నిర్ణయించుకొన్నాయి.

అన్ని వస్తువుల్లో గుణాత్మకమైన అభివృద్ధిని తీసుకొనిరావాలన్న

లక్ష్యాన్ని మనం చేపట్టవలసిన అవసరం నేడు ఆసన్నమైంది. మన విక్రయశాలల్లో తగిన రకాల వస్తువులు లేవు. కాని గోదాముల్లో మాత్రం "అమ్మకానికి పనికిరాని" వస్తువులు నిండి వుంటాయి. ఇవి ఎలాంటి వస్తువులు? తక్కువ రకపు సరుకులు; కొనుగోలుదారుడు వీటిని కొనడానికి యిష్టపడడు. గోదాముల్లో 150 కోట్ల రూబుళ్ళకు పైగా విలువచేసే పాదరక్షలు పడివున్నాయి. అయినప్పటికీ ప్రజలకు పాదరక్షల అవసరాన్ని పూర్తిగా తీర్చలేకపోతున్నాము. అలాగే వస్త్రాలను తీసుకుందాం. సోవియట్ దుస్తులు బాగానే వుంటాయని అందరూ అంగీకరిస్తారు. కాని కోట్లు, సూట్లు, వాటి అందచందాలు బాగాలేవనే విమర్శ వుంది. సరుకేమో మంచిదే, కాని వాటిని తయారు చేసిన వస్తువులు తరచు నాణ్యంగా వుండడంలేదు. లోపాలు సరిదిద్దుకొనడానికి పెద్ద మొత్తాలు ఖర్చుపెట్టడం జరుగుతున్నది. ఈ సందర్భంలో నేనొక పాత సామెతను చెబుతాను. "అకుల్యా, ఎందుకలా గందరగోళంగా కుడుతున్నావ్?" "పరవాలేదు లే, అమ్మా: ఎలాగైనా మళ్ళీ పూడవయ్యవలసిందేగా."

అకుల్యా లాగా కొంతమంది మన కార్యకర్తలు పనిచేయడమింకా యెంతకాలం?

చిన్న పరిశ్రమల పని మెరుగు కావాలి. వినిమయ వస్తువులన్నీ మేలి రకానికి చెందివుండడమేగాక, ఆకర్షవంతంగా కూడా వుండేలాగు చూడాలి.

ప్రజల జీవన పరిస్థితులను మెరుగు పరచడమే పార్టీ లక్ష్యం. అందుకు జీవన ప్రమాణాలను పెంచడంలో వచ్చే మూల సమస్యల పైన పార్టీ ఎక్కువ శ్రద్ధ వహించుతుంది. పరిశ్రమల్లో, కార్యాలయాల్లో, తదితర వృత్తుల్లో పనిచేసే కార్మికుల వేతనాలను, జీతాలను సర్వత్రా సాధారణీకరించేందుకు చర్యలు పూర్తి అయినాయి; వారి కనీస వేతనాలు పెంచబడ్డాయి. వేతనాలు, జీతాలు పెంచేందుకు గత ఐదు సంవత్సరాల్లో 400 కోట్ల రూబుళ్ళు వెచ్చించడమైంది. కొన్ని తరహాల పనికి యిస్తున్న

అదనపు వేతనాలను రద్దు చేయడమైంది కూడా.

పరిశ్రమల్లోను, కార్యాలయాల్లోను పనిచేసే కార్మికులు సుమారు 4 కోట్ల మంది కొత్త రేట్ల ప్రకారం వేతనాలు ప్రస్తుతం పుచ్చుకొంటున్నారు. కొద్ది సంవత్సరాల్లో కొత్త రేట్లు జాతీయ ఆర్థిక వ్యవస్థ అంతటా ప్రవేశపెట్టబడతాయి. ఉపాధ్యాయులు, డాక్టర్లు లాంటి పెద్ద మేధావుల బృందం వేతనాలుకూడ పెంచాలని నిర్ణయించడమైంది. ఇక మిగిలివున్న సప్తవర్ష ప్రణాళికా కాలంలో కనీస వేతనాలు 50–60 రూబుళ్ళకు పెంచబడతాయి. పరిశ్రమల్లోను, కార్యాలయాల్లోను, యితర వృత్తుల్లో పనిచేసే సగటు వేతనాల కార్మికుల వేతనాలు, జీతాలు కూడా పెంచబడతాయి.

పన్నులు రద్దు చేసినందువల్ల, తమ వేతనాలకు అదనంగా కొంత బాగా కలిసివచ్చింది. పన్నులు రద్దు మొదటి దశ ప్రారంభమైనప్పుడు, 1960 అక్టోబరు ఒకటో తేదీనుండి సాలుకు వచ్చిన యీ ఆదనం, మొత్తం 36 కోట్ల రూబుళ్ళయింది. పన్నుల రద్దు రెండవ దశ యీ ఏడు అక్టోబరు ఒకటో తేదీతో ప్రారంభమైంది. దానివల్ల కార్మికులకు ఏడాదికి మరో 40 కోట్ల రూబుళ్ళు లాభిస్తుంది. 1965 సంవత్సరానికల్లా జనాభాకు పన్నులు వుండకుండా పోతాయి. పన్నుల రద్దు సోవియట్ ప్రజలకు మహత్తరమైన సాంఘిక లాభంగా వుంటుంది.

కార్యాలయాల్లోను, పరిశ్రమల్లోను, వృత్తుల్లోనూ పనిచేసే వారు 1960లో ఏడు గంటలు గాని, ఆరు గంటలు గాని మాత్రమే రోజుకు పని చేస్తున్నారు. ఈ విధంగా పనివారం ఆరున్నర గంటలు తగ్గించబడింది. వేతనాలు తగ్గక పోవడమే కాకుండా, అవి పెరిగాయి కూడా. ఇప్పుడు రోజుకు ఏడు గంటలు పని చేసే పరిశ్రమల, కార్యాలయాల, వృత్తుల లోని పనివారికి, వారానికి 40 పని గంటలు కొద్ది సంవత్సరాలలోగా నిర్ణయించడానికి ఉద్దేశించబడింది.

శ్రామికోత్పాదన శక్తి పెరుగుదలతో వేతనాలు పెరుగుతుండాలి,

పని రోజు, పని వారం తరుగుతుండాలి. శ్రామికోత్పాదన శక్తి యెంత యెక్కువగా వుంటే, ప్రజల జీవన ప్రమాణాలను అంత యెక్కువగా మెరుగు పరచడానికి సమాజానికి అవకాశాలుంటాయి. అందరూ సమాజం కొరకు, సమాజం అందరికొరకూ అనేది మన ఇచ్ఛితమైన సూత్రం.

పించను పద్ధతిని మెరుగు పరచబడడానికి, ముఖ్యమైన చర్యలు ఇటీవల గైకొనబడ్డాయి. ముసలితనంలో ఇచ్చే పించను సగటు మొత్తం రెట్టింపుకంటె ఎక్కువగా పెంచడమైంది. అసమర్థత ప్రాప్తించినప్పుడు యిచ్చే పింఛనులు, పోషకుడు మరణించినప్పుడు యిచ్చే పింఛను కూడ పెంచబడింది. 1955లో పింఛను క్రింద ప్రభుత్వం ఖర్చు పెట్టిన ధనం 300 కోట్ల రూబుళ్ళు కాగా, 1961లో అది 760 కోట్ల రూబుళ్లకు పెంచబడింది. 1963లో కనీస పింఛను మొత్తం మళ్ళీ పెంచడం జరుగుతుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్ర ఆర్థిక వ్యవస్థ పెంపొందే కొలదీ సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతులకు యింకా పెద్ద స్థాయిలో పింఛన్లు ప్రవేశపెట్టబడతాయి.

గృహ నిర్మాణం సోవియట్ దేశంలో గతంలో ఎన్నడూ లేనంత ముమ్మరంగా కొనసాగుతున్నది. గృహనిర్మాణంలో వస్తువులను కిందికి, పైకి దింపే యంత్రం నేడు మన కాలానికొక చిహ్నంగా రూపొందింది. 1956-60 ప్రభుత్వ గృహ నిర్మాణ కార్యక్రమం పూర్తయింది. గత ఐదు సంవత్సరాల్లో, అంతకు ముందరి 15 సంవత్సరాల్లో కంటె యెక్కువ గృహాలు నిర్మించడమైంది. కాబట్టి, మరో మాటల్లో చెప్పాలంటే, దాదాపు ఐదుకోట్ల మంది ప్రజలు, అంటే మొత్తం జనాభాలో యించుమించు నాలుగో వంతు మంది నూతన గృహాల్లో ప్రవేశించారు. నిర్మించుతున్న గృహాల మొత్తం సంఖ్యలోను, నిర్మాణగతిలోను ప్రపంచంలో సోవియట్ యూనియన్ ప్రథమ స్థానాన్ని ఆక్రమించుకొంటున్నది. వెయ్యి మందికి అమెరికా, ఫ్రాన్సులో ఎన్ని ఇళ్లు నిర్మిస్తున్నారో

అంతకు రెండు రెట్లు గృహాలను ఇటీవల సంవత్సరాల్లో మన దేశం నిర్మిస్తున్నది. బ్రిటన్, ఇటలీ దేశాల్లో నిర్మిస్తున్న ఇళ్ళకు రెట్టింపుకు పైగా నిర్మిస్తున్నది.

ఇంత జరుగుతున్నప్పటికీ మనకు యిళ్ళ కొరత యింకా వున్నది. ఇళ్ళ సమస్య చాలా తీవ్రంగా వున్నది. సోవియట్ యూనియన్‌లో పట్టణ జనసంఖ్య పెరుగుదల అంచనాలను బాగా మించింది. సప్తవర్ష ప్రణాలికాంతానికల్లా అనుకున్నదానికంటె పట్టణ జనాభా ఒక కోటి 50 లక్షలు పెరుగుతుంది. అంటే యెక్కువ గృహాలు అవసర మౌతాయన్న మాట. గృహ నిర్మాణాన్ని త్వరితం చేయడానికై పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వం చర్యలు తీసుకొంటున్నాయి. సప్తవర్ష ప్రణాలికలోని మిగిలిన నాలుగు సంవత్సరాల్లో సుమారు 40 కోట్ల చదరపు మీటర్ల ప్రాంతంలో గృహ నిర్మాణం జరుగుతుంది. అది నాల్గవ, ఐదవ పంచ వర్ష ప్రణాలికలు మొత్తం కాలంలోకంటె 60 శాతం అధికం. గ్రామీణ ప్రాంతాల్లో 40 లక్షల గృహాలకు పైగా నిర్మించబడతాయి.

గ్రామీణ ప్రాంతాల్లో గృహ నిర్మాణానికి ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ఇటీవలి కొద్ది సంవత్సరాల్లో ఎక్కువ సౌకర్యాలతో కూడిన ఇళ్ళు, మంచిచోట్ల పాఠశాలలు, క్లబ్బులు, ఆసుపత్రులు, విక్రయశాలలు గ్రామాల్లో నిర్మించబడుతున్నాయి. ఆర్థికాభివృద్ధి అవకాశాల పట్ల సరైన దృష్టి లేకుండా గ్రామీణ గృహ నిర్మాణం తరచు కొనసాగించ బడుతున్నది అలాగే జీవన ప్రమాణాల అభివృద్ధి పట్ల కూడా దృష్టి లేదు. గృహ నిర్మాణానికి నిధులెక్కువగా కేటాయించబడుతున్నప్పటికి, గ్రామీణ ప్రాంతాల్లో గృహాలు తరుచు అక్కడక్కడ ఏరివేసినట్లు నిర్మించడం జరుగుతున్నది. నవీన సౌకర్యాలు వాటిలో అమర్చడం లేదు. గ్రామసీమల్లో కొత్తగా ఏర్పరిచిన జనవాసాలు, ముఖ్యంగా కొత్తగా సాగులోకి తెచ్చిన భూముల్లోని ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోని వాటిని పట్టణాల నమూనాలో నిర్మించాలి.

మనం పెద్ద యెత్తున గృహ నిర్మాణం చేస్తున్నాము. ఈ సందర్భంలో మనం మరో అంశాన్ని గురించి ఆలోచించాలి తొందరవల్ల కొన్ని సమయాల్లో గృహాల్లో అనేక లోపాలున్నప్పటికి, వాటిలో నివసించవలసివస్తున్నది. దీనివల్ల కార్మికులు చాలా చికాకుపడడం సహజమే. ఈ లోపాలకు బాధ్యులైనవారి వేళ్ళు విరగ్గొట్టాలి. ఇళ్ళను కేటాయించడంలో ఒక పద్ధతికి కట్టుబడి వ్యవహరించాలి; దీనిలో ప్రజలు పాల్గొనాలి. అత్యవసరమైనవారికి ముందుగా యివ్వాలి.

ప్రజారోగ్య రక్షణ బాధ్యతను సోవియట్ యూనియన్‌లో ప్రభుత్వమే స్వీకరించింది. సోవియట్ యూనియన్‌లో ప్రపంచంలోని అన్ని దేశాలకంటే మరణాల సంఖ్య తక్కువ. ప్రజల వయఃప్రమాణం పెరుగుతున్నది. దీన్నిబట్టి ప్రజారోగ్యాన్ని ప్రభుత్వం ఎంత అద్భుతంగా రక్షించుతున్నదో స్పష్టంగా తెలుస్తుంది. మనం వైద్య శాఖలను నిరంతరం పెంచుకోవాలి. శారీరక వ్యాయామాన్ని, క్రీడలను పెంపొందించాలి. ఆసుపత్రులను, ఆరోగ్య మందిరాలను, పాలీక్లినిక్‌లను తదితర వైద్య సంస్థలను, ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లోను, దేశపు తూర్పు ప్రాంతాల్లోను యెక్కువగా నిర్మించాలి.

సామాజిక సంక్షేమ కార్యాలు అప్రధానమైనవి, అల్పమైనవేమీ కాదు. ప్రజల మనస్తత్వం, వారి శ్రమ ఉత్పాదన శక్తి చాలవరకు వారి జీవన పరిస్థితులపైన, వారికందించే మంచి సదుపాయాలపైన యెక్కువగా ఆధారపడి వుంటుంది. ఈ సమస్యను పరిష్కరించడానికి, నవీన పద్ధతుల్లో అన్ని రకాల వస్తువులు దొరికే విక్రయశాలలు, క్యాంటీన్లు, భోజన శాలలు, సంక్షేమ కేంద్రాలు, పెద్ద పెద్ద ఆహార సంబంధమైన పరిశ్రమలు స్థాపించాలి.

కమ్యూనిజం స్థాపన అనే ఉన్నతాశయంతో మన పార్టీ విధానం కూడుకొని వున్నది: ప్రతిదీ మనిషి కొరకే, మనిషి లాభం కొరకే.

ప్రజల జీవన పరిస్థితులను పెంచాలనే సమస్యను నేరుగా వేతనాల

పెంపుదల ద్వారాను, ధరలు తగ్గించడం ద్వారానూ పరిష్కరించుకొంటూ పోతూ వుండాలా? అయితే వేతనాలు, జీతాలు కార్మికుడికి భౌతిక ప్రోద్బలం కలిగించే ప్రాథమికాంశంగా చాలాకాలం వరకూ పనిచేస్తాయి. సాంఘిక ఉత్పత్తికి కార్మికుడు యెంతగా తన శ్రమద్వారా తోడుపడతాడో—దానిపైనే అవి చాలాకాలం వరకూ ఆధారపడి వుంటాయి. కాని అదే సమయంలో ప్రభుత్వ ప్రతినిధుల ద్వారా భౌతిక, సాంస్కృతిక, ప్రయోజనాల్లో రానురాను ఎక్కువ వాటాను సోవియట్ పౌరుడు పొందుతున్నాడు.

ఈనాడు ప్రజావసరాల్లో ఎక్కువ భాగం, ప్రజానిధుల ద్వారా తీర్చబడ మవుతున్నది. 1940 లో ప్రజలకు సహాయంగా యివ్వబడిన ప్రభుత్వ నిధులు 420 కోట్ల రూబుళ్ళు కాగా, 1960 లో 2450 కోట్ల రూబుళ్లు. సప్తవర్ష ప్రణాలికి కాలంలో, ప్రవేశపెట్టబడబోయే మార్పులను అనుమతించినా, ప్రజావసరాలకై ఖర్చు పెట్టే నిధులు పెరుగుతాయి. 1965 కల్లా అది 4000 కోట్ల రూబుళ్ళు అవుతుంది. ఈ నిధుల్లోనుండి ప్రస్తుతం రెండు కోట్ల మందికి పైగా పింఛనులు చెల్లించబడుతున్నాయి. ఉన్నత సెకండరీ, వృత్తి, సాంకేతిక విద్యా సంస్థల్లోని విద్యార్థులు దాదాపు 40 లక్షల మంది ప్రభుత్వ స్కాలర్ షిప్పులు, హాస్టల్ వసతులు పొందుతున్నారు. బోర్డింగు పాఠశాలల్లో ఆరు లక్షల మంది పిల్లలకు పైగా, దాదాపు పూర్తిగా ప్రభుత్వం పోషిస్తున్నది. పరిశ్రమల్లో పని చేసే కార్మికులు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతులు, ఉద్యోగులు, వారి పిల్లలు 70 లక్షలకు పైగా తమ, తమ సాంవత్సరిక సెలవులను ఆరోగ్య మందిరాలలోను, విశ్రాంతి గృహాలలోను, బాల సంఘ శిబిరాలలోను గడుపుతారు. ఇందుకు సాంఘిక భీమా, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల నిధుల నుండి ఖర్చు జరుగుతున్నది. దాదాపు 70 లక్షల మంది తల్లులకు ప్రభుత్వం సహాయం చేస్తున్నది. ప్రజా నిధులను ఆ విధంగా మనం వినియోగిస్తున్నాం।

కామ్రేడ్స్, ప్రపంచంలో కల్లా ఉన్నతమైన విద్యను పొందిన సమా

జంగా సోవియట్ సమాజం రూపొందించ నందుకు, ముఖ్యమైన విజ్ఞాన రంగాల్లో సోవియట్ శాస్త్ర విజ్ఞానం అగ్రస్థానాల్లో వున్నందుకూ గర్వించ డానికి మనకన్నివిధాలా హక్కున్నది.

ప్రథమ సోవియట్ కృత్రిమ భూ ఉపగ్రహం భూమి చుట్టూ ప్రదక్షిణ చేసినప్పుడు, తమ దేశ విద్యా విధానాన్ని గురించి పరిశీలించేందుకై అమెరికా ఒక ప్రత్యేక సంఘాన్ని నియమించుకొన్నది. రెండు విద్యా విధానాలను సరిపోల్చి చూసి, సోవియట్ విద్యావిధానం ఉన్నతమైనదని ఆ సంఘం నిర్ణయానికొచ్చింది. అదే సమయంలో, మన విద్యార్థులకు శాస్త్రీయ విజ్ఞానంలోని మూల విషయాల్లో యింకా సమగ్రమైన జ్ఞానం వుండేలాగు, పాఠశాలలను వాస్తవ జీవితంతో సన్నిహితం చేసేందుకు, పాఠశాల విద్యా విధానాన్ని పునర్నిర్మించాలని మన పార్టీ నిర్ణయించింది.

పార్టీ తీసుకొన్న చర్యలు అవసరమైనవేనని, సకాలంలో తీసుకోబడ్డాయని పునర్నిర్మాణంద్వారా వచ్చిన అనుభవం ధృవపరిచింది. మొత్తం మీద, వాస్తవ జీవితంతోను, ఉత్పత్తిలోను పాఠశాల సంబంధాలు మరింత సన్నిహితమైనాయి; విద్యార్థుల కిచ్చే పని శిక్షణ బాగా అభివృద్ధి చేయబడింది. ఆర్థిక వ్యవస్థలో సెకండరీ పాఠశాలల పట్టభద్రులు విజయవంతంగా పని చేస్తున్నారు. యువ కార్మికుల కొరకు, గ్రామీణ యువజనుల కొరకు నెలకొల్పబడే పాఠశాలల సంఖ్య ప్రతి యేటా పెరుగుతున్నది. తమ విరామ కాలంలో లక్షలాది యువజనులు చదువు కొంటున్నారు.

ఈ రంగంలో చాలా సాధింపబడింది. కాని పాఠశాల పునర్వ్యవస్థీకరించడం పట్ల కొందరు దురధికార దృక్పథంతో ప్రవర్తిస్తున్న ఘటనలున్నాయి. పోలిటెక్నికల్ విద్యా విషయంలో తమ కర్తవ్యాలేమిటో విద్యా రంగంలో పని చేసే కార్యకర్తలందరూ అర్థం చేసుకోలేదు.

కొత్త రకమైన విద్యాసంస్థలు, బోర్డింగు స్కూళ్ళు, పాఠశాలా కాలం ముగిసేకకూడా జాగ్రత్త వహించే పాఠశాలలు దేశంలో స్థాపించడ

మైంది. అవి ప్రజామోదాన్ని పొందాయి. ఇలాంటి విద్యాశాలల్లో దాదాపు 15 లక్షల మంది విద్యార్థులు చదువుకొంటున్నారు. 1965 లో ఒక్క బోర్డింగు స్కూళ్ళలోనే 25 లక్షల మంది పిల్లలు చదువుతుంటారు.

ఎనిమిదేండ్ల సార్వజనీన నిర్బంధ పాఠశాల విద్య సోవియట్ యూనియన్‌లో ప్రవేశపెట్టబడమైంది. పూర్తి సెకండరీ విద్య నభ్యసించ గోరు వారందరికీ, అందుకు తగిన పరిస్థితులన్నీ నేడున్నాయి. నిర్బంధ. సార్వజనీన సెకండరీ విద్యను ప్రవేశపెట్టడం, విద్యారంగంలో తరువాత కార్యక్రమం.

కమ్యూనిస్టు భావనలో వ్యక్తికి శిక్షణ యివ్వడం అంటే పాఠశాలల బాధ్యతలు పెరుగుతాయి. నవీన శాస్త్ర విజ్ఞానం, ఉత్పత్తిలో వస్తున్న సత్వర పురోగమనంతో పాఠశాలలు అడుగు కలపాలి. అన్ని పాఠశా లల్లోను తగినంతమంది ఉపాధ్యాయులు వుండే విధంగా ఎక్కువ మందికి ఉపాధ్యాయులుగా శిక్షణ యివ్వాలి: ఉపాధ్యాయుల నన్ని విధాల సానుభూ తితో, గౌరవంతో చూడాలి; పాఠశాలల పునర్వ్యవస్థీకరణలో పరిశ్రమలు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు సహాయపడాలి: అవసరమైన విజ్ఞానం, నైపు ణ్యాలు నేర్చుకొనడంలో విద్యార్థులకు తోడ్పడాలి. పాఠశాలల నెక్కువగా నిర్మించాలి; పాఠశాలల్లో షిఫ్ట్ పద్ధతికి స్వస్తిచెప్పాలి. 1965లో దాదాపు 4 కోట్ల 30 లక్షల మంది పిల్లలు పాఠశాలల కెళ్ళనున్నారన్న సంగతిని గుర్తుంచుకొంటే, యిది చాలా పెద్ద కర్తవ్యం.

పాఠశాలల పునర్వ్యవస్థీకరణతోబాటు, ఉన్నత, ప్రత్యేక సెకండరీ విద్య, వృత్తి విద్యా శిక్షణ అభివృద్ధి చెందుతున్నాయి. ఇక్కడ కూడా విద్యను వాస్తవ జీవితంతోను, ఉత్పత్తితోను సన్నిహితం చేయాలనేదే లక్ష్యం. ఈ సంవత్సరం దేశపు ఉన్నత విద్యా సంస్థల్లో చేరిన పగటిపూట విద్యార్థుల్లో సగం మందికి పైగా ఉత్పత్తిలో ప్రత్యక్షానుభవం పొందిన వారు. సాయంకాల విద్యాశాలల ద్వారాను, తపాలా విద్యా సంస్థల ద్వారాను గత ఐదేండ్లలో సుమారు 5 లక్షల మంది ఉన్నత విద్యావంతులు పట్టభద్రులయ్యారు.

అమెరికా తయారు చేస్తున్న ఇంజనీర్ల సంఖ్యకు మూడు రెట్ల మందికి అధికంగా సోవియట్ యూనియన్ శిక్షణ ఇస్తున్నది. మానసిక శ్రమ చేసే వారు సోవియట్ యూనియన్ మొత్తంమీద రెండు కోట్ల మందికి పైగా వున్నారు. ఈ సంఖ్యను మనం ప్రకటించినప్పుడు, మన సమాజం వెనుకబడి వున్నదనీ, సాంస్కృతిక స్థాయి దానికి చాల తక్కువ అనీ తరచు చెప్పే సోషలిజం వ్యతిరేకులు గందరగోళంలో పడ్డారు. విలువలను బాధతో పునఃపరిశీలించవలసిన పరిస్థితి వారికీనాడు ఏర్పడింది. కొన్ని సమయాల్లో అతి తెలివి తక్కువ కల్పనల మీద వారు ఆధారపడ వలసి వస్తోంది. సోవియట్ యూనియన్‌లో విద్యావంతులెంత ఎక్కువగా తయారైతే, కమ్యూనిజం నుండి వారంత ఎక్కువగా దూరమైపోవడానికి అవకాశాలు కలుగుతాయనే కథను వారు అల్లి, ప్రజలను మోసం చేయ డానికై ప్రచారం చేశారు.

ఈ పెట్టుబడిదారీ సిద్ధాంతవేత్తలకేమని మనం చెప్పగలం? ప్రజల విద్యాభివృద్ధికై తమ ప్రభుత్వాలను ఎక్కువ ధనం కేటాయించమని, వారిని చెప్పమనండి. వాళ్ళ వాదనా పద్ధతి ప్రకారం, సమాజం ఎంత ఎక్కువగా విద్యావంతమైతే, అది అంత గట్టిగా పెట్టుబడిదారీ విధానాన్ని అంటి పెట్టు కొంటుందని. అయితే ఇలాంటి కాకమ్మ కబుర్లను నమ్మే కాలం గడిచి పోయింది. వీటిని కల్పించిన వారే అసలు నమ్మరు వీటిని. కమ్యూనిజం అందరికీ జ్ఞానమిస్తుంది; ప్రజల యీ జ్ఞాన సంపత్తినుండి, ఉన్నత మైన వారి సాంస్కృతిక స్థాయినుండి తన బలాన్ని విశ్వాసాన్నీ తన అభ్యుదయ ఉద్యమంకోసం కమ్యూనిజం పొందుతుంది.

ఇందుకు సోవియట్ శాస్త్రీయ విజ్ఞాన వికాసం ప్రబల తార్కాణం. మనకు 3 లక్షల 50 వేల మందికి పైగా శాస్త్రీయ విజ్ఞానులైన కార్యకర్త లున్నారు. సుమారు నాలుగు వేల పరిశోధన సంస్థలున్నాయి దేశంలో. యూనియన్ రిపబ్లిక్కుల్లోని పరిశోధనా సంస్థల సంఖ్య గత ఐదారు సంవత్సరాల్లో పెద్దగా పెరుగుతూండడం ప్రత్యేకంగా గమనించ దగింది.

దేశంలోని తూర్పు ప్రాంతంలో పరిశోధనాభివృద్ధికి విజ్ఞానశాస్త్ర పరిషత్తు సైబీరియన్ శాఖ ప్రముఖ పాత్రను నిర్వహిస్తోంది.

తమ దేశానికి సోవియట్ శాస్త్రజ్ఞులు ప్రశంసార్హమైన సేవ చేస్తున్నారు. భౌతిక శాస్త్రం, గణిత శాస్త్రం, సైబెర్నెటిక్స్‌లను అభివృద్ధి చేయడంలోను, ఎక్కువ వేగంతో కూడిక, తీసివేతల్లాంటివి చేసే యంత్రాలు (కంప్యూటింగ్ మెషీన్స్) తయారు చేయడంలోను, వరుసగా ప్రభావాలకు సంబంధించిన రసాయన శాస్త్రాన్ని, పోలీమెర్స్‌కు సంబంధించిన రసాయినిక శాస్త్రాన్నీ అభివృద్ధి చేయడంలోను, జీవశాస్త్రంలోను, ఖనిజాలు లభ్యమయ్యే పెద్ద గనులను కనుగొనడంలోను, స్వయంచోదిత యంత్రాల తయారీలోను, ఎక్కడో దూరాన వుండి యంత్రాలను నడిపే పద్ధతిలోనూ, రేడియో ఇంజనీరింగ్, ఎలెక్ట్రానిక్స్, లోహ విజ్ఞానంలోనూ, మెకానికల్ ఇంజనీరింగ్ మొదలైన పలు శాస్త్రాలలోను, సోవియట్ శాస్త్రజ్ఞులు సాధించిన విజయాలు జగమెరిగినవే. సాంఘిక శాస్త్రాలలో కూడా సోవియట్ శాస్త్ర వేత్తలు పలు విజయాలు పొందారు.

థర్మో న్యూక్లియర్ శక్తిని అదుపులో పెట్టడమనే నేటి చాలా ముఖ్యమైన ఒక సమస్య విస్తృత పరిశోధనలో, సోవియట్ శాస్త్రజ్ఞులు పెద్ద ఎత్తున పరిశోధనలు చేస్తున్నారు. వారి పరిశోధనలు, ఇతర దేశాల శాస్త్రజ్ఞులతో వారి సహకారం విస్తృతంగా గుర్తించబడ్డాయి. మన దేశంలో థర్మో న్యూక్లియర్ పరిశోధనను నిరంతరంగా పెంపొందించడం, అణుశక్తిని మానవ శ్రేయస్సుకొరకు, శాంతియుతంగా వినియోగించాలనే సమస్య త్వరిత పరిష్కారానికి తోడ్పడుతుంది. అంతరిక్షాన్ని జయించడంలో సోవియట్ శాస్త్ర విజ్ఞానం సాధించిన విజయాలవల్ల, మానవుని శాస్త్ర పరిజ్ఞాన పురోగతిలో అద్భుతమైన నూతన శకం ప్రారంభమైంది. కృత్రిమ ఉపగ్రహాన్ని ప్రపంచంలోకెల్ల ప్రప్రథమంగా అంతరిక్షంలోకి సోవియట్ యూనియన్ పంపింది. భూమ్యాకర్షణ శక్తిని దాటి, అంతర్గ్రహ రోదసి కక్ష్యలో మొట్టమొదటగా ప్రదక్షిణ చేసింది సోవియట్

రాకెట్లే. చంద్రుని పైన ప్రప్రథమంగా మనమే మన ప్రభుత్వ చిహ్నాన్ని నాటేము, అగుపించని చంద్రుని ఆవలి భాగాన్ని ఫోటో తీశాము. తమ నివాస స్థలమైన భూమినుండి బయలుదేరి అంతరిక్షంలో జయప్రదంగా యాత్రలు మొట్టమొదట చేసిన వారు సోవియట్ పౌరులు. గగారిన్ గెర్మన్ తితోవ్, 22వ పార్టీ మహాసభకు ప్రతినిధులు.

సోవియట్ విజ్ఞాన శాస్త్రం సాధించిన ఘన విజయాలకు మనం గర్వించ వచ్చును. కామ్రేడ్స్, ఈ ఉన్నత వేదికనుండి సకల సోవియట్ శాస్త్రజ్ఞులకు మన హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియజేసి, సోవియట్ దేశపు ఖ్యాతికోసం కమ్యూనిజం స్థాపన కోసం, నూతనమైన ఘన విజయాలను వారు సాధించాలని ఆకాంక్షించడానికి నాకు అనుమతించండి!

అంతరిక్షాన్ని జయించడంలో సోవియట్ యూనియన్ సాధించిన విజయాలవల్ల సోషలిస్టు సమాజ విజయాలను, శాస్త్రీయ పారిశ్రామిక రంగాల్లో సోవియట్ యూనియన్ పురోగతిని పెట్టుబడిదారీ ప్రపంచం గుర్తించవలసి వచ్చింది. ఉదాహరణకు అమెరికన్ రాజకీయవేత్త ఛెస్టర్ బౌల్స్ సోవియట్ యూనియన్ మొట్టమొదటి స్పుత్నిక్‌ను ప్రయోగించేంతవరకూ. "అమెరికా పారిశ్రామిక, సైనిక ఆధిక్యతను యించుమించు ఎవ్వరూ కాదనలేదు. తరవాత హటాత్తుగా స్పుత్నిక్‌ను, ప్రపంచంలో కోలాహలంతో ప్రయోగించే సరికల్లా పోటీలో కమ్యూనిజమే విజయాన్ని సాధించుతున్నది గదా అని లక్షలాదిమంది ప్రశ్నించసాగారు" అని అన్నారు.

మిస్టర్ బౌల్స్, కమ్యూనిజమే విజయాన్ని సాధిస్తున్నది. ఇప్పుడు అమెరికాలో పనిచేస్తున్న జర్మన్ రాకెట్ల నిపుణుడు వెర్నర్ వాన్ బ్రాన్ మీ గోత్రీకుడే. తమ తత్వశాస్త్ర ప్రాతిపదికపైన యీ విజయాలను సాధ్యపరచిన ఒక వ్యవస్థను రష్యన్లు స్థాపించారనీ; రష్యన్లుసాధించిన విజయాలను సాధించడానికి తాను జీవిస్తోన్న వ్యవస్థలో సాధ్యపడదనీ అంగీకరించవలసి వచ్చింది. భలే బాగా చెప్పాడు, కామ్రేడ్స్.

నేడు కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికై, బృహత్తరమైన పథకాలను మన దేశం అమలు జరుప బోతున్నపుడు, యింకా పెద్ద నూతన సమస్యలను సోవియట్ శాస్త్రజ్ఞులు ఎదుర్కొనవలసివస్తుంది. మరింత ప్రయోజనాత్మకంగా శాస్త్రీయ పరిశోధనలను కొనసాగించాలి. శాస్త్రీయ రంగంలో యువశక్తుల కెక్కువగా అవకాశమివ్వాలి. ఎక్కువ ప్రాధాన్యంగల శాస్త్రీయ, సాంకేతిక రంగాలన్నింటిలోను ప్రథమ స్థానాన్ని పొందడం మన కర్తవ్యం.

కామ్రేడ్స్, సోవియట్ సాహిత్యం, కళలు తమ గొప్ప సైద్ధాంతిక సంపదకు ప్రపంచ మంతటా ఎంతో కీర్తి ప్రతిష్టలను పొందాయి. సోవియట్ రచయితలు, స్వరకర్తలు, కళాకారులు, సినిమా, నాటక రంగస్థల కార్యకర్తల కళా నైపుణ్యం గొప్పగా పేరుగాంచాయి. ఇటీవలి సంవత్సరాల్లో సాహిత్య కళారంగాల్లో నూతన ఖండాలు వెలిసాయి. సోషలిస్టు సమాజ వాస్తవ స్వరూపాన్ని యివి చక్కగా కళ్ళకు కట్టినట్టుగా చిత్రించాయి.

కళారంగంలో మనం సాధించిన విజయాలు, దాని సాంప్రదాయాలు అపార ప్రాముఖ్యం గలవి. మానవ రసజ్ఞతను పెంపొంద చేయడంలో యివి ఒక ముఖ్య దశగా వున్నవి. కళారంగంలో స్వేచ్ఛాయుత సృజనాత్మకమైన కృషికి, సాంస్కృతిక విలువల సృష్టితో ప్రజలు ఎక్కువగా పాల్గొనడానికి విశాలమైన అవకాశాలను సోషలిజం మాత్రమే యివ్వగలదని మన దేశ అనుభవం రుజువు చేస్తున్నది. మానవాళి ఆత్మిక నిధిని సోవియట్ కళ నిండింపచేస్తున్నది. కమ్యూనిస్టు సంస్కృతి విజయానికై బాటలు వేస్తున్నది.

పెట్టుబడిదారీ పీడననుండి విముక్తి పొందిన ప్రతి ప్రజలు జాతీయ సంస్కృతిని పెంపొందించుకొనడం ద్వారా, కమ్యూనిస్టు సమాజంలో సమిష్టి సంస్కృతి ఏర్పడుతుందని లెనిన్ చెప్పారు. సోషలిస్టు దేశాల మధ్య సంబంధ బాంధవ్యాలవల్ల యావత్తు సోవియట్ సంస్కృతికి సమాన

నూతన లక్షణాలు ఉదయించి, పెంపొంది, పరస్పరం లాభాన్ని పొందుతాయి. సోషలిస్టు సంస్కృతుల అంతర్జాతీయ ఏకత్వాన్ని సాలోచనగా బలపరచడం, ప్రోత్సహించడం, పెంపొందించడం మన కర్తవ్యం. మన సమాజం ప్రస్తుతం విప్లవాత్మక పరిణామాన్ని పొందే వీరోచిత యుగంలో వున్నది. అలాంటి యుగాన్ని తగిన విధంగా మన రచయితలు, కళాకారులు చిత్రించగలరని ప్రజలు ఆశిస్తున్నారు, నమ్ముతున్నారు. జీవితం నుండి సత్క్రియా శీలక ఉదాహరణల నివ్వడం, ప్రజలను కమ్యూనిజం భావం గలవారిగా చేయడం కళయొక్క ధర్మమని పార్టీ భావించుతున్నది. సోవియట్ సాహిత్యం, కళల శక్తి, సోషలిస్టు వాస్తవికతాపద్ధతి శక్తి వాస్తవ జీవితంలోని మూల అంశాలను సరిగ్గా చిత్రించడంలోనేవున్నది. సోవియట్ ప్రజలను రసజ్ఞులుగా చేయడంలోను, వారి కళాభిరుచులను రూపొందించడంలోను యెక్కువ శ్రద్ధ వహించవలసి వున్నది. లాంఛన దృక్పథం వల్లగాని, కళ, జీవితం, గృహాల్లో "సౌందర్య" మనబడే హీనభావంవల్లగాని ఏర్పడిన కళాభిరుచి రాహిత్యాన్ని గట్టిగా యెదుర్కోవాలి, అది ఏ రూపం ధరించినప్పటికీ.

మానవుని శ్రమ అన్నింటికంటె జీవితంలో అందమైంది నూతన మానవుణ్ని, శ్రామికుణ్ని, అతని ఆత్మిక ప్రయోజనాల సమృద్ధిని, బూజు పట్టినవాటికి వ్యతిరేకంగా అతను చేసే పోరాటాన్ని వాస్తవికంగా చిత్రించడంకంటె ఉన్నతమైందేముంటుంది? కమ్యూనిస్టు శ్రమశక్తిలోని నవ్యతను బయటికి తెచ్చేటటువంటి, వారి చొరవను ప్రోత్సహించేటటువంటి, తమ లక్ష సాధనలో పట్టుదలను పుట్టించేటటువంటి ఆసక్తిదాయకమైన కళారూపాలను సోవియట్ ప్రజలకు మన మందివ్వాలి.

సోవియట్ ప్రజలకు సోవియట్ సాహిత్యం, కళలు ఒక గట్టి ఆయుధంగా వుంటాయనీ, వారి జీవితంలో ఒక మంచి వివేకవంతమైన ఉపదేశంగా వుంటాయనీ మన పార్టీ విశ్వసిస్తోంది.

## 6 కమ్యూనిస్టు సంబంధాలుగా సోషలిస్టు సాంఘిక సంబంధాల పరిణతి. సోవియట్ ప్రజాస్వామ్యాభివృద్ధి. సోషలిజం, వ్యక్తి స్వాతంత్ర్యం.

కామ్రేడ్స్, పార్టీ 20వ మహాసభ నిర్ణయాలను అమలుపరచడంలో, సోషలిస్టు ఉత్పత్తి సంబంధాల, తదితర సాంఘిక సంబంధాల అభివృద్ధికి, వాటిని శ్రేష్ఠంగా చేయడానికి ఎక్కువ శ్రద్ధ వహించి పార్టీ పనిచేసింది. కమ్యూనిస్టు సాంఘిక సంబంధాల వైపుకు పరిణామం చెందాలంటే యిదే రాచబాటగా పార్టీ భావిస్తున్నది; స్వేచ్ఛాయుతమైన, సామరస్యం గల, సాంఘిక చైతన్యం గల ప్రజల మధ్య అత్యంత శ్రేష్ఠమైన సంబంధాలు: స్నేహం, సాహచర్యాలపైని ఆధారపడిన సంబంధాలివి. మార్క్స్ నాయకత్వాన మొట్టమొదట స్థాపించబడిన అంతర్జాతీయ కార్మికుల సంఘం, అంతర్జాతీయ కార్మిక ప్రజల అసోసియేషన్ అని పిలువబడింది. "అసోసియేట్" అనే పదం ఒకే రకమైన అభిప్రాయాలను, సమానత్వాన్ని, సౌభ్రాతృత్వాన్ని, గౌరవాన్ని, సహకారాన్ని వ్యక్తపరుస్తుంది.

సోషలిస్టు వ్యవస్థలో "శక్తికొలది పని, పనికొద్ది అనుభవం" అనే సూత్రం అమలు జరుపబడింది. "శక్తికొద్ది పని, అవసరంకొద్ది అనుభవం" అనే కమ్యూనిస్టు సూత్రాన్ని అమలు జరుపాలంటే కాల వ్యవధి, కొన్ని నిర్దిష్ట పరిస్థితులు అవసరం. కమ్యూనిజం సూత్రాలు చాలా ఉదాత్తమైనవి, ఉత్తేజకరమైనవి. మన జీవితంలో ఒక భాగంగా అవి సాధ్యమైనంత త్వరలో కావాలని, మనమంతా కోరుకొంటాం.

మరలాంటప్పుడు ఆ సూత్రాలను వెంటనే యెందుకు మనం ప్రవేశపెట్టడంలేదు ? స్థూలంగా కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి, పార్టీకి రెండు దశాబ్దాల కాలం ఎందుకు అవసరమయ్యింది ? కమ్యూనిస్టు సూత్రాలను అమలుపర్చడానికి మనం చాల ఎక్కువ కాలం తీసుకోవడం లేదు, కామ్రేడ్స్. సాధ్యమైనంత త్వరలోనే ఈ సూత్రాలను ప్రవేశపెట్టాలనే

మనం కోరుకొంటాం. కాని సొంత కోర్కెలున్నంత మాత్రాన్నే చాలదు. వాస్తవ పరిస్థితులపైనే మనం ఆధారపడాలి. సాంఘిక పురోగతి సూత్రాలను దృష్టిలో పెట్టుకోవాలి.

కమ్యూనిస్టు సూత్రాలకు పరిణామం సాధ్యమే; కాని అందుకవసరమైన; భౌతిక, సాంకేతిక పునాది ఏర్పరచందే అది సాధ్యపడదు: ఉన్నతమైన చైతన్యవంతులుగా ప్రజలు తయారు కానిదే, సోషలిజం శక్తులన్నీ పూర్తిగా బహిర్గతం కానిదే సాధ్యపడదు. సోషలిస్టు సంబంధాల నభివృద్ధిపరచి, శ్రేష్ఠం చేయడం ద్వారానే తప్ప, కమ్యూనిస్టు సాంఘిక సంబంధాల నేర్పరచడానికి మరో మార్గం లేదు.

సోవియట్ జీవిత రంగాలన్నింటిలోను ముఖ్యమైన సాంఘిక-ఆర్థిక చర్యలను, చాలవాటిని గత కొద్ది సంవత్సరాల్లో పార్టీ తీసుకొన్నది. ఇవి మన భౌతిక, సాంకేతిక పునాదులను గట్టిపరచుకోడానికి తోడ్పడటమే గాక సాంఘిక సంబంధాలను మెరుగుపరచడంకోసం. సోషలిస్టు సంపద యొక్క రెండు రూపాలను సన్నిహితం అయడంలో ముఖ్యమైన పాత్ర నిర్వహించడంవల్ల యీ చర్యలకు విప్లవాత్మకమైన ప్రాధాన్యత వున్నది.

శ్రమ స్వభావంలోను, కార్మికుల మధ్య సంబంధాలలోను నూతన లక్షణాలు రానురాను అధికమవుతున్నాయి. దీనిలోని ప్రముఖమైన అంశమేమిటంటే, త్రికరణ శుద్ధిగా పనిచేసే అలవాటు యితోధికంగా కార్మికుల్లో రూపొందుతున్నది. వారిలో చాలా మందికి, పని అంటే జీవనోపాధిని సంపాదించుకొనే సాధనమాత్రమే అనే దృష్టి పోయింది; అదొక సాంఘిక కర్తవ్యంగాను, నైతిక బాధ్యతగాను పరిగణింపబడుతోంది. ఉదాహరణకు, యీ మహాసభ అధ్యక్షవర్గానికి ఎన్నుకోబడిన వాలెంతీనా గగానోవానే తీసుకోండి. అభివృద్ధిపొందిన కార్మిక దళాన్ని తనంతట తానుగా వదలి, వెనుకబడుతున్న కార్మిక దళంలో పని చేయడానికి ఆమె వెళ్ళింది. స్వార్థ ప్రయోజనాలకొరకై ఆమె అలా చేయలేదు. ఉన్నతమైన బాధ్యత,

షన సమిష్టి లక్ష్యంపట్ల ఆమెకున్న భక్తి వల్లనే అలా ఆమె చేసింది. గగానోవా ఉదాహరణను చాలమంది అనుసరించారు.

కమ్యూనిస్టు పంథాలో పని చేయడం, జీవించడం నేర్చుకోవాలన్న సోవియట్ ప్రజల అకాంక్షను పార్టీ ఎల్లప్పుడూ ప్రోత్సహిస్తూనే వుంటుంది. ఉత్పత్తిలో కమ్యూనిస్టు అగ్ర దళాల ఉద్యమానికి కార్మికులకు మన మెక్కువ ప్రాధాన్యం యిస్తాము. సోషనిస్టు అనుకరణలో యితరమైన, యింకా శ్రేష్ఠమైన రూపాలను సైతం, కాలం గడిచే కొలదీ ఆచరణే నిస్సం దేహంగా సూచిస్తుంది.

భౌతిక, సాంస్కృతిక సౌకర్యాల పంపిణీలో కూడా సాంఘిక సంబంధాలు మారుతున్నాయి. ఏవిధంగా?

పనికొద్ది అనుభవం అనే సోషలిస్టు పంపకం సూత్రం నిరంతరంగా అభివృద్ధి చెందడంలో దీనిని ముఖ్యంగా గమనించవచ్చును. అవసరం కొద్ది పంపకం అనే కమ్యూనిస్టు సూత్రానికి పరిణామం చెందడానికి ఇది చాల అవసరం. పనికి భౌతికమైన ప్రోద్బలాలను కల్పించాలనే సూత్రాన్ని పార్టీ పట్టు విడువకుండా అమలుపరుస్తున్నది: వేతనాలను ఒకేస్థాయిలో పెట్టడమనే పద్ధతిని ఖచ్చితంగా వ్యతిరేకిస్తున్నది. భౌతిక విలువలు పుష్కలంగా మనకు లభించినంతవరకూ, పని, వ్యక్తి యొక్క ప్రాథమిక అవసరం కానంతవరకు సోషలిస్టు పంపకం సూత్రాన్ని వదులుకోడానికి వీల్లేదు; మొత్తం శ్రమ శక్తిపైన వినిమయంపైన. ప్రజల, ప్రభుత్వ అజ మాయిషీని సడలించడానికి సాధ్యపడదు.

భౌతిక ప్రోద్బలాలు కల్పించాలన్న లెనిన్ సూత్రాన్ని, మన దేశ ములో సోషలిస్టు నిర్మాణంలో వచ్చిన అనుభవం ధృవపరుస్తుంది. లెనిన్ ప్రతిభ; సాంఘిక లక్షణాలను క్షుణ్ణంగా విశ్లేషించి వ్యాఖ్యానించడం లోనూ, సోషలిస్టు సమాజ నిర్మాణంలో ఒక్కొక్క ప్రత్యేక దశలో ఉత్పన్నమయ్యే సమస్యలకు పరిష్కార మార్గాన్ని చూపడంలోనూ వుంది.

తనకు స్వాభావికమైన ముందుచూపు, ధైర్య సాహసాలతో లెనిన్

ఎలా అంతర్యుద్ధం ముగిసిన వెంటనే విధానంలో మూలమైన మార్పు రావాలన్నారో, కమ్యూనిస్టు యుద్ధ విధానంనుండి నూతన ఆర్థిక విధానానికి మార్పు చేశారో జ్ఞాపకం తెచ్చుకోండి.

నూతన ఆర్థిక విధానానికి మార్పుచెందడం అంటే అంత సులభమైందేమీగాదు. దానివల్ల పార్టీలోనే అనేక ఇబ్బందులొచ్చాయి. కొంతమంది కమ్యూనిస్టులు పార్టీనుండి వెళ్ళిపోయారు. నూతన విధాన సారాంశాన్ని వారు అర్థం చేసుకోలేదు. అందులో ఇమిడివున్న ఇబ్బందులు లెనిన్‌కు తెలుసు. అయినప్పటికీ నూతన ఆర్థిక విధానాన్ని ప్రవేశపెట్టడానికి అయన జంకలేదు. సోషలిజం విజయానికై సాగించే పోరాటంలో లెనిన్ విధానాన్ని పార్టీ అంతా బలపరచింది. అప్పుడు లెనిన్ విధానం జయప్రదం అయివుండకపోతే, మనం సోషలిజాన్ని నిర్మించగలిగివుండేవారంకాదు. సోషలిజం నిర్మాణంలో కార్మిక, కర్షక మైత్రిని బలపరచడం; ఆర్థికాభివృద్ధిలో పట్టణ, గ్రామీణ కార్మికులకు భౌతికమైన ఆసక్తిని కలుగచేయడం అవసరమైంది. పని గుణాన్నీ, పని రాశినీ బట్టి ప్రతిఫలం చెల్లించాలనే సూత్రం, సమానంగా ప్రతిఫలం చెల్లింపబడాలనే సూత్రం స్థానంలో ప్రవేశపెట్టబడింది.

రాజకీయాల్లో వాస్తవిక దృక్పథం అలవరుచుకోవాలని లెనిన్ మనకు బోధించారు. చాలా ఉజ్జ్వలమైన భవిష్యత్తును గురించి మనం కలలు గనవచ్చు. ఆర్థికాభివృద్ధి అత్యంత త్వరితగతిని సాగాలని మనం పథకాలు వేసుకోవచ్చు; కాని సమాజ పునర్నిర్మాణావసరాన్ని కార్మికులే గుర్తించకపోతే, అందులో వారికి భౌతికమైన ఆసక్తి లేకపోతే, ఏ పథకాలూ ఫలించవు; భౌతిక ప్రోత్సాహాలను కల్పించాలనే సూత్రాన్ని విస్మరించడం అంటే, కేవలం స్వీయ ఆలోచనలను బట్టి ప్రవర్తించడమే; అభివృద్ధిలో ఒక దశను దాటవేయడమే; సోషలిస్టు, కమ్యూనిస్టు నిర్మాణానికి నష్టం కలుగచేయడమే.

ప్రజలేవిధంగా వున్నారో అర్థం చేసుకొంటూ, వారితో పనిచేయడ

మెలాగో మనం లెనిన్‌నుండి నేర్చుకోవాలి. రాజకీయాల్లో స్వీయ మానసిక వాదులంగా మనం తయారుకారాదు. "నా ఇష్టం వచ్చినట్లు నేను చేస్తా" ననే ధోరణి పనికిరాదు. ప్రజల జీవితాన్ని మనం లోతుగా పరిశీలించాలి: అధ్యయనం చేయాలి; ప్రజావాణిని పాటించాలి. భౌతిక, నైతిక ప్రోద్బలాలను మిళితం చేయడం ద్వారా, సమృద్ధి జీవితానికీ, అవసరాల ననుసరించి పంపకం జరగడానికీ నిజమైన బాటను పార్టీ దర్శిస్తుంది: ఈ బాటను, కమ్యూనిస్టు క్రమ విజయపథాన్ని అది తప్పక చేరుతుంది.

సమృద్ధి అంటే హద్దూ పద్దూ లేకుండా వ్యక్తిగత ఆస్తి పెరగడమని అర్థం చేసుకొంటే, అది మనకూ, కమ్యూనిజానికీ వ్యతిరేకమైనది. వ్యక్తిగత ఉపయోగం కొరకు అనేక వస్తువులను శ్రామికుడు కలిగి వుండవచ్చు. అది కమ్యూనిస్టు సూత్రాలకు వ్యతిరేకమేమీ కాదు. అయితే అది సబబైన హద్దుల్లో వుండాలి, సంపాదనే పరమావధి కారాదు. కొన్ని పరిస్థితులలో అపరిమితమైన వ్యక్తిగత ఆస్తి సాంఘిక పురోగమనానికి ఆటంకంగా తయారు కావచ్చు: తరచు అవుతుంది కూడా. స్వంత ఆస్తి కూడబెట్టాలనే ధోరణులను అది పెంచి పోషిస్తుంది: అది పెటీ-బూర్జువా స్థాయికి దిగజార్చ వచ్చును. ఫలితంగా వస్తువులకు వ్యక్తి బలి అయిపోతాడు; వాటికి బానిసగా తయారవుతాడు.

"నాది" అనే భావమే ఉన్నతమైన సూత్రంగా గల, యితరుల నాశనం పైనే కొందరు భాగ్యవంతులు కావడానికి అవకాశాన్నిచ్చే, మానవులను అవినీతిపరులుగా తయారుచేసే అహంకారం, దురాశ, ధనాశ వృద్ధి చెందే బూర్జువా సమాజ నీతిని కమ్యూనిస్టులు తిరస్కరిస్తారు. వ్యక్తి ఆస్తి స్థానంలో ప్రజల ఆస్తిని కమ్యూనిస్టులు ప్రతిపాదిస్తారు: బూర్జువా వ్యక్తిత్వం స్థానంలో సహవాస సమానత్వం, సమిష్టి తత్వాలను ప్రతిపాదిస్తారు

సోషలిస్టు ఉత్పత్తి సంబంధాల అన్ని హంశాల అభివృద్ధివల్ల పట్టణం, గ్రామం మధ్య వుండే తేడాలు క్రమేపీ తుడిచిపెట్టుక పోతాయి; సోవియట్ సమాజంలోని వర్గాల, సాంఘిక బృందాల మధ్య వుండే తేడా

కూడా అంతరించి పోతుంది. కార్మికులు, కర్షకులు, మేధావుల మధ్య సంబంధాల్లో కమ్యూనిస్టు సూత్రాలు రాను రాను యెక్కువగా ఆచరణలోకి వస్తాయి. మన సమాజంలోని రెండు మిత్ర వర్గాలైన కార్మిక వర్గం, సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతాంగం మరింత సన్నిహితు లవుతున్నారు: వారి అవిచ్ఛిన్నమైన మైత్రి మరింత పటిష్టవంత మౌతున్నది. పని నైపుణ్యం లోను, పని పరిస్థితుల్లోను, సాంస్కృతిక, సాంకేతిక ప్రమాణాల్లోను కార్మిక వర్గంతో సమాన స్థాయికి సోవియట్ రైతాంగం చేరుకొంటున్నది. కార్మికులకున్న రాజకీయ హక్కులనే రైతులు పొందుతున్నారు. రెండు వర్గాల మూల ప్రయోజనాలు ఒకటే: ముఖ్యమైన అంశాలన్నింటిలో. కార్మిక వర్గం, రైతాంగం మధ్య వున్న తేడా రద్దయిపోయింది. వర్గ భేదాలు పూర్తిగా నశించిపోవడం అతి వేగంగా జరుగుతున్నది.

సాంకేతికాభివృద్ధి, కార్మికుల ఉన్నత సాంస్కృతిక, సాంకేతిక ప్రమాణాల ద్వారా మానసిక, శారీరక శ్రమల మధ్యనున్న మూల భేదాలు రద్దు చేయబడుతున్నవి. కార్మిక, సమిష్టి కర్షకులకు సాంకేతిక పరిజ్ఞానం, విద్య నేర్పుతున్నవి: అందువల్ల వారి పనిలో మానసిక, శారీరక శ్రమలు రెండూ మిళితమై వున్నాయి. దేశంలోని నేటి కార్మికుల్లో 40 శాతం, సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతుల్లో 23 శాతానికి పైగా సెకండరీ, లేక ఉన్నత విద్యను అభ్యసించినవారు. ఇంజనీరెవరో, మొదటి తరగతి కార్మికుదెవరో గుర్తించడం యీ రోజుల్లో తరచు కష్టం: అలాగే వ్యవసాయ శాస్త్రవేత్తకు, మొదటి తరగతి సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతుకు తేడా కనిపెట్టడమూ కష్టమే.

ఆ విధంగా మన దేశంలో వర్గ సంబంధాలు యిప్పుడు నూతన అభివృద్ధి దశకు చేరుకొన్నవి. సమస్త ప్రజల సోషలిస్టు ప్రజాస్వామ్యంగా కార్మిక వర్గ ప్రజాస్వామ్యం పరిణామం చెందుతున్నది. ప్రభుత్వ పరిపాలనా కృషిలో ఒక్కరిని కూడా మినహాయించకుండా పౌరులందర్నీ చేర్చాలన్న లెనిన్ నిర్దేశించిన ధ్యేయాన్ని మనం చేరుకొంటున్నందుకు

మనమెంతో సంతోషిస్తున్నాం. సోవియట్‌లు, వాటి కమిటీలు ద్వారా ఎన్నుకోబడిన సహకార సంఘాల, ట్రేడ్ యూనియన్‌ల, యువ కమ్యూనిస్టు లీగ్, తదితర ప్రజా సంఘాల ద్వారా కోట్లాది సోవియట్ ప్రజలు దేశ పరిపాలనలో చురుకుగా పాల్గొంటున్నారు; పౌరహిత బాధ్యతలను నిర్వహిస్తున్నారు.

ప్రతి సోవియట్ పౌరుడు ప్రజాహిత వ్యవహారాల నిర్వహణలో చురుకుగా పాల్గొనాలనేది మన నినాదం, మన కర్తవ్యం

ప్రభుత్వ సంస్థలను క్రమక్రమంగా శ్రేష్ఠంగా చేయడం, కార్మిక ప్రజాప్రతినిధుల సోవియట్‌లను పునర్వ్యవస్థీకరించి వాటిని స్వయంపరిపాలిత సంఘాలుగా రూపొందించడం మన ప్రధాన కర్తవ్యం అని నొక్కి చెపుతూనే, రానురాను ఎక్కువగా ప్రభుత్వ కార్యక్రమాలు నిర్వహించే బాధ్యతను ప్రజా సంఘాల కప్పజెప్పే విధానాన్ని మన పార్టీ కొనసాగిస్తుంది. అయితే, ఆయా ప్రజా సంఘాల అభివృద్ధి స్థాయినీ, అవి ఎంతవరకు స్వతంత్రించి వ్యవహరించకలుగుతున్నాయి అన్న దానినీ గమనించడం యీ సందర్భంలో ముఖ్యం. కేవలం లాంఛనంగా పేరు మార్చడమే మన లక్ష్యం కాదు; సమూలమైన పునర్వ్యవస్థీకరణ మన లక్ష్యం.

సోవియట్ సమాజ జీవితాన్ని క్రమబద్ధం చేయడంలో నచ్చజెప్పడం, బోధన ప్రధానమైన పద్ధతులుగా ముఖ్యమైన ప్రభుత్వ విధులను ప్రజా సంఘాలకు బదిలీచేయడం అంటే, సోవియట్ చట్టాన్ని, కార్మిక క్రమశిక్షణనూ, నైతిక వర్తననూ ఖచ్చితంగా పాటించాలన్న దానిపై ఉన్న పర్యవేక్షణను సడలించడం కాదు. సోవియట్ చట్టం అధికారాన్ని గౌరవించాలని మనం ప్రజలకు బోధించాలి. చట్టపు అధికారం, ప్రజాభిప్రాయానికి గల అధికారంపూర్తిగా వినియోగింపబడాలి.

జీవిత రంగాలన్నింటిలోను సాంఘిక సంబంధాల అభివృద్ధికి మన పార్టీ పనిచేస్తున్నది; అలాగే ఇకమీదట కూడా చేస్తుంది. ఆర్థిక, రాజకీయ విషయాలే కాదు; నిత్య జీవనం, సంస్కృతి, మన స్తత్వ శాస్త్రం, ప్రజల

చైతన్యం నూతన సంబంధాలను—స్నేహ, సహచరత్వ, పరస్పర సహకార, సమిష్టి తత్వాలను రూపొందించడానికి విస్తృతమైన అవకాశాలనుయిస్తాయి. నిజమైన స్వేచ్ఛ, వ్యక్తియొక్క సంపూర్ణాభివృద్ధి, వ్యక్తిగత, సామాజిక ప్రయోజనాల మేలు కలయిక సోషలిస్టు సమాజంలో మాత్రమే, ప్రజల మధ్య నూతన సంబంధాల ప్రాతిపదిక పైన సాధ్యమవుతాయి.

సంఘానికి, వ్యక్తికి మధ్య ఘర్షణను కమ్యూనిజం తప్పనిసరిగా సృష్టించుతుందనీ, అది అతనియొక్క వ్యక్తిత్వాన్ని చంపివేస్తుందనీ మన సిద్ధాంతాలు గిట్టని శత్రువులు ప్రచారం చేస్తూనేవుంటారు. భౌతిక ఉత్పత్తి విషయంతో మనం విజయం సాధించామని సోషలిజం శత్రువులు అంగీకరించే మాట నిజమే; కాని దీని వెంటనే వ్యక్తి స్వాతంత్ర్యాన్ని, వ్యక్తి హక్కులను హరించడం ద్వారానే వాటిని మనం సాధించామని నొక్కిజెప్పడానికి ప్రయత్నిస్తారు. ఏ విషయాన్నయినా సామ్రాజ్యవాదులు తమ ప్రమాణాలతోనే కొలుస్తారు; వారికి వ్యక్తి స్వేచ్ఛ అంటే, సమాజ ప్రయోజనాలను వ్యక్తి ప్రయోజనాలు అరాచకంగా వ్యతిరేకించడమే; సమిష్టి సమాజాన్ని వ్యక్తి వ్యతిరేకించడమే. "తిను, లేకపోతే నిన్నే తినేస్తారు" అనేదే వారి నైతిక సూత్రం.

నిజమైన స్వేచ్ఛ, సౌఖ్యం ఏ సమాజంలోనైనా ఉన్నాయని చెప్పుకోవాలంటే ఆ సమాజం వ్యక్తిని దోపిడీనుండి విముక్తిని చేయగలిగి వుండాలి: విస్తృతమైన ప్రజాస్వామిక హక్కులు వ్యక్తికి ఇవ్వగలిగి వుండాలి వ్యక్తి జీవించడానికి అనువైన పరిస్థితులు కల్పించాలి; భవిష్యత్తులో నమ్మకం కలిగించి ఉత్తేజపరచ గలగాలి; వ్యక్తిగత సామర్థ్య ప్రజ్ఞా విశేషాలకు ఆటంకాలను తొలగించాలి; తాను చేసే శ్రమ సమాజ శ్రేయస్సుకేనన్న భావం వ్యక్తిలో కలుగజేయగలగాలి. సోషలిస్టు వ్యవస్థ అలాంటిది. సోషలిజం సృష్టించిన విలువలన్నిటిలో అత్యంత మహత్తరమైనది, కమ్యూనిజాన్ని చురుకుగా నిర్మించే నూతన మానవుడు. నిజంగా స్వేచ్ఛ గలిగిన మానవుడు చేయగలదేమిటో సోవియట్ ప్రజలు చేసి చూపిస్తున్నారు.

పెట్టుబడిదారీ ప్రపంచాన్ని "స్వేచ్ఛా ప్రపంచ"మని సామ్రాజ్యవాద సిద్ధాంత కర్తలు పిలుస్తుంటారు. సోవియట్ యూనియన్‌లో గల నిజమైన స్వాతంత్ర్యం, ఆర్థిక పురోగతి, సౌభాగ్యం, సంస్కృతి, మానవుని వ్యక్తిత్వ వికాసం స్థానంలో పెట్టుబడిదారీ విధానం యివ్వగలిగిందేమిటి? పేదలను దోచుకొనే "స్వేచ్ఛ"ను భాగ్యవంతులకు పెట్టుబడిదారీ విధానం యిస్తున్నది. లక్షలాది ప్రజలకు పని కల్పించకుండా "స్వేచ్ఛ" నిస్తున్నది: పన్నుల పెరుగుదల, హద్దూ పద్దూ లేని ఆయుధాల ఉత్పత్తి, జాతి విచక్షణ, ధనికి నియంతృత్వం, ప్రజాస్వామిక సంస్థలను నిషేధించడం, యివే గదా? ఇదేమయినా కావచ్చుగాని స్వేచ్ఛా ప్రపంచం మాత్రం కాదు. దానికి పూర్తిగా విరుద్ధం. ఇదొక బానిస ప్రపంచం, దోపిడీ లోకం.

పెట్టుబడిదారీ దేశాలు "బహిరంగ సమాజ"మనీ, సోవియట్ యూనియన్ "మూయబడిన సమాజ"మని సామ్రాజ్యవాద సిద్ధాంత కర్తలు చెప్తుంటారు. గుత్త పెట్టుబడిదారుల దోపిడీకీ, నిరుద్యోగానికీ, క్షీణతాత్విక భావాల్లోకి పతనానికీ మన సోషలిస్టు రాజ్యంలో మూత పడింది నిజమే. అయితే గూఢచార చర్యలు సాగించడానికి, మన తలుపులు తెరిచి వుంచే బాగుండునని సామ్రాజ్యవాద మహాశయులు అభిలషిస్తున్నారు. కాని సోషలిజానికి వ్యతిరేకంగా విచ్ఛిన్నకర కార్యకలాపాలకు మన తలుపులు గట్టిగా మూతపడి వున్నాయి.

నిర్మలమైన హృదయంతో మన దేశానికొచ్చే విదేశస్థులందరికీ మన సమాజంలో దాపరికమేమీ వుండదు. నిజాయితీతో కూడిన వ్యాపారానికీ, శాస్త్రీయ, సాంకేతిక సాంస్కృతిక విజయాల ఆదాన ప్రదానాలకూ, వాస్తవిక సమాచారం తెలుసుకొనడానికి మన సమాజం బహిరంగంగానే వుంది. "ఇనుప తెర"ను గురించి చెప్పాలంటే, అది పెట్టుబడిదారీ ప్రపంచంలోనే వున్నది, తమది "స్వేచ్ఛా ప్రపంచ"మని పెట్టుబడిదారీ దేశాలు చెప్పుకొంటాయి. కాని అవే పదే పదే భయకంపంతో తమ తలుపులు మూసివేసుకొంటాయి. సోవియట్ వంట వాళ్ళను, లేదా సోవియట్ చద

రంగం ఆటగాళ్ళను రానివ్వవు. అత్యంత "బహిరంగ" సమాజం తనదని చెప్పుకొనే దేశమే ఒకసారి సోవియట్ నర్తకులకు ప్రవేశమివ్వడానికి జంకింది. రష్యన్ నాట్యం ఒత్తిడిని పెట్టుబడిదారీ ప్రపంచపు పునాదులు కూలిపోతాయేమోనని బహుశా వారు భయపడి వుండొచ్చు.

ఆయుధాల ఉత్పత్తిలో కాకుండా శ్రామిక ప్రజల జీవనాన్ని మెరుగు పరచడంలో మనతో పోటీ చేయవలసిందిగా, పెట్టుబడిదారీ ప్రపంచాని కేనాడో మనం ప్రతిపాదించాము. అలాంటి పోటీలో పెట్టుబడిదారీ విధానం ఓడిపోతుందని మనకు ఖచ్చితంగా తెలుసు. అలాగే చివరికి ప్రజలం దరూ సక్రమమైన నిర్ణయాన్ని తీసుకొంటారనీ, పెట్టుబడిదారీ "స్వేచ్ఛా ప్రపంచం" అనబడే దానికంటే నిజమైన స్వేచ్ఛగల కమ్యూనిస్టు ప్రపం చాన్నే అన్ని దేశాల ప్రజలు తప్పనిసరిగా ఎంచుకుంటారనీ మనకు తెలుసు.

* * *

కామ్రేడ్స్, దేశ ఆర్థికాభివృద్ధికి పార్టీ తన మహత్తర ప్రణాళికలు వేసినప్పుడు, భారీ యంత్రాలకొరకై ప్రజల ముఖ్యమైన ప్రయోజనాలను కమ్యూనిస్టులు పాడు చేస్తారనీ, సోవియట్ దేశంలో ఉత్పత్తి ఉత్పత్తి కోసం మాత్రమే సాగుతున్నదనీ బూర్జువా రాజకీయవేత్తలు, ఆర్థికవేత్తలు గగ్గోలు పెట్టారు. సోషలిజం పైని ఎటువంటి దుర్భాషలివి! అన్ని కార్య కలాపాల్లో ఉత్పత్తి మానవునికొరకే ననేదే పార్టీ, సోవియట్ ప్రభు త్వం అంటి పెట్టుకొన్న పవిత్రమైన సూత్రం; అంతేకాని ఉత్పత్తి ఉత్పత్తికోస మెంతమాత్రం కాదు. ప్రజల యెడల తన బాధ్యతలను మన పార్టీ సర్వదా చిత్తశుద్ధితో నిర్వర్తిస్తున్నదని ఎవ్వరికైనా, ఎంతటి గుడ్డి ద్వేషికైనా యిప్పుడు బోధపడుతుంది.

దేశీయ విధానంలో దిగువ కర్తవ్యాలను సమీప భవిష్యత్తుకోసం, కమ్యూనిస్టుల యెదుట, సోవియట్ ప్రజల ముందు మన పార్టీ ఉంచు తున్నది.

1. కమ్యూనిజం స్థాపనకు కావలసిన భౌతిక, సాంకేతిక పునాదిని

వేయడంలో ఒక ముఖ్య దశ అయిన సప్తవర్ష ప్రణాళికను నెరవేర్చడానికీ, అంచనాలను మించికూడా నెరవేర్చడానికీ, ప్రజలంతా తమ కృషిని కేంద్రీకరించాలి. ఉత్పత్తి స్థాయిని మనం పెంచుతూ, దేశ రక్షణ శక్తిని పటిష్టంగా ఉంచాలి. సోవియట్ మాతృభూమి ఆర్థికాభివృద్ధి ఉన్నత దశలు చేరుకొనే కొలదీ నిరంతరాభివృద్ధి ఒక్కటే సంపూర్ణమైన ఆధిక్యతను మనకు కలుగజేయగలదనీ, పెట్టుబడిదారీ విధానంతో శాంతియుత ఆర్థిక పోటీలో మన మహత్తర విజయ దినాన్ని అది చేరువగా తేగలదనీ మనం జ్ఞాపకం పెట్టుకోవాలి.

2. సోషలిస్టు పరిశ్రమల అన్ని శాఖల్లో, ప్రత్యేకించి విద్యుచ్ఛక్తి అభివృద్ధి, రసాయన శాస్త్రం, మెకానికల్ ఇంజనీరింగు, లోహ నిర్మాణం, ఇంధనాల పరిశ్రమలలో సాంకేతికాభివృద్ధి వేగాన్ని పెంచాలి. పరిశ్రమల్లో ప్రత్యేక నైపుణ్యాన్ని మనం బాగా పెంపొందించాలి; పరిశ్రమల ఉత్పత్తి క్రమాలను సమగ్రంగా యాంత్రికం, స్వయం చలితం చేయాలి; అభివృద్ధిచెందిన శాస్త్రీయ, సాంకేతిక విజయాలను ఉత్పత్తిలో వినియోగించడం త్వరితం చేయాలి; ఉత్పత్తిలో నూతన పద్ధతులను కనిపెట్టిన వారి అనుభవాన్ని వినియోగించుకోవాలి. శ్రామికోత్పాదన శక్తి నిరంతరాభివృద్ధి, ఉత్పత్తి ఖర్చుల తగ్గుదల, వస్తువుల గుణాత్మక అభివృద్ధి సాధించడం సోవియట్ పరిశ్రమలన్ని ధ్యేయంగా పెట్టుకోవాలి.

3. పారిశ్రామిక వస్తువుల, ఆహార పదార్థాల విషయంలో ప్రజల అవసరాలను మరింత ఎక్కువగా తీర్చేందుకు సాధ్యమయ్యే స్థాయిని పరిశ్రమలు, వ్యవసాయం సాధించాలి. పారిశ్రామిక పథకాలు లక్ష్యాలను మించి ఉత్పత్తిని సాధించడం ద్వారా వచ్చే ధనాన్ని ప్రధానంగా వ్యవసాయం, చిన్న, ఆహార పరిశ్రమలు, తదితర జీవితావసర వస్తువుల నుత్పత్తి చేసే పరిశ్రమల్లో వెచ్చించాలి.

4. వ్యవసాయాభివృద్ధి సాధించడం మొత్తం పార్టీ, మొత్తం ప్రజల బాధ్యత. వ్యవసాయోత్పత్తి పట్ల పార్టీ. ప్రభుత్వ సంస్థలన్నీ నిత్యం శ్రద్ధ

వహించాలి; అగ్ర సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల అనుభవాన్ని తీసుకోవాలి. ధాన్యం, పత్తి, పంచదార దుంప, నూనె గింజలు, తేయాకు, తదితర పంటలు, మాంసం, పాలు, ఉన్ని, గుడ్లు, వ్యవసాయ క్షేత్రాల్లో ఉత్పత్తి అయ్యే తదితర వస్తువుల ఉత్పత్తి, కొనుగోలు విషయాల్లో సప్తవర్ష ప్రణాళిక లక్ష్యాలు యీడేరేటట్టుగా, లక్ష్యాలు మించేటట్టుగా కృషి చేయడం అవసరం.

5. సాంస్కృతిక, సాంఘిక పురోగమనంలో ఇంకా ముందుకు వెళ్ళాలి; సోవియట్ శాస్త్ర విజ్ఞానం, ప్రజా విద్య, సాహిత్యం. కళల నిరంతరాభివృద్ధి సాగాలి. ప్రజల జీవన ప్రమాణాలను పెంచాలి; వేతనాలు, జీతాలను క్రమబద్ధం చేయడానికీ, పని రోజునూ, పని వారంనూ తగ్గించడానికీ చర్యలు పూర్తి గావాలి. గృహ నిర్మాణాభివృద్ధిని అతి వేగంగా సాధించాలి: వ్యాపారం, ప్రజాఆహారశాలలు, వైద్యం, తదితర సౌకర్యాలను మెరుగుపరచాలి. పించనులను పెంచాలి.

మన దేశంలో సృజనాత్మక కృషి ఉవ్వెత్తున సాగిపోతున్నది. కమ్యూనిస్టు సమాజ నిర్మాణం, సోవియట్ యూనియన్‌లో వివిధ జాతులకు చెందిన ప్రజలంతా తమ సమిష్టి లక్ష్యంగా భావించుకొంటున్నారు: మన సమిష్టి విజయానికై వారు తమ అమూల్యమైన సహకారాన్ని అందిస్తున్నారు. మన కర్తవ్యం చాలా గురుతరమైనది, ఇది సోవియట్ ప్రజల కృషిని ఇనుమడింప చేయడానికి తోడ్పడుతుంది, వారిని శాయశక్తులపాటు పడేటట్టుగా చేస్తుంది, తప్పులను, జడత్వాన్నీ, సోమరితనాన్నీ సహించకుండా చేస్తుంది. సోషలిస్టు వ్యవస్థలో గర్భితమైవున్న శక్తులన్నిటినీ మనం పూర్తిగా ఉపయోగించుకోవాలి.



# III

# కమ్యూనిజం విజయానికై పోరాటంలో లెనినిస్టు పార్టీ నాయకత్వం

కామ్రేడ్స్, పార్టీ లెనినిస్టు సాధారణ విధానాన్ని దృఢంగా, నిరంతరంగా అమలు జరిపినందువల్లనే దేశీయ, విదేశీయ విధానంలో మనం ఘన విజయాలు సాధించగలిగాం. పార్టీ లెనినిస్టు సాధారణ విధానం, పార్టీ 20వ మహాసభ చరిత్రాత్మక నిర్ణయాలలో స్పష్టపడింది. పార్టీ 20వ మహాసభ ఆమోదించిన విధానం విజయవంతమైందని మీకు నివేదించడం అవసరమని కేంద్ర కమిటీ భావిస్తున్నది. వాస్తవికతా దృష్టితో రూపొందింపబడిన లెనినిస్టు విప్లవాత్మక భావం గర్భితమైవున్న ఆ విధానం, సర్వ సోవియట్ ప్రజలకు లక్ష్యమైంది. ప్రజలతో సంబంధాలను పార్టీ పటిష్ఠం చేసుకొన్నది; వారి బ్రహ్మాండమైన శక్తి అండతో సోవియట్ యూనియన్ ఘనతను హెచ్చించింది.

మన అభివృద్ధి పథంలో 21వ అసాధారణ మహాసభ ఒక మైలురాయి. దానికి గొప్ప చారిత్రిక ప్రాధాన్యం వుంది. ఎంచేతనంటే అది సప్తవర్ష ఆర్థికాభివృద్ధి ప్రణాళికను ఆమోదించింది, భారీ ఎత్తున కమ్యూనిస్టు సమాజ నిర్మాణ దశలో సోవియట్ యూనియన్ ప్రవేశించుతున్నదని ప్రకటించింది.

సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ 22వ మహాసభ ఒక యుగ నిర్మాత పాత్రను నిర్వహించక తప్పదు. ఎందుకంటే యిది పార్టీ నూతన కార్యక్రమాన్ని పరిశీలించి, రూపొందించుతుంది. ఇది కమ్యూనిస్టు సమాజ నిర్మాణ కార్యక్రమం, కమ్యూనిజం విజయ సాధనకు పోరాటంలో పార్టీకి, ప్రజలకూ ఇదొక పతాకంగాను, ఆయుధంగాను ఉంటుంది.

కార్మిక వర్గానికి, మొత్తం శ్రమ జీవులకూ కమ్యూనిస్టుల లెనినిస్టు పార్టీ రక్త మాంసాలవంటిది, అది వారికి హృదయం, మనస్సు, వారి మూల ప్రయోజనాలకు వాణి, వారి విప్లవ దీక్ష. ఆ పార్టీ కష్టనష్టాలతో కూడుకొన్నటువంటి కీర్తి, ప్రతిష్టల బాటలో ఎంతో దూరం ప్రయాణం చేసింది. సమాజాన్ని మార్పు చేయడంలో యిలాంటి ఘన విజయాలు సాధించిన పార్టీ ప్రపంచంలో మరెక్కడా లేదు లెనిన్ ప్రవక్తలా చెప్పిన మాటలు మీకు గుర్తుంటాయి: "విప్లవ యోధుల సంస్థను మాకివ్వండి. రష్యాను మేము తలకిందులు చేస్తాము," అన్నారాయన. ఈ మాటలు లెనిన్ చెప్పి యిప్పటికి అరవై ఏళ్లు దాటాయి. తమ దేశాన్ని బోల్షివిక్కులు నిజంగా "తలకిందులు" చేసిన విషయాన్ని, ప్రపంచం నేడు చూడగలదు. జారిస్టు రష్యా ఆర్థికంగా వెనుకబడిన, ఒక పెట్టుబడిదారీ దేశం. ఈనాడదొక బలవత్తరమైన, సౌభాగ్యవంతమైన సోషలిస్టు రాజ్యంగా పరిణామం పొందింది. ప్రజల సౌఖ్యం, సోషలిజంల కొరకు లెనినిస్టు పార్టీ సభ్యులుగా దశాబ్దాల తరబడిగా పరాక్రమంతో విప్లవ పోరాటం సాగించిన వృద్ధ బోల్షివిక్ యోధులకు మనమీనాడు హృదయ పూర్వక అభివందనాలు తెలియజేస్తాము. బోల్షివిక్ యోధులకు అద్భుతమైన ప్రతినిధులుగా, యీ మహాసభకు ప్రతినిధులుగా ఎన్నికైనవారికి మనం చేతులెత్తి నమస్కరిస్తాం.

ప్రథమ, ద్వితీయ కార్యక్రమాలు మన పార్టీ పూర్తిచేసి, సహేతుకంగానే గర్విస్తున్నది. సోవియట్ భూమిలో మన లెనినిస్టు పార్టీ యొక్క సంపూర్ణమైన అంతిమ విజయాన్ని సాధించి, సోషలిజం తన జాతీయ లక్ష్యాన్ని నెరవేర్చడమేగాక, అన్ని దేశాల కార్మిక ప్రజలకు, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి తన విధిని నిర్వర్తించింది కూడా.

కమ్యూనిస్టు సమాజ నిర్మాణం మన ప్రధానమైన, తక్షణ కర్తవ్యంగా సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ నూతన కార్యక్రమం నిర్ణయించింది. ఈ కార్యక్రమం ముసాయిదాను మహాసభకు ముందు జరిగిన చర్చ

లలో పార్టీ, సకల సోవియట్ ప్రజలు చర్చించి తమ హర్షామోదాలు తెలియజేశారు. నూతన కార్యక్రమం ముసాయిదాతో పాటు, పార్టీ నూతన నిబంధనలను కూడా యీ మహాసభ చర్చిస్తుంది. ఈ నిబంధనలపైన కామ్రేడ్ యఫ్. ఆర్. కోజ్లోవ్ నివేదికను మీకు సమర్పిస్తారు. మన పార్టీ కార్యక్రమం, నిబంధనలు విడదీయరానివని చెప్పిన లెనిన్ వాక్కులు ఎల్లప్పుడూ మనకు మార్గదర్శకమైనవి. కార్యక్రమాన్ని అమలు జరప డానికి, నిబంధనలలోని నిర్మాణ సూత్రాలు హామీగా ఉండాలి; కమ్యూనిజం కొరకు పోరాటంలో సోవియట్ ప్రజల వీర అగ్రగామి అయిన పార్టీ ఐక్య తను, సంఘ భావాన్ని అవి పటిష్టం చేయాలి.

## 1. వ్యక్తిపూజ దుష్ఫలితాల నిర్మూలన. పార్టీ కార్య కలాపాల్లోను, నాయకత్వ సూత్రాల్లోను లెనినిస్టు ప్రమాణాలకు దోహదం. పార్టీ క్రియాశీలకత అభివృద్ధి.

కామ్రేడ్స్, ఇప్పుడు సమీక్షింపబడుతున్న కాలంలో పార్టీ కార్య కలాపాల్లోను, నాయకత్వ సూత్రాల్లోను లెనినిస్టు ప్రయాణాల పునరుద్ధ రణ, వాటిని పెంపొందించడం, మన పార్టీ కృషి యొక్క అత్యంత ప్రధానాంశంగా వున్నాయి. మార్క్సిస్టు-లెనినిస్టు భావానికి వ్యక్తి పూజ విరుద్ధమైందని, పార్టీ 20వ మహాసభ ఖండిస్తూ, పార్టీ యొక్క, ప్రజల యొక్క సృజనాత్మక శక్తికి విశాలమైన అవకాశాన్ని కల్పించింది. ప్రజ లతో సంబంధాలు విరివిగా పెట్టుకోవడానికీ, వాటిని దట్టపర్చడానికీ, తన క్రియాశీలతను ఉచ్చస్థితికి తీసుకపోవడానికీ అది పార్టీకి సహాయపడింది.

పార్టీ 20వ మహాసభకు ముందర మనల్ని ఒక సమస్య ఎదుర్కొ న్నది : స్టాలిన్ వ్యక్తి పూజకాలంలో జరిగిన తప్పులను, దుర్వ్యాఖ్యానాలనూ లెనినిస్టు పద్ధతిలో పార్టీ బహిరంగంగా ఖండించి, అభివృద్ధికి ఆటంకంగా

తయారైన పార్టీ, ప్రభుత్వ నాయకత్వ పద్ధతులను నిరాకరించడమూ; లేక పాత పద్ధతులకు కట్టుబడి, నూతనమైన, సృజనాత్మకమైన వాటి నన్నింటినీ ప్రతిఘటించే శక్తులు పార్టీలో పైచేయి కావడమూ, అనేది ఆ సమస్య. అది చాల కీలకమైన సమస్య.

వ్యక్తిపూజతో ముడివడివున్న పెద్ద తప్పులను, దుష్ఫలితాలను ఇంత తీవ్రంగానూ, ఖండితంగాను, విమర్శించడం నిజంగా అవసరమా?

అవును, అవసరమే. బాగా నాటుకొనిపోయిన శత్రువు, దుస్సాహసి అయిన బెరియా గుట్టు బయటపెట్టిన తర్వాత అనేక పత్రాలను జాగ్రత్తగా తరచి పరిశీలించిన మీదట, పార్టీ కేంద్ర కమిటీకి, సోషలిస్టు న్యాయసూత్రాలు అతి దారుణంగా ఉల్లంఘించబడడమూ, అధికారం దుర్వినియోగమూ, నిరంకుశ చర్యలు. నిర్బంధ కార్యాలు పూర్తిగా తెలిశాయి. వీటివల్ల చాలమంది నిజాయితీపరులు. ప్రముఖ పార్టీ, ప్రభుత్వాధికారులతో బాటుగా బాధలకు గురిఅయ్యారు. గతంలో జరిగిన తప్పులను, దుర్వ్యాఖ్యానాలనూ మభ్యపెట్టే పద్ధతినిగాని. లేక బయటికి పొక్కకుండా దాచే విధానన్నిగాని పార్టీపట్ల, ప్రజలపట్ల తన బాధ్యతను బాగా గుర్తెరిగిన కేంద్ర కమిటీ అవలంబించజాలదు. లెనిన్ నిర్దేశానుసారంగా కేంద్ర కమిటీ వ్యక్తి పూజ రోజుల్లో జరిగిన అధికార దుర్వినియోగం గురించి సత్యాన్ని ప్రజలకు చెప్పాలని నిశ్చయించింది. పార్టీకి, పార్టీ నాయకత్వానికి నైతిక బాధ్యత, కర్తవ్యం యిది. ఇది సరైన నిర్ణయం. భవిష్యత్తుకు, కమ్యూనిస్టు నిర్మాణానికీ యిది గొప్ప ప్రాముఖ్యం గల విషయం.

తన తప్పుల నెప్పుడూ దాచుకోవద్దనీ, వాటిని బహిరంగంగా విమర్శించుకొని, సరిదిద్దుకోవలసిందిగా పార్టీకి లెనిన్ చెప్పారు. "తన వర్గం పట్ల, శ్రామిక ప్రజల పట్ల తన బాధ్యతలను ఆచరణలో ఎంత నిజాయితీతో ఎలా నిర్వర్తిస్తున్నదో తెలుసుకొనడానికి తన తప్పుల యెడల ఒక రాజకీయ పార్టీ యెలాంటి వైఖరి అనుసరిస్తున్నదన్నది, అతి ముఖ్యమైన అతి ఖచ్చితమైన మార్గాలలో ఒకటి" అని లెనిన్ వ్రాశారు. "పొర

పాటును బహిరంగంగా ఒప్పుకోవాలి, అందుకు కారణాలేమిటో తెలుసుకోవాలి, అందుకు దారితీసిన పరిస్థితులేమిటో పరిశీలించాలి, వాటిని సరిదిద్దుకొనడానికి తీసుకొనవలసిన మార్గాలేమిటో కూలంకషంగా చర్చించుకోవాలి. ఇవి సరియైన పార్టీ కుండవలసిన ముఖ్య లక్షణాలు. తన బాధ్యతలను నిర్వర్తించవలసిన తీరు అది. మొదట వర్గాన్ని, ఆ పైన ప్రజలను చైతన్యవంతులుగా చేసి వారిని సుశిక్షితులుగా చేయవలసిన తీరు అది."*

వ్యక్తి పూజను ఖండించక పోయినట్లయితే, దాని దుష్ఫలితాలను తొలగించకపోయి వుండకపోతే,పార్టీలోను, ప్రభుత్వంలోను లెనినిస్టు ప్రమాణాలను పునఃస్థాపితం చేసివుండకపోతే పార్టీ యొక్క, దేశం యొక్క పరిస్థితి ఏమైపోయుండేది? పార్టీకి, ప్రజలకు మధ్య అఘాతం ఏర్పడి వుండేది; సోవియట్ ప్రజాస్వామ్యం, విప్లవ న్యాయసూత్రాలు దారుణంగా ఉల్లంఘించబడి వుండేవి. ఆర్థికాభివృద్ధి మందగించి వుండేది. కమ్యూనిస్టు సమాజ నిర్మాణగతి తగ్గిపోయేది; ఫలితంగా ప్రజల జీవన ప్రమాణం పడిపోయి వుండేది. అంతర్జాతీయ సంబంధాల విషయంలో సోవియట్ స్థానం ప్రపంచ రంగంలో బలహీనపడి వుండేది, ఇతర దేశాలతో సంబంధాలు అధ్వాన్నమైపోయి వుండేవి. దానివల్ల ప్రమాదకరమైన ఫలితాలు కలిగేవి. అందుకే వ్యక్తి పూజను విమర్శించడం, దాని ఫలితాలను తొలగించడం గొప్ప రాజకీయ, ఆచరణ ప్రాముఖ్యత గలవి.

వ్యక్తి పూజ ఏ రూపంలో వున్నా దాన్ని మార్క్సిజం-లెనినిజం ఎల్లప్పుడూ తీవ్రంగా ఖండిస్తూనే వచ్చింది. కార్మికవర్గ విప్లవోద్యమభావానికి, కమ్యూనిజం భావానికి అది పూర్తిగా విరుద్ధమని మార్క్సిజం-లెనినిజం పరిగణించింది. ప్రజలే నిజమైన చరిత్ర నిర్మాతలుగా మార్క్స్, ఏంగెల్స్, లెనిన్ పరిగణించారు; కార్మిక వర్గ పార్టీ నాయకత్వ, నిర్మాణ పాత్రను వారు నొక్కి చెప్పారు. కార్మిక వర్గ నాయకుల ముఖ్య పాత్రను మార్క్సిజం-లెనినిజం కాదనదు. అయితే ఏ వ్యక్తికయినా మహిమను,

* వి. ఐ. లెనిన్. "అతివాద" కమ్యూనిజం, ఒక శైశవ వ్యాధి.

దైవత్వాన్ని ఆపాదించడాన్ని మార్క్సిజం-లెనినిజం గట్టిగా వ్యతిరేకిస్తుంది. ఏ వ్యక్తికైనా మహిమను అంటకట్టడమంటే పార్టీని, ప్రజలను తప్పనిసరిగా మరుగున పడవేయడమే. ఆ విధంగా వారి పాత్రను, ప్రాధాన్యతను తగ్గించడమే.

పార్టీ నాయకత్వాన, తమ శ్రమ, వీరోచిత పోరాటాల ద్వారా సోషలిస్టు నిర్మాణంలో సోవియట్ ప్రజలు గొప్ప విజయాలను సాధించారు. ఫాసిజానికి వ్యతిరేకంగా సాగిన దేశభక్తియుత మహా యుద్ధంలో వారు విజయం పొందారు. వ్యక్తి పూజ రోజుల్లో పార్టీ, ప్రజలు సాధించిన విజయాలన్నీ ఒకే వ్యక్తికి ఆపాదించబడ్డ విషయం మీకు గుర్తుంటే వుంటుంది. పార్టీకి, కమ్యూనిస్టు ఉద్యమానికి స్టాలిన్ ఘనమైన సేవ చేశారు: ఆయన కివ్వవలసిన ఘనత మనం యిస్తాము. కాని పార్టీ, ప్రజలు సాధించిన విజయాలన్నింటినీ ఒక వ్యక్తికి అంటగట్టడం తప్పు. వాస్తవ విషయాలకు అది పూర్తిగా విరుద్ధం.

పార్టీ 20వ మహాసభ న్యాయాన్ని పునఃస్థాపితం చేసింది, వక్రభాష్యాలకు స్వస్తి చెప్పింది. ప్రజలు నిర్వహించిన మహత్తర పాత్రను, శ్రామిక వర్గానికీ, మొత్తం ప్రజలకు అగ్రగామిగా, కమ్యూనిజం స్థాపనకై పోరాటంలో నాయకత్వం, దర్శకత్వం వహించే శక్తిగా పార్టీ నిర్వహించిన పాత్రను నొక్కి చెప్పింది. వ్యక్తి పూజకు పూర్తిగా స్వస్తి చెప్పి: పార్టీ, ప్రభుత్వ, సైద్ధాంతిక కార్యకలాపాలలో దాని దుష్ఫలితాలను తొలగించి, లెనిన్ విశదీకరించిన పార్టీ ప్రమాణాలను, సమిష్టి నాయకత్వ సూత్రాన్ని ఖండితంగా ప్రవేశపెట్టడానికి చర్యలను తీసుకోవలసిందిగా కేంద్ర కమిటీకి మహాసభ ఆదేశించింది.

వ్యక్తి పూజను సిద్ధాంతరీత్యా గట్టిగా విమర్శించడంలో లెనిన్ సూచనలను, ఆయన మరణశాసనాన్నీ మన పార్టీ అనుసరించింది. స్టాలిన్ గురించి లెనిన్‌కు చాలా ప్రశంసా భావముండేదనీ; ఆయన లోపాలను, తప్పులను కూడా లెనిన్ గమనించారనీ బాగా తెలిసిన విషయమే. పార్టీ

భవిష్యత్తు, సోవియట్ రాజ్య భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని, 1922 డిసెంబరు నెల్లో, అంటే కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శిగా స్టాలిన్ ఎన్నికైన కొద్ది రోజుల తరువాత, జరుగుతున్న పార్టీ మహాసభకు పంపిన సందేశంలో లెనిన్ యిలా వ్రాశారు:

"ప్రధాన కార్యదర్శి అయి కామ్రేడ్ స్టాలిన్ తన చేతుల్లో హద్దు లేని అధికారాన్ని కేంద్రీకరించుకున్నారు. ఆ అధికారాన్ని స్టాలిన్ తగిన విజ్ఞతతో వినియోగించుతారా అన్న విషయంలో నాకు నమ్మకం లేదు.... స్టాలిన్ చాల కఠినంగా ప్రవర్తిస్తారు; ఆయనలోని యీ లోపాన్ని మన మధ్యలో, కమ్యూనిస్టులమైన మనతో వ్యవహరించడంలో సహించవచ్చు; కాని ప్రధాన కార్యదర్శిలో యీ లోపం వుండడం సహించ వీల్లేదు. అందుకే ఆ స్థానాన్నుండి స్టాలిన్‌ను తొలగించే మార్గాన్ని గురించి ఆలోచించవలసిందిగా కామ్రేడ్స్‌కు నేను సూచిస్తున్నాను. ఆ స్థానంలో స్టాలిన్‌కు ఒకే ఒక విషయంలో భిన్నమైన, అంటే స్టాలిన్ కంటె ఎక్కువ సహనం, ఎక్కువ అణకువ, ఎక్కువ మర్యాద, ఎక్కువ సానుభూతి గల వ్యక్తిని, తక్కువ మొండి పట్టుదల యిత్యాది అర్హతలు గల వ్యక్తిని మరొకరిని నియమించమని నా సూచన."

పార్టీకి, ప్రభుత్వానికి స్టాలిన్ చెడు స్వభావాలు ఎక్కువ నష్టం కలిగించవచ్చునని లెనిన్‌కు బాగా తెలుసునని తేలుతున్నది. కాని దురదృష్టవశాత్తు లెనిన్ హెచ్చరిక, సలహా సకాలంలో అమలు జరుపబడలేమి. ఫలితంగా, వ్యక్తి పూజ వల్ల కలిగే అనేక యిబ్బందులను పార్టీ, దేశం అనుభవించవలసి వచ్చింది. తన 20వ మహాసభలో, యీ వ్యక్తి పూజను పార్టీ చాలా నిశితంగా విమర్శించింది. మహాసభ నిర్ణయాలను ఆచరణలో పెట్టడం ద్వారా, వక్రభాష్యాలకు, తప్పులకు పార్టీ స్వస్తి చెప్పింది: మళ్ళీ యిటువంటి అలవాట్లు జరగకుండా చూసేందుకై తగిన చర్యలు రూపొందించింది. అదొక సాహసోపేతమైన నిర్ణయం; పార్టీ, దాని కేంద్ర కమిటీ రాజకీయ పరిపక్వతను అది ధృవపరుస్తున్నది.

తప్పులను, వక్రభాష్యాలను, అధికార దుర్వినియోగాన్ని బట్టబయలు చేయడం కొంత కోపాన్ని, అసంతృప్తిని సైతం పార్టీలోను, ప్రజల్లోను కూడ కలుగజేయవచ్చుననీ; సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీకి, సోదర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలకు కొంత నష్టాన్ని, కొన్ని తాత్కాలిక ఇబ్బందులనూ కలిగించవచ్చునని పార్టీ గుర్తించింది. అయినా ఇబ్బందులన్నింటినీ పార్టీ ధైర్యంగా యెదుర్కొన్నది. యావత్తు సత్యాన్ని ప్రజలకు నిజాయితీగా, నిష్కల్మషంగా పార్టీ చెప్పింది. తన విధానాన్ని ప్రజలు హర్షిస్తారని పార్టీకి సంపూర్ణ విశ్వాసముండడంవల్ల యిలా చేసింది. ఈ విషయంలో పార్టీ ఎలాంటి పొరపాటూ పడలేదు. కమ్యూనిజం వైపుకు మన పురోగతి వేగం పెరిగింది. మనం యిప్పుడు యింకా హుందాగా వున్నాం. మరింత స్వేచ్ఛగా గాలి పీలుస్తున్నాము, మన గమ్యం స్పష్టంగా కనిపిస్తున్నది. దేశంలోని ప్రజల జీవన పరిస్థితుల అతి త్వరితంగా మెరుగౌతున్నాయి. మన పరిశ్రమ, వ్యవసాయం, శాస్త్రీయ విజ్ఞానం, సంస్కృతి గొప్ప నూతన విజయాలను సాధించాయి. ప్రభుత్వ పరిపాలనలోను, ప్రజా కార్యక్రమాల్లోను లక్షలాది సోవియట్ స్త్రీ, పురుషులు యెక్కువ పాత్రను నిర్వహిస్తున్నారని మనకు తెలుసు.

లెనినిస్టు పార్టీ గౌరవ ప్రతిష్టలను ఉన్నత స్థాయిలో నిలబెట్టామని సోవియట్ కమ్యూనిస్టులు గర్వంగా ప్రకటించుకోవచ్చు. లెనినిస్టు పార్టీ ప్రతిష్ట అపారంగా పెరిగినందుకు, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం ఉన్నత స్థాయికి చేరుకొన్నందుకు సోవియట్ కమ్యూనిస్టులు గర్వించవచ్చును. నేడు మన పార్టీ గతంలో ఎన్నడూ లేనంత ఐక్యంగా వుంది.

20వ మహాసభ రూపొందించిన లెనినిస్టు విధానాన్ని అమలుపరచడంలో, పార్టీ వ్యతిరేక శక్తులనుండి; వ్యక్తి పూజ రోజుల్లో వున్నటువంటి పద్ధతులు, అలవాట్లకు గట్టిగా అంటిపెట్టుకొని వున్న వారినుండి రివిజనిస్టులు, పిడివాదాలనుండి వచ్చిన తీవ్ర ప్రతిఘటనను మొదట్లో, యెదుర్కొనవలసి వచ్చింది. పార్టీ లెనినిస్టు విధానాన్ని, పార్టీ వ్యతిరేక

ముఠా వ్యతిరేకించింది. అందులో మొలటోవ్, కగనోవిచ్, మాలెంకోవ్, వొరొషిలోవ్, బుల్గానిన్, పెర్వూకిన్, సబురోవ్, వీరిన తదుపరి చేరిన షెపిలోవ్ వున్నారు.

వ్యక్తిపూజను ఖండించాలనీ, పార్టీలో అంతరంగిక ప్రజా స్వామ్యాన్ని పెంపొందించాలని, అన్నివిధాలైన అధికార దుర్వినియోగాన్ని ఖండించి సరిదిద్దాలనీ, నిర్బంధ చర్యలకు ప్రత్యక్షంగా బాధ్యులైన వారిని బట్టబయలు చేయాలని పార్టీ తీసుకొన్న విధానాన్ని మొదట్లో మొలటోవ్, కగనోవిచ్, మాలెంకోవ్, వొరొషిలోవ్ చాలా గట్టిగా వ్యతిరేకించారు. వారు అలాంటి వైఖరి తీసుకొనడం యాదృచ్ఛికమేమీ కాదు: పార్టీకి, ప్రభుత్వానికి ఆర్థిక, సైనిక, యువ కమ్యూనిస్టు సిబ్బంది పైని మూకుమ్మడి నిర్బంధ విధానపు అనేక ఘటనలకు, వ్యక్తి పూజ కాలంలో జరిగిన యిటువంటి ఘటనలకూ వీరు వ్యక్తిగతంగా బాధ్యులు. కేంద్ర కమిటీ అధ్యక్షవర్గంతో మొదట యీ ముఠాకు నిర్లక్ష్యం చేయతగినంత తక్కువ బలముండేది.

పార్టీలోను, ప్రభుత్వంలోను లెనినిస్టు ప్రమాణాలను మళ్ళీ నెలకొల్పాలనీ: కొత్త భూముల నభివృద్ధి చేయడం, పరిశ్రమలు, గృహ నిర్మాణంలో నిర్వహణను పునర్వ్యవస్థీకరించడం, యూనియన్ రిపబ్లిక్కుల హక్కుల విస్తృతపరచడం, ప్రజల జీవన ప్రమాణాలను మెరుగు పరచడం. విప్లవాత్మక న్యాయసూత్రాలను పునరుద్ధరించడం లాంటి అత్యవసర కర్తవ్యాలను నిర్వహించాలని పార్టీ పూనుకొనేసరికి, ఈ పార్టీ వ్యతిరేకి ముఠా తన పార్టీ వ్యతిరేక, విచ్ఛిన్నకర కార్యకలాపాలను యెక్కువ చేసింది, కేంద్ర కమిటీ అధ్యక్షవర్గంలో తనను బలపరిచేవారిని పెంచుకొనారంభించింది. బుల్గానిన్, పెర్వూకిన్, సబురోవ్, మరికొంతకాలానికి షెపిలోవ్ ఆ ముఠాతో కలిసారు. కేంద్ర కమిటీ అధ్యక్షవర్గంలో సంఖ్యాబలం సాధించామని గుర్తించి పార్టీ, దేశం రూపొందించిన విధానాన్ని, 20వ మహాసభ నిర్ణయించిన విధానాన్ని మార్చేందుకై పార్టీ వ్యతిరేక

ముఠా సభ్యులు బహిరంగంగా దాడిచేయడం ప్రారంభించారు.

ఈ ముఠా వారు తమ రహస్య సమావేశాల్లో ఒక ఒప్పందానికి వచ్చి, అధ్యక్షవర్గపు అసాధారణ సమావేశాన్ని ఏర్పరిచాలని డిమాండ్ చేశారు. తమ పార్టీ వ్యతిరేక పథకాలకు విజయం చేకూర్చుకోవచ్చని, పార్టీలోను, దేశంలోను నాయకత్వాన్ని చేజిక్కించుకోవచ్చని వారాశించారు. కమిటీ సభ్యుల ఎదుట, మొత్తం పార్టీ ఎదుట ఒక జరిగిపోయివున్న యదార్థ విషయాన్ని పెట్టాలని వాళ్ళు చూశారు.

కానీ యీ ముఠా తప్పు అంచనాలు వేసుకొన్నది. అధ్యక్షవర్గం లోని పార్టీ వ్యతిరేక ముఠా యొక్క ముఠా ఎత్తుగడల గురించి విని, అప్పుడు మాస్కోలో వుంటున్న కేంద్ర కమిటీ సభ్యులు, కమిటీ ప్లీనరీ సమావేశం వెంటనే జరపాలని డిమాండ్ చేశారు.

కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం 1957 జూన్‌లో జరిగింది. పార్టీ వ్యతిరేక ముఠాను ఆ సమావేశం బట్టబయలు చేసి, సిద్ధాంత రీత్యా వారిని ఓడించి వేసింది. 20వ మహాసభ తీసుకొన్న లెనినిస్టు విధానం ప్రాతిపదికగా గల కేంద్ర కమిటీ రాజకీయ పరిపక్వతనూ, దృఢమైన ఐక్యతనూ ఆ సమావేశం ప్రదర్శించింది. పార్టీ వ్యతిరేక ముఠా సభ్యులు, ప్లీనరీ సమావేశంలో సిద్ధాంత రీత్యా ఓడిపోయి, సమావేశంచే ఏకగ్రీవమైన ఖండన ఎదురుకాగా, తామంతా కుమ్మక్కైనామని, తమ పార్టీ వ్యతిరేక కార్యకలాపాలు ప్రమాదకరమైనవనీ ఒప్పుకొన్నారు. "ముఠాదారుల వల్ల తాను తప్పుదారి పట్టా"నని కామ్రేడ్ వొరొషిలోవ్ సమావేశంలో అంగీకరించారు, తన తప్పులు తాను పూర్తిగా గ్రహించాలని, వాటిని గట్టిగా ఖండించారు; పార్టీ వ్యతిరేక ముఠా విచ్ఛిన్న కార్యకలాపాలన్నిటినీ ఖండించారు కూడా.

పార్టీ వ్యతిరేక ముఠా మీద కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం ఏకగ్రీవంగా తీర్మానం చేసిందని మీకు తెలుసు. ఆ ముఠా సభ్యులు కూడా, మొలటోవ్ మినహా, తీర్మానానికి ఓటు చేశారు. పార్టీ ప్రాథమిక శాఖలు

ప్లీనరీ సమావేశ ఫలితాలను చర్చించుతున్నప్పుడు, కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం తీర్మానాలు సరైనవేనని తాను కూడా భావిస్తున్నట్లు మొలటోవ్ చెప్పి, వానిని అంగీకరించారు. పార్టీ వ్యతిరేక ముఠా మీద సాగించిన పోరాటం, సిద్ధాంతాలకు సంబంధించిన నిశితమైన రాజకీయ పోరాటం. అది పాత కొత్తల మధ్య జరిగిన పోరాటం, 20వ మహాసభ రూపొందించిన లెనినిస్టు విధానాన్ని పార్టీ అనుసరించడమా, లేక వ్యక్తి పూజకాలం నాటి పద్ధతులు, పార్టీ మొత్తంగా ఖండించిన పద్ధతులు పునరుద్ధరింపబడటమా అనేది ఆ సమస్య.

పార్టీ విధానాన్ని, 20వ మహాసభ ఆమోదించిన విధానాన్ని వ్యతిరేకించిన రాజకీయ నాయకుల బృందంలో పార్టీలోనో, ప్రభుత్వంలోనో చాలాకాలం ప్రముఖ స్థానాలలో వున్నవారు కొందరు వుండడంవల్ల, యీ పోరాటం చాల క్లిష్టమయ్యింది. తమ జీవితాల్లో ఒకానొక దశలో తమ శక్తిని నిరూపించుకొని ప్రముఖ పాత్రను నిర్వహించిన నాయకులు, చరిత్రలో వున్న ఘటనలు అనేకం వున్నాయి. కాని ఆ తరువాత అక్కడితో ఆగిపోయి, క్రమేపీ అడుగున పడిపోవడం ప్రారంభించారు కూడా వారు.

ఈ లక్షణం ప్రబలడానికి భిన్న భిన్న కారణాలుండొచ్చు: కొంతమంది శక్తి ఉడిగిపోతుంది; మరికొంతమంది వాస్తవానికి దూరమై అహంభావులైపోయి పని సక్రమంగా చేయలేకపోవచ్చు. మరికొందరు నియమరహితులుగానూ పందలగానూ అయిపోయి, పరిస్థితులకు అనుగుణంగా తమ ప్రవర్తనను మలుచుకొన్నవారిగానూ, పార్టీ లక్ష్యాలకై సాగే పోరాటంలో స్థైర్యరహితులుగానూ తయారు కావొచ్చు. ఈలోగా, పోరాటంలో కొత్త రాజకీయ నాయకులు ఉద్భవించుతారు. కొత్తదనం అభివృద్ధి కావడానికి ఆటంకంగా తయారైన వాటన్నింటిని వీరు వ్యతిరేకిస్తారు, పాత వాటి ప్రతిఘటనను అధిగమిస్తారు. అంతరించిపోయిన నక్షత్రాల వెలుగు అని ఖగోళ శాస్త్రజ్ఞులు చెప్పే లక్షణానికి, యిది ఒక విధంగా సరిపోలి

నది. భూమికి చాలా దూరంగా వున్న కొన్ని నక్షత్రాలు, ఏనాడో అంత రించిపోయినా కూడా మెరుస్తున్నట్లు కనిపిస్తాయి. కాలి బూడిదైపోయినా తామింకా వెలుగునిస్తున్నామని, సామాజిక పథంలో నక్షత్రాల స్థానంలో వున్న కొంతమంది భావిస్తూ వుంటారు. ఇదే వీరితో వున్న చిక్కల్లా. ముఠాతత్వంలోకి, పార్టీ వ్యతిరేక పోరాటంలోకి దిగిపోయిన కొంతమంది రాజకీయ నాయకుల పరిస్థితి సరిగ్గా యిలాగే వుంది.

జూన్‌లో జరిగిన కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం చేసిన నిర్ణయా లను మొత్తం పార్టీ, సోవియట్ ప్రజలందరు ఏకగ్రీవంగా ఆమోదించారు. కొద్ది తరవాత, 1957 అక్టోబరులో సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం అప్పటి రక్షణ మంత్రి ఝుకోవ్ ప్రయ త్నాలను గట్టిగా భగ్నంచేసింది. పార్టీనుండి సైన్యాన్ని వేరుచేయాలని, పార్టీ నాయకత్వాన్ని సోవియట్ సైన్యంచే వ్యతిరేకించేట్లు చేయాలనే దుస్సాహస చర్యకు ఝుకోవ్ తలపడ్డారు. దివాళాకోరు ముఠా తత్వవాదు లను, పన్నుగడలను పన్నే అవకాశవాదులను, పార్టీ ప్రక్కకు నెట్టి తన శ్రేణులను పటిష్టం చేసుకుంది. ప్రజలతో తన సంబంధాలను పార్టీ దృఢ పరచుకొన్నది. తన విధానాన్ని అమలు జరుపేందుకై అన్ని శక్తులను సమాయత్తం చేసింది.

20వ మహాసభ ఆమోదించిన విధానం పట్ల ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం, సోదర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలు తమ హర్షాన్ని వెలిబు చ్చాయి. ఈ విషయం సోదర పార్టీల మహాసభలు చేసిన తీర్మానాల్లోను, పార్టీల యితర పత్రాల్లోను, 1957, 1960 సంవత్సరాల్లో జరిగిన కమ్యూ నిస్టు కార్మిక పార్టీల ప్రతినిధుల మహాసభల ప్రకటనల్లోను ప్రస్ఫుట మైంది.

ఇందుకు 1960లో మాస్కోలో జరిగిన సమావేశం చేసిన ప్రకట నను ఉదహరించవచ్చు "సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ 20వ మహా సభ చేసిన చరిత్రాత్మక నిర్ణయాలు.... ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో

ఒక నూతన దశను ప్రారంభించాయి, మార్క్సిజం లెనినిజం ప్రాతిపది కల పైన దాని పురోగతికి దోహదం చేశాయి."

అయితే, వ్యక్తి పూజ దుష్ఫలితాలను తొలగించాలన్న మన పార్టీ విధానం, ఆల్బేనియా కార్మిక పార్టీ నాయకుల ఆమోదం పొందలేదని మీకు నేను చెప్పవలసి వున్నది. ఈ విషయం ఆ తర్వాత స్పష్టంగా బయటపడింది. ఆ విధానాన్ని వాస్తవానికి, వారు వ్యతిరేకించడం ప్రారంభించారు.

సోవియట్ యూనియన్, ఆల్బేనియా ప్రజా రిపబ్లిక్కుల మధ్య, సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ, ఆల్బేనియా కార్మిక పార్టీల మధ్య సంబంధాలు ఇటీవలి కాలం వరకూ బాగా వున్నాయనీ, స్నేహ పూర్వకంగా వున్నాయనీ ప్రతి ఒక్కరూ ఎరుగుదురు. ఈ విషయం అందరికీ తెలుసు కూడా. తన ఆర్థికాభివృద్ధి సాగించుకొనేందుకు, సోషలిస్టు నిర్మాణాన్ని సాగించుకొనేందుకు ఆల్బేనియాకు, మన ప్రజలు ఎలాంటి ప్రతిఫలాపేక్ష లేకుండా సర్వతోముఖమైన సహాయం చేశారు. సౌభాగ్యవంతమైన సోషలిస్టు రిపబ్లిక్‌గా ఆల్బేనియా రూపొందాలనీ, ఆల్బేనియా ప్రజలు సుఖవంతంగా, నూతన జీవితంలోని అన్ని ఫలాలను అనుభవించాలని మనం మనఃపూర్వకంగా అప్పటికీ, ఇప్పటికీ కోరుతున్నాము.

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి సంబంధించిన అన్ని విషయాల్లోను సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీతోను, సోవియట్ ప్రభుత్వంతోను అనేక సంవత్సరాలుగా, ఆల్బేనియా నాయకులు తమ సంపూర్ణ అంగీకారాన్ని తెలుపుతూ వచ్చారు. 20వ మహాసభ రూపొందించిన విధానానికి తమ ఆమోదాన్ని వారు పదేపదే వ్యక్తపరచారు. మన పార్టీ 20వ మహాసభలోను, 21వ మహాసభలోను ఆల్బేనియా కార్మిక పార్టీ కేంద్ర కమిటీ ప్రథమ కార్యదర్శి అన్వర్ హోక్సా సైతం తన ప్రసంగాల్లో దీనిని తెలియజేశారు. 20వ మహాసభ జరిగిన కొద్దికాలానికే ఆల్బేనియా కార్మిక పార్టీ తృతీయ మహాసభ జరిగింది. వ్యక్తి పూజకు వ్యతిరేకంగా

చేసిన విమర్శను, దానివల్ల కలిగిన దుష్ఫలితాలను తొలగించడానికై తీసుకొన్న చర్యలను ఆల్బేనియా పార్టీ తృతీయ మహాసభ పూర్తిగా ఆమోదించింది.

సోవియట్ ప్రజలమైన మనం ఆల్బేనియా నాయకులను నమ్మి, మన పార్టీ, ఆల్బేనియా కార్మిక పార్టీ మధ్య పరస్పరావగాహన, అభిప్రాయాల్లో ఐకమత్యం ఉన్నవని భావించాము.

అయితే ఇటీవలి కాలంలో ఆల్బేనియా నాయకులు తమ విధానాన్ని మార్చుకొన్నట్లు వాస్తవ విషయాలు తెలియజేస్తున్నాయి. ఇందుకు స్పష్టమైన కారణమేమిటో కనపడడం లేదు. ఇది గతంలో వారు యిచ్చిన హామీలకు తమ పార్టీ మహాసభ తీసుకొన్న నిర్ణయాలకు విరుద్ధం. మన పార్టీతోను, దేశంతోను సంబంధాలను తీవ్రంగా పాడుచేయడానికి ఆల్బేనియా నాయకులు పూనుకున్నారు. నేటి ముఖ్యమైన సమస్యలపై—గత సంవత్సరం మధ్యకాలంలో యిది ప్రత్యేకంగా తెలియవచ్చింది—యావత్ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమమంతా అంగీకరించిన మార్గాన్నుండి వైదొలగడం మొదలు పెట్టారు.

స్టాలిన్ వ్యక్తి పూజ దుష్ఫలితాలను పూర్తిగా తొలిగించేందుకు, అధికార దుర్వినియోగాన్ని తీవ్రంగా ఖండించేందుకు, పార్టీ, ప్రభుత్వ కార్యకలాపాల్లో లెనినిస్టు ప్రమాణాలను పునఃస్థాపించేందుకై మన పార్టీ తలపెట్టిన విధానంపట్ల తమ అసమ్మతిని ఆల్బేనియా నాయకులు యికి దాచడం లేదు.

వ్యక్తి పూజ దుష్ఫలితాలను తొలగించేందుకై 20వ మహాసభ చేసిన నిర్ణయాలను, మన పార్టీ అనుసరింపజుతున్న విధానాన్ని 1957, 1960 సంవత్సరాల్లో జరిగిన సోదర పార్టీల మహాసభలు ఆమోదించాయని మనకు తెలుసు. కాని వాటి నిర్ణయాలను ఆల్బేనియా నాయకులు లోలోపల నిరాకరించినట్టుగా కనిపిస్తూన్నది. ఆల్బేనియా నాయకులు యీ విధానాన్ని చేపట్టడానికి, మన దేశంలో వ్యక్తి పూజ రోజుల్లోని పద్ధతులనే ఆ నాయ

కులు ఇప్పుడు అనుసరించడమే కారణం. ఇందుకు మనం చాల విచార పడుతున్నాము.

వీరోచిత అల్బేనియా ప్రజల భవిష్యత్తు పట్ల ఆందోళన చెందుతూ, అల్బేనియాలో జరుగుతున్న ఘటనలను మనం గమనిస్తున్నాము. సోష లిస్టు దేశాలన్నిటితో స్నేహ సహకారాలలో ప్రధానమైన ఆసక్తి గల అల్బేనియా కమ్యూనిస్టు కార్యకర్తలు, అల్బేనియా ప్రజలందరూ అల్బే నియా నాయకులు ప్రస్తుతం అనుసరించుతున్న తప్పువిధానానికి పరిహారం చెల్లించుకోవలసి రావడం మనకు విచారకరమైన విషయం. ఈ పరిస్థితి మనకు చాల ఆందోళనకరంగా వున్నది. పెరిగిన విభేదాలను తొలగించు కొనేందుకు అవసరమైన మార్గాల కొరకై ప్రయత్నాన్ని మనమెన్నడూ మానలేదు.

మన పార్టీ 20వ మహాసభ రూపొందించిన విధానం లెనినిస్టు విధా నం. ఈ మూల విషయంపైని అల్బేనియా నాయకులకుగాని, మరొకరికి గాని ఎలాంటి మినహాయింపు మనం యివ్వలేము. 20వ మహాసభ విధా నాన్ని వదలిపెట్టడమంటే, లెనిన్ యిచ్చిన వివేకవంతమైన నిర్దేశాలను తిరస్కరించడమే అవుతుంది. స్టాలిన్ వ్యక్తి పూజ ప్రమాదాన్ని మొగ్గలో వుండగానే లెనిన్ గమనించారు. ఇది చరిత్రనుండి నేర్చుకొన్న విలువైన గుణపాఠాలను ఖాతరు చేయకపోవడమూ, తన మహా నాయకుని హెచ్చ రికను సకాలంలో పాటించకపోవడంవల్ల మన పార్టీ చెల్లించిన మూల్యాన్ని మరిచిపోవడమూ అవుతుంది.

20వ మహాసభ ఆమోదించిన విధానాన్ని వ్యతిరేకిస్తూన్న అల్బే నియా నాయకులు తమకిష్టమైన విధానాలను మన పార్టీ చేబట్టేటు చేయాలని యిప్పుడు ప్రయత్నిస్తున్నారు. కాని అవి మళ్ళీ మన దేశంలో ఏనాటికీ జరగవు. 20వ మహాసభ విధానం, కాల పరీక్షలో నెగ్గింది. అలాంటి విధానాన్ని మన పార్టీ ధృఢ సంకల్పంతో ముందుకు తీసుకొనిపోతుంది. లెనినిస్టు మార్గంనుండి మనల్ని ఎవరూ పక్కకు మళ్ళించ లేరు.

తమ స్వంత ప్రజల ప్రయోజనాలను, అల్బేనియాలో సోషలిస్టు నిర్మాణాన్ని ప్రియమైనవిగా అల్బేనియా నాయకులు భావిస్తున్నట్లయితే, సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీతోను, ఇతర సోదర పార్టీలతోను స్నేహాన్ని వాస్తవంగా వాంఛించుతున్నట్లయితే తమ తప్పుడు అభిప్రాయాలను వారు విడిచిపెట్టాలి. సోదర సోషలిస్టు కుటుంబంతో ఐక్యత, సన్నిహిత సహకార మార్గానికి, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంతో ఐక్యతా మార్గానికి వారు తిరిగి రావాలి.

మన పార్టీ తన అంతర్జాతీయ బాధ్యతలను అనుసరించి, అన్ని సోషలిస్టు దేశాలతో భుజం భుజం కలిపి అల్బేనియా సాగిపోయేందుకు, సర్వశక్తులు వినియోగించి కృషిచేస్తుంది.

మార్క్సిజం-లెనినిజం విశుద్ధత, దాని మహత్తర సూత్రాలకు చెప్పే అన్ని రకాల వక్రభాష్యాలకు రాజీలేని వ్యతిరేక దృక్పథం, మన పార్టీకి పవిత్రమైనవని యీ మహాసభ వేదికపైనుండి మనం ప్రకటిస్తున్నాము. విప్లవాశయాన్ని, ప్రజల ప్రయోజనాలను అన్నింటికంటె ఎక్కువగా కమ్యూనిస్టులు పరిగణిస్తారు. కార్మిక ప్రజల మూల ప్రయోజనాలను వ్యక్తపరచినప్పుడే, సరైన మార్గంలో నడిచినప్పుడే దాని నాయకులు అర్హులనిపించుకొంటారు. అలాంటి నాయకులు పోరాటంలో రాటుదేలి వుంటారు; ప్రజలనూ, కమ్యూనిస్టు లక్ష్యాలనూ సేవించి వారు ప్రతిష్ఠను సంపాదించుకొంటారు. వారు ప్రజలకు సేవచేస్తారు; ప్రజలచే నియంత్రణకు వారు లోనుగావాలి.

కామ్రేడ్స్, ముఖ్యమైన దేశీయ, విదేశీయ సమస్యలన్నింటినీ మన పార్టీ సమిష్టిగా చర్చించుతుంది; సమిష్టి అనుభవాన్ని దృష్టిలో పెట్టుకొనే పార్టీ నిర్ణయం తీసుకొంటుంది. ఇది లెనినిస్టు సూత్రాలను శుద్ధంగా అమలు జరపడం. కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశాలకు, సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ సమావేశాలకూ సమాలోచనకు సమర్పింపబడిన అన్ని సమస్యలను చర్చించడం మన పార్టీ సభ్యులందరూ, ప్రజలూ అనుసరించే

సూత్రంగా పరిణమించింది. పార్టీ విప్లవాత్మక న్యాయ సూత్రాలను పున రుద్ధరించడానికీ సోవియట్ ప్రజాస్వామ్యాన్ని పెంపొందించడానికి, స్థానిక పార్టీ, ప్రభుత్వ శాఖల హక్కులను విస్తృతపరచడానికి, వాటి పాత్రను పెంచడానికి, శ్రామిక ప్రజల సృజనాత్మక చొరవను ప్రోత్సహించడానికి తీసుకోబడిన చర్యలు సత్ఫలితాలనిచ్చాయి.

పార్టీ మహాసభలనుండి కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశాల వరకూ ఎన్నుకోబడిన అన్ని సంస్థలు క్రమపద్ధతిని సమావేశం అయ్యేటట్టు కేంద్ర కమిటీ ప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నది. లెనిన్ జీవించి వున్న రోజుల్లో పార్టీ మహాసభలు ఎంత తరచుగా జరిగేవో మనకు తెలుసు. సోవియట్ రాజ్యపు తొలి ఏడు సంవత్సరాల కష్టకాలంలో, ప్రతి సంవత్సరం పార్టీ మహాసభలు ఏర్పాటుచేయబడ్డాయి. పార్టీయొక్క, నూతన సోషలిస్టు రాజ్యంయొక్క ప్రధాన కర్తవ్యాలను గురించి అవి చర్చించాయి. వ్యక్తిపూజ రోజుల్లో ఆ పద్ధతికి పూర్తిగా విఘాతం కలిగింది: పార్టీ 18వ మహాసభ అనంతరం యించుమించు 14 సంవత్సరాలవరకూ పార్టీ మహాసభ ఒక్కటి కూడ జరగలేదు: దేశభక్తియుత మహా యుద్ధం, జాతీయ ఆర్థిక వ్యవస్థను పున ర్నిర్మించుకొనేందుకు తీవ్ర కృషి దేశంలో జరిగినప్పటికీ. పార్టీ కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశాలు చాల కొద్దిగా జరిగాయి, ఒక సమావేశానికి, మరొక సమావేశానికి మధ్య కాలవ్యవధి కూడా చాలా పెద్దది. అలాంటి పరిస్థితి అధికార దుర్వినియోగానికి అనుకూలమైంది. పార్టీకి, ప్రజల అదుపుకు అతీతులు కావడానికి కొందరు నాయకులకు ఆ పరిస్థితి వీలు కల్పించింది.

అలాంటి పరిస్థితి నేడు పార్టీలోలేదు: ఉండ జాలదు. 19వ మహాసభ అనంతరం తొమ్మిదేళ్ళలో 20వ మహా సభ, 21వ అసాధారణ మహాసభ ప్రస్తుతపు 22వ మహాసభ జరిగాయి. కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశాలు నిర్దిష్ట కాల పరిమితిలో జరుపబడుతున్నాయి. పార్టీ, దేశ జీవితానికి చెందిన ముఖ్యమైన సమస్యలను గురించి ఆ సమావేశాలు పరిశీలించు

తాయి. కొన్ని పార్టీ సంస్థల, వాటి నాయకుల కార్యకలాపాలను, సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ సభ్యుల, కేంద్ర కమిటీ అధ్యక్షవర్గ సభ్యుల కార్యకలాపాలతో సహా, ఆ సమావేశాలు నిశితంగా విమర్శించు తాయి. పార్టీ తమయందుంచిన విశ్వాసాన్ని నిలుపుకోలేని అధికారులను వారి పదవుల నుంచి తొలగించడం జరుగుతుంది.

ఇప్పుడు గతించిపోయిన వ్యక్తి పూజ రోజుల్లో పార్టీ, ప్రభుత్వ, ఆర్థిక నాయకత్వంలో లోపాలను దాచిపెట్టడం, పనిలో అనిశ్చిత పరిస్థితి, కొత్తదనమంటే భయం వంటి తప్పుడు పద్ధతులు విరివిగా అమలు జరి గాయి. ఈ పరిస్థితిలో చాలమంది వందిమాగధులు, భజన చేసేవారూ, తప్పుడు మాటలు చెప్పేవాళ్లు ఉద్భవించారు. పార్టీ, ప్రభుత్వ క్రమశిక్షణను భగ్నం చేసేవారినందర్నీ, పార్టీని, ప్రభుత్వాన్ని మోసగించే వారిని మన పార్టీ పట్టుదలగా ఎదుర్కొంటున్నది; ఇకమీదట కూడా ఎదుర్కొంటుంది. నియమబద్ధమైన విమర్శను, ఆత్మ విమర్శను పార్టీ ప్రోత్సహించుతుంది; వాటిని తన అతి శక్తివంతమైన ఆయుధంగా ఉపయోగించుతుంది.

పార్టీలో ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని పెంచడం వల్లా, స్థానిక పార్టీ సంస్థలకు ఎక్కువ హక్కులివ్వడంవల్ల, వాటి పాత్రకు ఎక్కువ ప్రాధాన్య యివ్వడం వల్లా, సమిష్టి నాయకత్వ సూత్రాలకు కట్టుబడి వుండడంవల్లా పార్టీ క్రియా శక్తి పెరిగింది; ప్రజలతో పార్టీ సంబంధాలు బలపడ్డాయి. పార్టీ సభ్యత్వం పెరగడం ద్వారాను, నూతన శక్తులు పార్టీలో నిరంతరం ప్రవేశించడం ద్వారాను, ప్రజలతో పార్టీకి గల అవిచ్ఛిన్నమైన సంబంధాలు స్పష్టపడుతున్నాయి.

సమీక్షింపబడుతోన్న కాలంలో పార్టీ సభ్యత్వం అదనంగా దాదాపు 25 లక్షలు పెరిగింది. 20వ మహాసభనాటికి పార్టీ సభ్యత్వం 72 లక్షల 15 వేల 505. కాని యీ మహాసభకు కాస్త ముందరసరికి (1961 అక్టో బరు 1వ తేదీ) పార్టీ సభ్యత్వం 97 లక్షల 16 వేల 5కు పెరిగింది. పార్టీ సభ్యుల సంఖ్యలో పరిశ్రమల్లో పనిచేసే కార్మికులు 40.7 శాతం మంది;

సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతుల సంఖ్య 22.7 శాతం; కార్యాలయాల్లోను, వృత్తుల్లోను పనిచేసేవారి సంఖ్య 35.6 శాతం; విద్యార్థుల సంఖ్య ఒక్క శాతం. పార్టీలోనికి చేర్చుకోబడిన కార్యాలయాల్లోను, వృత్తుల్లోను పనిచేసే వీరు ఎవరు? వారిలో యించుమించు మూడింట రెండు వంతులు ఇంజనీర్లు, సాంకేతిక నిపుణులు, వ్యవసాయ శాస్త్రజ్ఞులు, పశు ప్రజనన నిపుణులు, ఇతర ప్రవీణులు.

ఆఫీసు, వృత్తి పనివారలంటే అర్థమే మారిపోయిందని నేను చెప్పవలసి వుంది. విప్లవానికి ముందు రోజుల్లో సంపద కలిగిన వర్గాలకు చెందినవారే, సోవియట్ ప్రభుత్వపు మొదటి రోజుల్లో బుద్ధిజీవులుగా వుండేవారు. అందువల్ల ఆఫీసు, వృత్తి పనివారల విషయంలో, కొన్ని ఆంక్షలతో కూడిన చర్యలు తీసుకోబడ్డాయి. ఇప్పుడు పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. ఇప్పుడు వృత్తి, ఆఫీసు పని వారల్లో అత్యధిక సంఖ్యాకులు గతంలో పరిశ్రమలో పనిచేసిన కార్మికులు, లేదా సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లోని రైతులు లేక వారి పిల్లలు. అందువల్ల వృత్తి, ఆఫీసు పనివారల పట్ల వైఖరి కూడా మారింది. శాస్త్రీయ విజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞానం, ఉత్పత్తిలో స్వయంచోదన, యాంత్రికీకరణ వృద్ధి అయ్యేకొద్దీ ఆఫీసు, వృత్తి పనివారలనబడే తరగతి పెరుగుతుంది, ఉత్పత్తిలో అధికాధికంగా మరింత ముఖ్యమైన పాత్రను నిర్వహించుతుంది. పార్టీ సభ్యులను పారిశ్రామిక కార్మికులు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతులని, వృత్తి, ఆఫీసు పనివారలని విభజించవలసిన అవసరం లేకుండా పోయే కాలం వస్తుంది. ఎందుకంటె అప్పుడు వర్గభేదాలన్ని పూర్తిగా నశించిపోతాయి. అంతా కమ్యూనిస్టు సమాజంలో సభ్యులుగా వుంటారు.

కామ్రేడ్స్, మన పార్టీ సభ్యులలో విద్యాధికుల సంఖ్య పెరుగుతూ వున్నదని చెప్పడానికి సంతోషంగా వుంది. నేడు ప్రతి ముగ్గురు కమ్యూనిస్టుల్లోను ఒకరు ఉన్నత విద్య, లేక సెకండరీ విద్యను అభ్యసించినవారే. పార్టీ సభ్యులు, కాండిడేట్ సభ్యులు అందరిలో 70 శాతానికి పైగా

భౌతిక ఉత్పత్తి రంగంలో పాల్గొంటున్నారు. ఇది ముఖ్యంగా గమనించ తగింది. అత్యధిక సంఖ్యాక కమ్యూనిస్టులు పారిశ్రామిక, వ్యవసాయ రంగాలాంటి కీలకమైనవాటిలో పనిచేస్తున్నారు.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీలో సోవియట్ దేశంలోని నూటికి పైగా జాతులకు, తెగలకు చెందిన వారు వున్నారు. కార్మిక వర్గ అంతర్జాతీయ సంస్థగా మన పార్టీ అవతరించింది; కమ్యూనిజం నిర్మాతల సన్నిహిత కుటుంబంగా ఏర్పడిన సమాన సోషలిస్టు జాతుల బృహత్తర ఐక్యత, సోదర మైత్రి దీనిలో గర్భితమైనాయి.

కమ్యూనిజం కొరకై నిస్వార్థంగా సేవచేయడం, ప్రతి లెనినిస్టు పార్టీ సభ్యుని ముఖ్య కర్తవ్యం. కమ్యూనిస్టు తన బాధ్యతను అతి దీక్షతో నిర్వహించాలి. ప్రజల ప్రయోజనాలకై నిండు మనస్సుతోను, నిండు హృదయంతోను పనిచేయాలి. తన ఉన్నత బాధ్యతల కనుగుణంగా జీవించలేని సభ్యుడికి పార్టీలో స్థానం లేదు. గత ఆరుసంవత్సరాల్లో రెండు లక్షల మందికి పైగా సభ్యులు, వివిధ కారణాల వల్ల పార్టీనుండి తొలగించబడ్డారు. యాదృచ్ఛికంగా పార్టీలో వుండడం సంభవించిన వారిని తొలగించడం వల్ల, పార్టీ గట్టిపడింది, సంఘటిత మయ్యింది.

పార్టీ సభ్యత్వాన్ని, పైకి పోవడానికి ఒక మార్గంగా పరిగణించే వారింకా వున్నారని అంగీకరించాలి. ఏ ఎండకా గొడుగు పట్టే ఇలాంటి వారినుండి పార్టీని రక్షించుకోవడమెలా ? విప్లవపు మొదటి సంవత్సరాల్లోను, దేశభక్తియుత మహా యుద్ధ కాలంలోను కమ్యూనిస్టులు అగ్ని పరీక్షలను గడిచారు. అంతర్యుద్ధ కాలంలో జరిగిన ఒక ఘటనను యిది నాకు గుర్తుకు తెస్తున్నది. ఎర్ర సైన్యం విముక్తి చేసిన ఒక గ్రామానికి మా యూనిట్ వెళ్ళింది. అక్కడొక స్థానిక పాఠశాల ఉపాధ్యాయుడు నన్నిలా అడిగాడు :

"బోల్షివిక్ పార్టీలో చేరితే నాకేమి ఉద్యోగమిస్తారు ?"

"మీకు చాల గౌరవప్రదమైన ఉద్యోగమిస్తాము. మీకొక రైఫిల్

ఇస్తాము: బూర్జువాలకు వ్యతిరేకంగా, సోవియట్ అధికారం కొరకై పోరాడడం కోసం మిమ్ము పంపుతాము," అన్నాను.

"లేదు, లేదు. అలాంటి పని నాకు సరిపడదు," అన్నారాయన.

దీనితో అంత స్పష్టంగా తేలిపోయింది. అక్టోబరు మహా విప్లవం సాధించిన విజయాలను ధైర్యంతో రక్షించినటువంటి, పార్టీ లక్ష్యాలకై పోరాడినటువంటి మేధావులు, చాలమంది ఉపాధ్యాయులతో సహా మన పార్టీలో వుండినారని మీకు తెలుసు.

నేడు కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికై కృషి యిప్పుడు ఉవ్వెత్తున సాగుతున్నందున, పార్టీలో చేరేవారందరూ, కమ్యూనిస్టు నిర్మాణంలో ప్రతి చోటా ముమ్మందు నిలబడాలని మనం చెప్పాలి. శ్రమ విషయంలో కమ్యూనిస్టుల వైఖరి ఎలా వుంటుందో, కమ్యూనిస్టు సభ్యులంతా ఆదర్శాన్ని, పార్టీ సూత్రాల ప్రకారం విధిగా నెలకొల్పాలి; సిద్ధాంతాలపట్ల అత్యంత విధేయతను చూపించాలి; అన్ని లోపాలకు, డబ్బు మింగే తత్వానికి, ఇతరుల శ్రమపై ఆధారపడి జీవించే తత్వానికీ వ్యతిరేకంగా రాజీలేని దృక్పథాన్ని అవలంబించాలి; ఇతరుల పట్ల సానుభూతితో వుండాలి; పార్టీకీ, ప్రజలకూ విధేయంగా వుండాలి. ఉన్నతమైన కమ్యూనిస్టు నైతిక సూత్రాలను స్థాపించేందుకు జరిగే కృషిలో కమ్యూనిస్టు ఒక ఆదర్శవంతుడుగా వుండాలి.

అందువల్ల వ్యక్తిగతంగా ఎంపిక చేసే సూత్రానికి పార్టీ శాఖలన్నీ గట్టిగా కట్టుబడి వుండాలి; సభ్యత్వానికి దరఖాస్తు పెట్టుకొన్న వారి వ్యక్తిగత లక్షణాలను పూర్తిగా పరిశీలించాలి. ఉత్తమ శ్రేణికి చెందిన కార్మికులను, సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతులను, మేధావులను పార్టీ సభ్యులుగా చేర్చుకొనడాన్ని మనం కొనసాగించాలి. అంటే సోవియట్ సమాజంలోని అత్యుత్తమ పౌరులను పార్టీ సభ్యులుగా చేర్చుకొనాలన్నమాట.

దాదాపు ఒక కోటి సభ్యత్వమున్న మన పార్టీ, లెనిన్ ఆదేశాన్ని ఒక పవిత్ర కర్తవ్యంగా నిర్వర్తించుచూ వుంటుంది—కమ్యూనిస్టు అన్న ఉన్నత గౌరవాన్ని నిలబెడుతూనే వుంటుంది.

## 2. పార్టీ నిర్మాణ కృషి, కార్యకర్తలకు శిక్షణ. ప్రజా హిత కార్యక్రమాల్లో సామాన్య ప్రజలు చురుగ్గా పాల్గొనడం నూతన విజయాలకు కీలకం.

కాంగ్రెస్, ఇటీవలి సంవత్సరాల్లో జాతీయ ఆర్థిక వ్యవస్థను ఏ పద్ధతుల్లో ముందుకు తీసుకొనిపోవాలి అన్న ఆచరణకు సంబంధించిన సమస్యల పట్ల పార్టీ శ్రద్ధ వహిస్తున్నది. పార్టీ సంస్థలు, ముఖ్యమైన కార్యకర్తలు పారిశ్రామిక వ్యవసాయ, రంగాల్లో లోతైన పరిశీలన చేయడంలోను, వాటిలో అభివృద్ధికరమైన పద్ధతులను విరివిగా ప్రవేశ పెట్టడంలోను శ్రద్ధ వహించేట్టుగా కేంద్ర కమిటీ చేసింది. కమ్యూనిస్టు సమాజ నిర్మాణ మహా కార్యక్రమాన్ని ఎలా నిర్వహించాలో కొన్ని స్పష్టమైన ఉదాహరణలు కేంద్ర కమిటీ సూచించింది.

పార్టీ అధికారి పనిని ఎలా విలువ కట్టాలి? ఒక అధికారి నిపుణుడైన, శక్తివంతుడైన ఆర్గనైజర్ అని చెప్పడానికి గాని, మరొకరిని చీవాట్లు పెట్టి, విమర్శించడానికి గాని ఎలాంటి కొలబద్దను ఉపయోగించాలి? ఉక్కు కరిగే కార్మికుని పని, రైతు చేసిన పని, ఒక గృహనిర్మాణ కార్మికుడు చేసిన పని, వాటి వాటి గుణాలను, రాసులనూ కూడా నిర్ణయించడం తేలికైన పనే నన్నది తెలిసినదే. పరిశ్రమల్లోనో, నిర్మాణాల్లోనో, సమిష్టి క్షేత్రాలలోనో, ప్రభుత్వ క్షేత్రాల్లోనో, పరిశోధనా సంస్థలలోనో, జిల్లా, ప్రాంతీయ, రిపబ్లిక్‌లలో తాము బాధ్యత వహించి చేసిన పనిలోనో పార్టీ అధికారుల పనిని వారు సాధించిన నిర్దిష్ట ఫలితాల దృష్ట్యానే అంచనా వేయాలి.

నిర్మాణ కార్యక్రమం విజయం, నాయకత్వ స్థాయి చాలవరకు నాయకులకు, సామాన్య ప్రజలకు మధ్య ఉండే సంబంధాలపైన, ప్రధానమైన సమస్యల పరిష్కారంకోసం మానవ కృషిని సమీకరించి నడిపించడానికి శక్తి సామర్థ్యాలపైన చాలవరకూ ఆధారపడేవుంటాయి. ఏమైనా

ప్రజలతో ఉండే సంబంధాల్లో లేదా ఉండొచ్చు: అవి లోతైనవి, శాశ్వతమైనవి కావొచ్చు; లేక పైపైవి, లేదా తాత్కాలికమైనవి కావొచ్చు. ప్రజలతో సన్నిహిత సంబంధాలు పెట్టుకొని వుండాలంటే పార్టీ కార్యకర్త చాల సుగుణాలు కలిగి ఉండాలి. తాను ఏ రంగంలో పనిచేస్తున్నాడో, అందుకు సంబంధించిన విషయ పరిజ్ఞానం; ఆర్థిక, సాంస్కృతిక నిర్మాణాలకు సంబంధించిన అనేక హంశాల పట్ల అభివృద్ధి కాముక దృక్పథం వాటిలో కొన్ని. జీవితంతో రానురాను ఎక్కువ సన్నిహిత సంబంధాలను పెట్టుకొంటూ నాయకుడు తన జ్ఞానాన్ని వృద్ధిచేసుకోవాలి. పారిశ్రామిక, వ్యవసాయ రంగాల్లో కొత్త విషయాలను కనిపెట్టినవారి అభ్యుదయకర అనుభవాన్ని అధ్యయనం చేయాలి; శాస్త్రీయ, సాంకేతిక రంగాల్లో సాధించిన విజయాలను నాయకులు అధ్యయనం చేయాలి; ఆ విధంగా తన విజ్ఞాన సంపదను నాయకుడు పెంపుచేసుకోవాలి. అలాంటి విజ్ఞానాన్ని సంపాదించుకోవాలంటే పార్టీ అధికారి, జీవిత సమస్యలను మార్క్సిస్టు దృష్టిపథంతో నిరంతరం పరిశీలించాలి; కొత్త విషయాలను గమనించడం పట్ల ఎక్కువ శ్రద్ధవహించాలి; కొత్త విషయాన్ని సమర్థించడానికి, వాటిని అమలు జరపడానికి తోడ్పడాలి.

దీని అర్థం అన్ని రంగాల్లోను పార్టీ నాయకుడు నిపుణుడుగా తయారు కావాలని కాదు. నిజమే, అతడు చాలా తెలుసుకొని వుండాలి; బాగా చదివినవాడై వుండాలి; అనేక విషయాలు తెలుసుకొన్నవాడై వుండాలి; అయితే అతడు తాను పనిచేసే రంగంలో మాత్రం సమగ్రమైన విజ్ఞానం కలిగి ఉండటం చాలా ముఖ్యం. ప్రజలను క్షుణ్ణంగా అతడు అర్థం చేసుకోవాలి; వారితో సంతోషపూర్వకంగా కలిసి పనిచేయాలి. పార్టీ నాయకత్వ బలం, దాని సమిష్టితత్వంపై ఆధారపడి వుంటుంది; అది అనేకుల ప్రజ్ఞావిశేషాలను, జ్ఞానాన్ని, అనుభవాన్ని ఒకే మూసలోకి తీసుకరావడానికి తోడుపడుతుంది; తద్వారా ఘనకార్యాలను సాధించ వీలౌతుంది.

నిర్మాణం, రాజకీయ కృషిలో పార్టీ ప్రాథమిక శాఖలు, జిల్లా కమిటీలు నిర్వహించే పాత్రను హెచ్చించవలసిన అవసరాన్ని గురించి 20వ మహాసభ నిర్ణయాలు తెలియజేశాయి. ఆర్థిక, సాంస్కృతిక కార్య కలాపాలకు చెందిన అతి వివిధమైన, తీక్షణమైన సమస్యలను చర్చించేవి యీ ప్రాథమిక, జిల్లా శాఖలే. ప్రాథమిక శాఖలు పార్టీకి వెన్నెముక లాంటివి: ప్రజలలో నిత్య కార్యకలాపాలపై పనిచేసేవి యివే. పరిశ్రమల్లో మొత్తం 41 వేల 830 పార్టీ ప్రాథమిక శాఖలు నేడున్నాయి; నిర్మాణ ప్రదేశాల వద్ద 10 వేల 427 ఉన్నాయి; రైల్వేలు, ఇతర రవాణా సర్వీసుల్లో 18 వేల 938 శాఖలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో 44 వేల 387 శాఖలు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లో 9 వేల 206 శాఖలు ఉన్నాయి. ఈ దిగువ పార్టీ శాఖల నిర్మాణ, రాజకీయ కృషి స్థాయి పైనే చాలవరకు మన ఆశయ సాధన ఆధారపడి వుంది.

ప్రాథమిక శాఖలు చేసే పని స్థాయి పెంచేందుకై, దేశీయ, విదేశీయ విధానంలో తీసుకొన్న అతి ముఖ్య చర్యలనుగురించి, సైద్ధాంతిక విషయాలు, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి సంబంధించిన ప్రశ్నలను గురించి కమ్యూనిస్టులకు పదే పదే సమాచారం కేంద్ర కమిటీ అందజేస్తూ ఉన్నది. కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన తక్షణ సమస్యలను వివరిస్తూ పార్టీ ప్రాథమిక శాఖలకు, జిల్లా కమిటీలకు కేంద్ర కమిటీ లేఖలను చాలా సందర్భాల్లో వ్రాసింది.

కమ్యూనిస్టులమైన మనకు పార్టీ పనికంటె ఆసక్తిదాయకమైందిగాని, అంతకంటె ముఖ్యమైందిగాని లేదని మనమంతా చెప్పగలము. ప్రజలతో నిత్య సంబంధాలు పెట్టుకొ ప డ ం దీని ముఖ్యాంశం. అలాంటి పనికి మన సర్వశక్తులు వినియోగించి కృషిచేయాలి: ఒక పని ఎక్కువ ప్రాధాన్యం కలదా; లేదా అనే విభజన మనకక్కరలేదు. మనవద్దకు యితరులెవరైనా వస్తే, వారే పనిమీద వచ్చినప్పటికీ, వారి పట్ల మనం శ్రద్ధ వహించాలి. విశాలమైన మన స్తత్వంతో ప్రవర్తించాలి; ఏ సమస్య

నైనా పార్టీ సిద్ధాంతాల ప్రాతిపదికపై పరిశీలించాలి; ప్రజలతో సంబంధాలను వదులుకోరాదు, పార్టీ పట్ల, ప్రజల పట్ల మనకుగల బాధ్యత, విధి యిటువంటివి. అలాంటి ఉత్సాహకరమైన సృజనాత్మక కృషే ప్రజల హృదయాల్లో ఉత్తేజాన్ని రేకెత్తించగలదు; శ్రమ, పోరాట రంగాలలో ఘనకార్యాలను సాధించేందుకై ప్రజలను ఉత్తేజపరచగలదు.

సభ్యుల కార్యకలాపాలు, వారి రాజకీయ చైతన్యం, వారి క్రియాశీలకమైన ఐక్యత మొదలైనవాటినుండే పార్టీకి బలం చేకూరుతుందని మనమెల్లప్పుడూ గుర్తుంచుకోవాలి. పార్టీ పని ముఖ్యంగా ప్రజా కార్యక్రమాలలో ఒక భాగమే; దానిలో చురుగ్గా పాల్గొనడం ప్రతి కమ్యూనిస్టు విధి. కమ్యూనిస్టు సమాజం వైపుకు మనం పురోగమిస్తున్నాము; ఆ సమాజంలో సమాజ వ్యవహారాలను ప్రత్యేకమైన ప్రభుత్వ యంత్రాంగం లేకుండా ప్రజలు నిర్వహించుకొంటారు.

మన దేశంలో సోషలిస్టు ప్రభుత్వ యంత్రాంగం, ప్రజలచే నిర్వహించబడే స్వయంపాలిత ప్రభుత్వంగా క్రమేణా రూపొందుతున్నది. కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించుకొంటున్న ప్రజలకు అగ్రగామిగా మన పార్టీ, తన ఆంతరంగిక వ్యవహారాలను రూపొందించడంలో కూడా అగ్రగామిగా ఉండాలి; కమ్యూనిస్టు ప్రజా స్వయంపాలిత ప్రభుత్వానికి చెందిన అత్యంత శ్రేష్ఠమైన రూపాలను రూపొందించడంలో మన పార్టీ ఒక ఆదర్శాన్ని సృష్టించాలి. ఆచరణలో దీని అర్థం పార్టీ సంస్థలలో డబ్బు తీసుకొని పనిచేసే కార్యకర్తల సంఖ్యను ఉదాహరణకు, నిరంతరంగా తగ్గించాలి; డబ్బు తీసుకోకుండా పనిచేసే కార్యకర్తల సంఖ్య బాగా పెరగాలి. స్వచ్ఛందంగా, ప్రతిఫలం తీసుకోకుండా పనిచేసే కమిషన్లూ, డిపార్టుమెంట్లూ, బోధకులూ, కార్యదర్శులు జిల్లా, నగర కమిటీలలో ఎక్కువగా అవసరం. సామాన్య ప్రజలతో బలమైన సంబంధాలు, ప్రజలతో నిత్య సంబంధాలు పెట్టుకొనడం లెనిన్ స్వభావాలు; ప్రజలతో కలసి నివసించాలని, వారితో కలిసి పనిచేయాలనే కోర్కె పార్టీ నాయకుల్లో వుండాలి; ప్రజల

సుఖ, దుఃఖాలలో నాయకుడు పాలుపంచుకోవాలి; కొత్త అభ్యుదయకర మైన వాటన్నింటినీ స్వీకరించాలనే కమ్యూనిస్టు వాంఛ కమ్యూనిస్టు నాయకునిలో తప్పనిసరిగా ఉండాలి.

కామ్రేడ్స్, అన్ని కార్యరంగాలలోను పరిణతి పొందినటువంటి, సిద్ధాంతరీత్యా అనేక పరీక్షలకు నెగ్గినటువంటి కార్యకర్తల ననేక మందిని పార్టీ తయారుచేసింది. ప్రజలకు నిస్వార్థంగా సేవచేయడమే తమ అత్యుత్తమ బాధ్యతగా వీరు ఎంచుకొంటారు. గతంలో సూచనలకొరకు, ఆజ్ఞల కొరకు అన్ని సందర్భాలలోను చాలమంది స్థానిక పార్టీ అధికారులు పై కమిటీల వైపుకు చూసేవారు; తమ స్వంత చొరవను ప్రదర్శించడానికి అవకాశాలు తరచు వారికి లేకుండా పోతూండేవి; కాని యిప్పుడు పరిస్థితి మెరుగైంది; స్థానిక పార్టీ సంస్థలకు అధికారాలు, బాధ్యతలు హెచ్చించడంవల్ల, అవి ఎక్కువ స్వతంత్రంగాను, సమస్యలపట్ల ఎక్కువ సృజనాత్మక దృక్పథంతోను పనిచేస్తాయని యిప్పుడు భావించబడుతోంది. అలాంటి కార్యకర్తలు మనకిప్పుడున్నారు; పని అంతటికీ రూపాన్ని కల్పించేది వారే.

అయినప్పటికీ పనిలో ఎలాంటి శక్తియుక్తులను, చొరవనూ చూపించని పార్టీ అధికారులింకా వున్నారు; తమ పరిశ్రమకు, జిల్లాకు, ప్రాంతానికి, లేదా రిపబ్లిక్‌కు వీరు అలవాటుపడిపోయారు; వాటినే పట్టుకొని వెనుకను వేళ్ళాడుతుంటారు. అలాంటివారు ఎక్కువ పనిచేయాలని, మనమింకా తగినంతగా వారి యెదుట పెట్టడంలేదు; తమ పదవులను అలాంటివారు చాలాకాలం అంటిపెట్టుకొని వుంటున్నారు. ఏదైనా ఒక పరిశ్రమ తన నెలసరి, లేదా మూడు నెలల ప్రణాళికలను జయప్రదం చేయలేకపోతే, ఆ పరిశ్రమ డైరక్టరు ఎక్కువకాలం ఆ పదవిలో ఉండటానికి వీల్లేదన్నది స్పష్టమే. ఒక పరిశ్రమ ప్రణాళిక నెరవేరలేదంటే, అది సహించడానికి వీల్లేని, సమ్మతించరాని విషయం.

వ్యవసాయ రంగంలో నాయకత్వం వహించే కార్యకర్తలకు అన్ని

వేళలా యీ సూత్రాన్ని వర్తింపచేయడం లేదెందుకని? ప్రణాళికా లక్ష్యాలను నెరవేర్చకుండా వుండడానికి "హక్కు"ను "సాధించుకొన్న" సమిష్టి వ్యవసాయ క్షేత్రాలేగాక, జిల్లాలకు జిల్లాలే, ప్రాంతాలకు ప్రాంతాలే మనకు ఉన్నాయి. "హక్కు," తినడానికేగాని ఉత్పత్తి చేయడానికి కాదు. వారు తినేవారే ఎందుకవుతారంటే, వారి వ్యవసాయ పద్ధతులు చాల వెనుకబడివున్నాయి, ఒక్కొక్క హెక్టారుకు ఐదునుండి ఏడు సెంట్నర్ల ఓట్ల పంటకు వాళ్ళు తృప్తిపడతారు. కిరోవ్ ప్రాంతంలోని పరిస్థితిని గురించి నేనింతకు ముందే ప్రసంగించాను. ఎనిమిదేళ్ళకు పైగా అక్కడి ప్రాంతీయ కమిటీకి కామ్రేడ్ ప్చెల్యకోవ్ కార్యదర్శిగా ఉండి పనిచేస్తున్నారు. తన పనిలో ఆయన తీవ్రంగా విఫలమయ్యాడు, అనేక తప్పులు చేశాడు. అందువల్ల చివరికి ఆ పదవినుండి ఆయనను తొలగించితే, ఆయనకు ఆశ్చర్యం కలిగించింది; తనను పదవినుండి తొలగించడానికి కారణమేమిటో, అందుకాధారమేమిటో తెలియజేయవలసిందిగా ఆయన సంజాయిషీ అడిగారు. కాని అలాంటి వ్యక్తి పార్టీ నాయకుడుగా ఎలా వ్యవహరించగలరు?

తరువాత, నాయకత్వం వహించే మరోరకమైన కార్యకర్తలున్నారు. వీళ్ళు ప్రభుత్వపు ఖర్చుమీద బ్రతకాలని చూస్తారు. వీరిలో పరిశ్రమల డైరెక్టర్లు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల అధ్యక్షులు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల మేనేజర్లు, తదితర శాఖల మేనేజర్లు వున్నారు; వీరంతా ఉత్పత్తి పథకాలను తగ్గించవలసిందంటూ, కాని వేతనాలు, పెట్టుబడి పెంచవలసిందంటూ ప్రతి ఏదీ కోరుతుంటారు. అలాంటి అధికారులు నిజమైన నాయకులుగా పరిగణింపబడరు. ఎందుకంటె వారు బాగా పని చేయడంలో ప్రజలను సమాయత్తపరచరు; తాము ఆదర్శవంతంగా పనిచేయడం ద్వారా ప్రజలను ఉత్తేజపరచరు; ప్రజలలో ఇతరులపై ఆధారపడే మనస్తత్వాన్ని కలుగజేస్తారు గాబట్టి. ఇలాంటి నాయకులు తాము కమ్యూనిస్టులమేనని భావిస్తారు. అన్ని పరిశ్రమలూ, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ

క్షేత్రాలన్నీ ఉత్పత్తి లక్ష్యాలను తగ్గించవలసిందనీ, ఎక్కువ ధనాన్ని కేటాయించవలసిందనీ కోరితే ఫలితాలెలా వుంటాయో ఒకసారి ఆ నాయకులు బాగా ఆలోచించితే, అలాంటి దృక్పథంతో మనం అభివృద్ధి సాధించలేమని గ్రహించగలుగుతారు. సోవియట్ యూనియన్‌లోని ప్రతి ఉత్పత్తి కేంద్రమూ, స్త్రీ, పురుషులందరూ కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి తమ శక్తికొలదే తోడ్పడినప్పుడే అన్నింటినీ సమృద్ధిగా ఉత్పత్తి చేయ సాధ్యపడుతుంది; ఏడాదికేడాది పెరుగుతున్న ప్రజావసరాలను తీర్చ గలుగుతాము. ఈ విషయాన్ని ప్రతి ఒక్కరూ స్పష్టంగా అర్థం చేసుకోవాలి.

గర్వంతో విర్రవీగే అధికారులవల్ల, మన ఆశయానికి ఎంతో నష్టం కలిగింది. తమ వృత్తి నైపుణ్యాన్ని పెంచుకొనడం, సైద్ధాంతిక, రాజకీయ పరిజ్ఞానాన్ని పెంచుకొనడం నిర్లక్ష్యం చేసేవారు వీరిలో చాలా తరచుగా కనిపిస్తుంటారు. ఫలితంగా వీరు దుష్ట రాజకీయ చర్యలలోకి దిగుతారు; చిల్లర అమ్మకం చేసే వాళ్ళగాను, వదరుబోతులుగానూ తయారౌతారు.

కామ్రేడ్స్, కార్యకర్తలతో పని చేయడం, సరైన కార్యకర్తలను ఎంచుకొనడం, వారికి సరైన శిక్షణ నివ్వడం చాల క్లిష్టమైన పని; అందుకు నేర్పరితనం అవసరం. ఒక ఉన్నత పదవికి ఒక వ్యక్తిని పంపితే, అందుకు తగినట్లుగా అతడు వ్యవహరించలేకపోవడం జరగవచ్చు. అందుకనేక కారణాలుండవచ్చు. అన్ని సందర్భాలలోను ఆ వ్యక్తిపైనే నింద వేసేటట్లుగా, ఆ కారణాలుండవు. అయితే ఉన్నత పదవికి పంపడం పొరపాటేనని, పని దెబ్బతింటుందనీ స్పష్టమౌతుంది. ఆ పొరపాటును సరిదిద్దుకోవాలనడం స్పష్టమే. కాని గతంలో తాను బాగా నిర్వహించుతున్న పనిలోకి తిరిగి వెళ్ళడానికి యిటువంటి అందరు కామ్రేడ్స్ ఒప్పుకోరు. వాస్తవం చెప్పాలంటే, అది, అసంభవం కూడా. ఎందుకని? దానికి కారణమిది: ప్రాంతీయ, రిపబ్లికన్, లేదా చివరకు యూనియన్ స్థాయి

లోని కార్యకర్త అని పిలిపించుకోబడే హక్కు ఒకసారి సంపాదించు కున్న తర్వాత, తాను నిజంగా చేయదగిన పని అప్పగిస్తే అతడు చచ్చే టంత దాకి ప్రారంభిస్తాడు. ఇలాంటి పరిస్థితిలో తనకు ఎత్తయిన గుర్రం మీద స్వారీ చేయడం, అహంభావాన్ని, తల బిరుసుతనాన్ని ప్రదర్శించడ మంటే, పార్టీ సభ్యుడికి ఉండతగని లక్షణాలను చూపించడమే.

అనుభవం కలిగినటువంటి, పార్టీ విధానంకొరకు పోరాటపరీక్షలలో నిలబడ్డటువంటి పాత నాయకులను, తమరంగంలో మంచి జ్ఞానం కల శక్తివంతులైన యువ కార్యకర్తలను మిశ్రితం చేయడం లెనినిస్టు సూత్రం. కార్యకర్తలతో వ్యవహరించే సందర్భంలో యీ సూత్రాన్ని ఖచ్చితంగా పాటించాలి. మన కృషిలో పని ఎక్కడ కుంటుపడకుండా నిరంతరం కొనసాగేట్టు చూడాలి. ఎందుకంటే దానివల్ల పార్టీ సుసాంప్రదాయాలు రక్షించడానికి, అభివృద్ధి పరచడానికి వీలవుతుంది. యువశక్తులు పార్టీ లోనికి రావడానికి ప్రోత్సాహం కల్పిస్తుంది. యువ శక్తులకు కొత్తదనం పట్ల నిశితమైన దృష్టి వుంటుంది. వారిలో చొరవ, పనిని త్వరగా చేసే శక్తి వుంటుంది. తప్పు రిపోర్టులు ఇచ్చేవారిని గాని, కిరుడుకట్టిన దురధి కారులను గాని, పార్టీ నాయకత్వం స్థానంలో వుంచడం, సమ్మతించరాని విషయం. తప్పు రిపోర్టుల నివ్వడాన్ని, ఇతర మోసపు పనులు చేయడాన్ని పార్టీ శక్తి నంతటిని, సోవియట్ న్యాయశాస్త్ర శక్తి నంతటిని వినియో గించి ఖండించబడతాయి.

మన పార్టీ, సోవియట్ ప్రజలు ప్రజ్ఞా సంపన్నులు. వివిధ పార్టీ ప్రభుత్వ శాఖల పనికి, ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో పనిచేయడానికి ప్రజలను నియమించి శిక్షణ యివ్వడం పార్టీ సంస్థల ప్రధాన బాధ్యత. జీవిత పాఠశాల, ఆచరణ కార్యకలాపాల పాఠశాల చాలా మంచి శిక్షణను, ఉత్తమమైన రాజకీయ విజ్ఞానాన్ని యిస్తాయి. పార్టీ విధానాన్ని అమలు జరిపే పోరాటం, కమ్యూనిస్టు సమాజ నిర్మాణ సమస్యల పరిష్కారం పార్టీలోను, ప్రభుత్వంలోను లెనినిస్టు తరహాకు చెందిన కార్యకర్త కుండ

వలసిన గుణాలను కలుగజేసి, అభివృద్ధి చేస్తాయి. అలాంటి కార్యకర్తలను మనం పట్టుదలతో తయారు చేసుకోవాలి.

కాంగ్రెస్, పార్టీ, ప్రభుత్వ, ప్రజా నియంత్రణ పైనుండి క్రిందికి, క్రిందినుంచి పైకి ఏర్పరచే సమస్యకు ప్రస్తుతం ఎక్కువ ప్రాధాన్యముంది. కమ్యూనిస్టు సమాజ నిర్మాణంలో నాయకత్వాన్ని శ్రేష్ఠం గావించడానికి నియంత్రణ ఒక గట్టి సాధనం. ఒక సంస్థ యొక్క, ఒక అగ్ర పార్టీ సంస్థ యొక్క పనిని అంచనా వేయాలంటే, ప్రప్రధానంగా సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమాన్ని, నిబంధనలను, పార్టీ యిచ్చిన ఆదేశాలను ఏవిధంగా ఆ సంస్థలు ఆచరణలో పెట్టాయనే దాన్ని గీటురాయిగా తీసుకోవాలి.

పార్టీ నిర్ణయాలు ఎంతవరకు అమలు జరిగాయో చూడటానికి పర్యవేక్షణ, అజమాయిషీలకు లెనిన్ సోవియట్ పరిపాలన ప్రారంభ దినాలలోనే ఎంతో ప్రాముఖ్యం యిచ్చారంటే, మన జాతీయ ఆర్థిక వ్యవస్థ బ్రహ్మాండంగా విస్తరించిన నేటికాలంలో మనం ఆ విషయాలను గురించి ఎంత జాగ్రత్త వహించాలి! తన అజమాయిషీలో వున్న పెద్ద యంత్రం పని చేసే తీరును నాడీ పరీక్ష చేసినట్లు నిపుణుడైన మెకానిక్ తెలుసుకుంటాడు. అతి చిన్న శబ్దం వచ్చినా యంత్రం సరిగాలేదని కనుక్కొంటాడు. యంత్రం ఆగిపోవడానికి దారితీసే చిన్న ధూళి రవ్వను కూడా కనిపెట్ట గలుగుతాడు. అలాగే మనం బ్రహ్మాండమైన సోవియట్ ధాతు నాడిని ప్రతి రోజు, ప్రతి గంట పరిశీలిస్తూ, రివాజును పట్టుకు పనిచేసే తీరు యెక్కడ కనిపించినా దాన్ని తొలగించాలి, అభివృద్ధి కాటంకమైన ప్రతి దాన్ని సకాలంలో గుర్తించి తొలగించాలి.

నిర్ణయాలు యెలా అమలు జరుగుతున్నయో గట్టిగా అజమాయిషీ వహించవలసిన బాధ్యత పార్టీ సంస్థలది. పార్టీ నిర్ణయాలు ఎలా అమలు జరుగుతున్నయో పార్టీపై కమిటీలకు, పార్టీ సామాన్య సభ్యులకు స్థానిక పార్టీ శాఖలు నివేదించే పనిలో యింకా యెక్కువ క్రమపద్ధతి ఏర్పడాలి.

ప్రజల పనిపైన అజమాయిషీ వహించాలని, నిర్ణయాలు ఆచరణలో ఎలా అమలు జరుగుతున్నాయో పరీక్షించాలని లెనిన్ చెప్పారు. దానిని మనం గుర్తుంచుకొని, పట్టు విడువకుండా అమలు జరపాలి.

ప్రభుత్వ నియంత్రణను బాగుపరచడానికి చాలా కృషి చేయవలసి వుంది. ఇటీవలి కాలంవరకు సోవియట్ కంట్రోలు కమిషన్ల పనిలో పెద్ద పెద్ద లోపాలున్నాయి. అసలు వాటికి ఆచరణతోనూ, ప్రజలతోనూ గట్టి సంబంధాలు లేవు. ముఖ్యంగా పాల్గొని ప్రజలు సహకరించనిదే ప్రభుత్వ అజమాయిషీ సంఘాలు తమ కర్తవ్యాలను నిర్వహించజాలవు.

నిజమైన ప్రజాస్వామ్య సూత్రాల ప్రాతిపదికపైన కమ్యూనిస్టు సమాజ నిర్మాణాల నాయకత్వాన్ని పెంపొందించుకోవడానికి, పార్టీ,ప్రభుత్వ, ప్రజల నియంత్రణ ఒక బలమైన సాధనం; ప్రజలకు కమ్యూనిస్టు చైతన్యం కలిగించడానికి యిదొక చక్కని పాఠశాల. "కార్మికుల, రైతుల అజమాయిషీని మనం ఎలా పునర్నిర్మించుకోవాలి" అనే వ్యాసంలో లెనిన్ యిచ్చిన సలహాను మనం మరింత విస్తృతంగా, నేటి పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని ఉపయోగించుకోవాలి.

నిర్ణయాలు ఎలా అమలు జరుగుతున్నాయో ఖచ్చితంగా సరిచూడడంలో ప్రజల అజమాయిషీ; విమర్శ; ఆత్మ విమర్శ సూత్రాన్ని బాగా ఆచరణలో పెట్టడాన్ని సాధ్యపరిచే పద్ధతి. మన జీవితంలో నూతన శక్తులు ఉద్భవిస్తున్నాయి, ఇవి కమ్యూనిస్టు సమాజపు మొలకలు. వాటిని మనం అతి జాగ్రత్తగా పెంచాలి. కమ్యూనిస్టు భూమిలో కలుపు మొక్కలను, పనికిరాని గడ్డినీ ఏరి పారవేయాలి. కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించే మహా యోధుల సృజనాత్మక కార్యకలాపాలను పెంపొందించాలి.

పార్టీ నాయకత్వాన మన ప్రజలు అద్భుత విజయాలను సాధించారు. ఆ విషయం అందరికి తెలుసు. ఇవన్నీ సోవియట్ ప్రజలకు సంతోషాన్ని కలిగిస్తాయి. భవిష్యత్తులో తాము మరింత విజయవంతంగాను, వేగం

గాను ముందుకు పోగలమన్న విశ్వాసాన్ని ప్రజల్లో కలిగిస్తాయి.

అహంభావానికి, ఆత్మ సంతృప్తికి ఎప్పుడూ అవకాశం ఇవ్వవద్దని లెనిన్ పార్టీకి బోధించారు. పనిలో జరిగిన లోపాలను, వచ్చిన విజయాలను చూడవలసిందిగా ఆయన కోరారు. అపరిష్కృతంగా వున్న సమస్యల పరిష్కారానికై కేంద్రీకరించి కృషిచేయాలన్నారు. మనకలాంటి సమస్యలింకా చాలా వున్నాయి. పార్టీ, ప్రభుత్వ సంస్థల పనిలో అనేక లోపాలను ఇంకా మనం సరిదిద్దుకోవలసి వుంది.

ఆర్థికాభివృద్ధి, ప్రజల జీవన ప్రమాణాలు పెరిగేందుకై మనం నడుంగట్టి పనిచేయాలి, వ్యవసాయోత్పత్తి యింకా పెరగడానికి, గృహ నిర్మాణ పథకాలు పూర్తి కావడానికి, అర్థిక వ్యవస్థకు చెందిన అన్ని శాఖలలోను శ్రమ ఉత్పత్తి శక్తి పెరగటానికి, మరింత మేలిరకం వస్తువులను ఉత్పత్తి చేయడానికి, ముఖ్యంగా వాడకపు వస్తువుల అభివృద్ధిని సాధించడానికి మనం పోరాడటం అవసరం.

నూతన, అభివృద్ధికరమైన పద్ధతులను మనమెంత ఎక్కువగా బల పరచి, వాటిని ఉత్పత్తిలో ప్రవేశపెడితే; లోపాలను బట్టబయలు చేయడంలోను, వాటిని తొలగించడంలోను మనమెంత గట్టిగా వ్యవహరిస్తే; మన కర్తవ్యాలు అంత త్వరగా నెరవేరుతాయి. కమ్యూనిస్టు సమాజ నిర్మాణ ఆశయం లక్షలాది ప్రజల ఆశయం, సర్వప్రజల ఆశయం.

పార్టీ కార్యకలాపాలన్నిటిలో పార్టీ వెంట సోవియట్లు, ట్రేడ్ యూనియన్లు, యువ కమ్యూనిస్టు లీగ్, సహకార సంఘాలలాంటి శ్రామిక ప్రజాసంఘాలు నడుస్తున్నాయి.

అధికారానికై ప్రజలు సాధించిన విప్లవ పోరాట జ్వాలల్లో సోవియట్లు ఉద్భవించాయి; అవి యీనాడు సమగ్రమైన ప్రజాసంస్థలుగా, వారి ఐక్యతా రూపంగా రూపొందాయి. లక్షలాది ప్రజల కార్యకలాపాలకవి పాఠశాలలుగా రూపొందాయి; మానవ అభివృద్ధి అంతటిలో యిలాంటి వెన్నడూ గోచరం కాలేదు.

మన సమాజం గొప్ప ప్రజాస్వామిక స్వభావం కలదనడానికి, సోవియట్ల కార్యకలాపాలన్నీ ధృవపరుస్తున్నవి. సోవియట్లలో ప్రతినిధుల మొత్తం సంఖ్య ఇప్పుడు సుమారు 20 లక్షలన్న విషయమే చాలు, దాని ఘనతను గురించి వేరే చెప్పనక్కర లేదు. ఈ ప్రతినిధులకు తోడు, మన సోవియట్ల స్థాయీ సంఘాల్లో, 20 లక్షలకు పైగా చురుకుగా పనిచేసేవారున్నారు. తన నిజమైన ప్రజాస్వామిక, ప్రజాభిమాన స్వభావాన్ని యీ విధముగా ధృవపరచగలిగిన సాంఘిక వ్యవస్థ మరొకటి లేదు. ప్రజలతో సంబంధాలను సోవియట్లు యింకా దృఢంచేసుకోవాలి; ప్రభుత్వ పరిపాలన, ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధికి సంబంధించిన సమస్యలపట్ల ఎక్కువ శ్రద్ధ వహించాలి.

ప్రస్తుత సోవియట్ దేశ రాజ్యాంగాన్ని ఆమోదించుకొన్న తర్వాత గడచిన 25 సంవత్సరాల్లోను, మన దేశంలో గొప్ప మార్పులు వచ్చాయి. తన అభివృద్ధిలో, మన దేశం నూతన దశకు చేరుకొన్నది; సోషలిస్టు ప్రజాస్వామ్యం ఉన్నత స్థాయిని అందుకొన్నది. సమగ్రమైన కమ్యూనిస్టు సమాజ నిర్మాణ కాలంలో సోవియట్ సమాజ జీవితంలో వచ్చిన నూతన లక్షణాలను సోవియట్ నూతన రాజ్యాంగం ప్రతిబింబించాలి. దానిని విస్తృతపరచడానికి మనం పని ప్రారంభించ బోతున్నాము.

నేటి పరిస్థితుల్లో ట్రేడ్ యూనియన్ల పాత్ర, ప్రాధాన్యం ఎక్కువగా పెరుగుతున్నది. కార్మిక ప్రజల ముఖ్య ప్రయోజనాలకు సంబంధించిన సమస్యను పరిష్కరించడంలో ట్రేడ్ యూనియన్ల హక్కులను, కర్తవ్యాలను 20వ మహాసభ తర్వాత బాగా విస్తృత పరచడమైంది. సోవియట్ ట్రేడ్ యూనియన్ల సభ్యత్వం ఆరు కోట్లకు పెరిగి వున్నది. కార్మిక ప్రజలకవి చైతన్యాన్ని, పరిపాలనా దక్షతను, నిర్వహణను అందించే పాఠశాలలు, అవి కమ్యూనిజం పాఠశాలలు. ట్రేడ్ యూనియన్ల కార్యకలాపాల్లో, కమ్యూనిస్టు సమాజ నిర్మాణ కార్యక్రమాన్ని అమలు జరిపే పోరాటం, నేటి దశలో ముందుగా జరుగవలసి వుంది. కార్మికుని పట్ల శ్రద్ధ,

ట్రేడ్ యూనియన్‌ల ప్రధాన బాధ్యత, కర్తవ్యం.

ట్రేడ్ యూనియన్ పనిలో సాంప్రదాయ సూత్రాలను మన ట్రేడ్ యూనియన్‌లు అనుసరించాలి; దానికి కొత్త తరహా కమ్యూనిస్టు రూపాలతో, పద్ధతులతో పుష్టిని చేకూర్చాలి; కార్మికులను ఉత్పత్తికి సంబంధించిన యాజమాన్యంలోకీ, సమాజ వ్యవహారాలన్నింటిలోకీ ఆకర్షించాలి.

కమ్యూనిజం వైపుకు సోవియట్ సమాజం పురోగమించేకొలదీ ట్రేడ్ యూనియన్‌ల కార్యకలాపాలు విస్తరించుతాయి. పర్యవసానంగా గతంలో ప్రభుత్వ సంస్థలు చూస్తోన్న కొత్త సమస్యలు వాటి పరిధిలోకి వెళ్ళుతాయి. ఆర్థిక వ్యవహారాల నిర్వహణలో ట్రేడ్ యూనియన్‌ల కార్యకలాపాలు పెరిగేందుకు మన పార్టీ కృషి చేస్తుంది: ప్రత్యేకించి ఉత్పత్తి స్థాయీ సమావేశాలను, పరిశ్రమల పనిని మెరుగు పరిచేందుకుపయోగపడే అధికతర పటిష్ఠవంతమైన సంఘాలుగా మార్చడంలో మన పార్టీ కృషి చేస్తుంది.

కార్మికుల్లో కమ్యూనిస్టు చైతన్యాన్ని పెంపొందించడంపైన, కమ్యూనిస్టు పద్ధతుల్లో శ్రమ చేయడంలో అనుకరణ జరిగేటట్టు సమీకరించడం పైన; ప్రభుత్వ, ప్రజా కార్యకలాపాలను నిర్వహించుకొనడంలో ప్రజలకు అనుభవాన్ని సంపాదించుకునేటట్టు చేయడంపైన ట్రేడ్ యూనియన్‌లు యెక్కువ శ్రద్ధ వహించాలని నొక్కి చెప్పబడాలి.

పని రూపాలను, పద్ధతులను మెరుగు పరచుకొనవలసిన కర్తవ్యం ట్రేడ్ యూనియన్లకు ఎదురౌతున్నది. ట్రేడ్‌యూనియన్‌లలో జీతాలతో పని చేసేవారి సంఖ్య తగ్గేటట్టుగా ట్రేడ్, యూనియన్లలో ఐచ్ఛికంగా పని చేయాలన్న సూత్రం సాధ్యమైనంత యెక్కువగా అమలు జరుపబడడం, మన దేశ పరిస్థితులకీత్యా ఎంతో అవసరం. ఈ సూత్రాన్ని ఎంత ఎక్కువగా ఆచరించితే, అంత యెక్కువ చురుకుగా సమాజ కార్యకలాపాల్లో కార్మికులు పాల్గొంటారు.

మన అద్భుతమైన లెనినిస్టు యువ కమ్యూనిస్టు లీగ్ (కాంసొమోల్) కార్యకలాపాలను మనమంతా ఎంతో మెచ్చుకొంటాము. మన పార్టీకిది గొప్ప క్రియాశీలకమైన సహాయకారి. మనలో చాలమంది జీవితాలు దానితో ముడివడి వున్నాయి. చాలమంది కమ్యూనిస్టులు కాంసొమోల్ లో శిక్షణ పొందినవారే. కాంసొమోల్ మన భవిష్యత్తు, మన నిధి. సోషలిస్టు సమాజ నిర్మాణం అన్ని దశల్లోను, పార్టీ నిర్ణయించిన కర్తవ్యాలను తాము స్పష్టంగా అర్థం చేసుకొన్నట్లు కాంసొమోల్, సోవియట్ యువజనులు రుజువు చేసుకొన్నారు. ఉత్తమ విప్లవ సాంప్రదాయాలకు తాము నిజమైన వారసులమని, తమ పని ద్వారా వారు నిరూపించుకొన్నారు. తమ తలిదండ్రుల ఉజ్వల ఆశయాన్ని వారు సాగించుతున్నారు.

కాంసొమోల్, సోవియట్ యువజనులు సాధించిన అద్భుత విజయాలను వివరించడం కష్టం. తమ యువజనులను చూసి మన ప్రజలు గర్విస్తున్నారు; అది సరైందే.

బాల సంఘంలో బాల లెనినిస్టులు నిరంతరం పెరుగుతూ వున్నారు. ప్రేమాదరాలతో యీ బాల లెనినిస్టులకు శిక్షణనిచ్చే బాధ్యతను కాంసొమోల్‌కు పార్టీ అప్పజెప్పింది; జీవితంలో వచ్చే ఇబ్బందులన్నింటిని ఎదుర్కొన గలగేటట్టుగా వారికి శిక్షణ నివ్వమంది.

పాత భావాలతో, పాత అలవాట్లతో మన దారికి అడ్డుపడాలని పాత ప్రపంచం నిరంతరం ప్రయత్నిస్తూనే వుంటుందని, మనం మరువ రాదు. కొంతమంది యువజనులు పాడుపడిన పాత భావాలతో నిండివున్నారన్న వాస్తవాన్ని మనం గమనించకుండా వుండరాదు. అనాకరిక భావాలకూ, బూర్జువా సిద్ధాంతాల అవినీతి ప్రభావానికి, వారు లోనవుతారు.

కార్మికుల, కర్షకుల, మేధావుల అత్యంత శ్రద్ధాయుతమైన శ్రమ యొక్క దృష్టాంతాలను పేర్కొని, విప్లవ పోరాట వీర సాంప్రదాయాలలోనూ, మార్క్సిజం-లెనినిజం మహత్తర భావాలలోనూ యువజనులకు శిక్షణ-లెనినిస్టు యువ కమ్యూనిస్టు లీగ్ ముఖ్య కర్తవ్యం యిటువంటిది.

యువజనులకు అద్భుతమైన అవకాశాలేర్పడుతున్నాయి. ఉన్నతమైన, ఆసక్తిదాయకమైన లక్ష్యాలు వారి ఎదుట ఉన్నాయి. సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమం, వారి విశాల భవిష్యత్తుకు కవాటాలు తెరుస్తున్నది కమ్యూనిస్టు సమాజ నిర్మాణం—దృష్టిలో వుంచుకొనడానికి ఎంతటి గొప్ప, అద్భుతమైన లక్ష్యమిది! అయితే, కమ్యూనిస్టు సమాజ నిర్మాణమంటే, ప్రప్రథమంగా ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి పరచడం; భౌతిక, ఆత్మిక విలువల ఉత్పత్తి పెంచడం; కమ్యూనిస్టు సమాజ సభ్యునికి వుండవలసిన గుణాలను ప్రతి ఒక్కరిలో పెంపొందించడం. మన సహజ సంపద వృద్ధి పరచడంలోను, పరిశ్రమలు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు, నగరాలు నిర్మించడంలోనూ సహాయపడవలసిందిగా యువకులకు విజ్ఞప్తి చేయబడుతున్నది. సంపదకు స్థావరాలు మాస్కో, లేక లెనిన్‌గ్రాద్ పరిసర ప్రాంతాలు కావు. తైగా, తదతర పర్వత, ఎడారి ప్రాంతాలలో సంపద ఉంటుంది. ఈ సంపద ప్రజలకోసం ఉపయోగించాలంటే, దానిని భూమినుండి బైటికి తియ్యాలి.

మాస్కో, లెనిన్‌గ్రాడ్, కీవ్, గోర్కీ నగరాలకు చెందిన యువకులు, అలాగే యింకా పురాతన స్థలాలకు చెందిన యువకులంతా నూతన సంపదను మన ప్రజలకందించేందుకై ధైర్యంగా ముందుకు రావాలి. ఎక్కడ మనిషి నివసిస్తాడో ఎక్కడ మానవుడు శ్రమచేస్తాడో అక్కడ సకలం వుంటుంది. "మనస్సుంచి శ్రమచేస్తే మానవుడెంతటి మహత్కార్యాలనైనా సాధించవచ్చు," అని నెక్రసోవ్ ఒకప్పుడు చెప్పారు. నెక్రసోవ్ కాలంలో గునపం, పార, రంపం, గొడ్డళ్ళతో మనుషులు పని చేసేవారు. నేడు సోవియట్ యువకులు దేశంలోని నిర్మాణ ప్రదేశాలకు లోతైన పరిజ్ఞానంతో, అతి నవీన యంత్ర పరికరాలతో సాగుతున్నారు. మన దేశంలో వారు గతంలో గొప్ప కృషిచేశారు. ఇకముందు కూడా యింకా చాలా ఎక్కువ చేస్తారు. అందుకు యువజనులను కమ్యూనిస్టు సమాజ నిర్మాణ పథకాలు ఉత్తేజపరుస్తాయి.

కాంసామోల్‌లోను, సోవియట్ యువజనుల్లోను పార్టీకి విశ్వాసం ఉన్నది. కమ్యూనిజం నిర్మాణ ప్రదేశాలలో పనిచేయడానికి సాగిపొండి: —అని మన యువజనులకు విజ్ఞప్తి చేస్తోంది.

## 3. పార్టీ సైద్ధాంతిక కార్యకలాపాలు; నిత్య జీవితంలో ప్రజలతో సంబంధాల పటిష్ఠత. కమ్యూనిస్టు నిర్మాణం, విప్లవ సిద్ధాంత అభివృద్ధి.

కామ్రేడ్స్, మార్క్సిజం-లెనినిజం సృజనాత్మక అభివృద్ధికి 20వ మహాసభ విస్తృతావకాశాలను కల్పించింది. ఆ మహాసభ అనంతరం గడిచిన ఏళ్ళలో, సిద్ధాంత కృషిలో లెనిన్ సూత్రాలను పార్టీ పునఃస్థాపించి అభివృద్ధిపరచింది. కమ్యూనిస్టు సమాజనిర్మాణానికి సంబంధించిన తక్షణ సిద్ధాంత సమస్యలను విజయవంతంగా పరిష్కరించింది. వ్యక్తిపూజ దుష్ఫలితాలను తొలగించిన తర్వాత, నేటి అవసరాలకు తగినట్లుగా సిద్ధాంత కృషిని నవీనం గావించింది; సిద్ధాంత, ఆచరణల ఐకమత్యాన్ని పటిష్ఠం చేసే విధానాన్ని పార్టీ అనుసరించింది. శాస్త్రీయ, మార్క్సిస్టు-లెనినిస్టు ప్రాతిపదికపైన తన విధానాన్ని పార్టీ రూపొందించుకొన్నది; కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి సంబంధించిన నిర్దిష్ట సమస్యల పరిష్కారం కోసం, తన సర్వ సిద్ధాంత, తాత్విక, అధ్యయన కృషిని వినియోగించింది.

మార్క్స్, ఏంగెల్స్ రచనలు రెండవసారి ప్రచురింపబడ్డాయి. లెనిన్ సంపూర్ణ రచనలు ఐదవసారి ప్రచురింపబడ్డాయి. పార్టీ నిర్ణయాల సంపుటి, సమగ్రంగా పత్రాల ఆధారంతో లెనిన్ జీవిత విశేషాల సంపుటి, సిద్ధాంతాలకు సంబంధించిన అనేక పుస్తకాలు, గ్రంథాలు, సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ చరిత్ర, తత్వశాస్త్రం, రాజకీయ ఆర్థిక శాస్త్రం, అంతర్యుద్ధ చరిత్ర, దేశభక్తియుత మహాయుద్ధ చరిత్ర ప్రచురింపబడ్డాయి. తాత్విక, సిద్ధాంత కృషిని ముందుకు తీసుకుపోవడంలో వీటికి చాల ప్రాధాన్యముంది. కేంద్ర కమిటీ నిర్ణయంపై అనేక సంపుటాలలో సోవి

యిట్ దేశ కమ్యూనిస్టు పార్టీ చరిత్ర రచనకై పని ప్రారంభమైంది. కమ్యూనిజం విజయానికై పోరాటంలో పార్టీ, సోవియట్ ప్రజలు పొందిన అనుభవాలను ఆ గ్రంథం సమీక్షిస్తుంది.

చరిత్ర నిర్మాణంలో ప్రజల చైతన్యవంతమైన పాత్ర పెరుగుతుందన్న లెనిన్ సూత్రీకరణ ఆధారంగానే పార్టీ ముందుకుపోతున్నది. అత్యంత ముఖ్యమైన, తక్షణ సమస్యలన్నింటిపైన, ప్రజలతో పార్టీ సంప్రదిస్తుంది. పార్టీ సంస్థలు సాగించే సిద్ధాంత కృషి కమ్యూనిస్టు చైతన్యాన్ని ప్రజల శ్రమ, రాజకీయ కార్యకలాపాలను ఎక్కువ చేస్తాయి: కమ్యూనిస్టు సమాజ నిర్మాణంలో అత్యంత ముఖ్యమైన, శాశ్వత సంచాలకమైన హంశంగా పనిచేస్తాయి.

ప్రజల్లో పార్టీ తాత్విక ప్రభావం లోతుగాను, విస్తృతంగాను కలిగించడంలో రాజకీయ శిక్షణ, ఉపన్యాసాలు. ప్రజలకు రాజకీయ, సంస్కృతీ బోధనా కార్యక్రమాలు. పత్రికలు. రేడియో. టెలివిజన్. సినిమా. సాహిత్యం. కళలు పెద్ద పాత్రను నిర్వహించాయి. గత 5 సంవత్సరాలలో దిన వార్తాపత్రికల రోజువారీ చెలామణీ రెండుకోట్ల ప్రతులు పెరిగింది: పత్రికల సంవత్సరపు చెలామణీ 41 కోట్ల 70 లక్షల ప్రతులు పెరిగింది. ప్రపంచంలో ఏ యితర దేశంలోను ముద్రించబడనంత సంఖ్యలో పుస్తకాలు సోవియట్ యూనియన్‌లో ముద్రితమవుతాయి. కాడ్రేడ్స్, సోషలిస్టు సంస్కృతిని అభివృద్ధి పరచడంలోను, కమ్యూనిస్టు సిద్ధాంతాలను వ్యాపింప చేయడంలోను, అత్యద్భుత విజయాలను పార్టీ ఆ విధంగా సాధించింది. ప్రచారం. ఆందోళన సాగించేవారిని, శాస్త్రీయ, విద్యా, సాంస్కృతిక రంగాలలో పనిచేసే కార్యకర్తలను, ఆ సిద్ధాంత ప్రచార కార్యకర్తల మహా సైన్యాన్ని, మార్క్సిస్టు-లెనినిస్టు భావాల విజయానికై వీరోచితంగా పోరాడే యోధులను సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ, ప్రజలు గౌరవించుతారు.

శ్రామిక ప్రజలను సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ నూతన

కార్యక్రమాన్ని కూలంకషంగా వివరించి చెప్పడం నేటి సిద్ధాంత కృషిలో అగ్రస్థానం వహిస్తుంది; కమ్యూనిజం విజయానికై సాగే పోరాట మహా పథకాన్ని ఈ కార్యక్రమం పార్టీకి, మొత్తం ప్రజలకు అందజేస్తుంది. మన నూతన కార్యక్రమం, ప్రజలకు కమ్యూనిజం భావనను బోధించడానికి తోడ్పడుతుంది. మన ప్రచారంలోను, ఆందోళనలోను పార్టీ కార్యక్రమం అత్యంత శక్తివంతమైన ఆయుధమని లెనిన్ చెప్పారు. "కార్యక్రమంలోని ప్రతి భాగాన్ని, ప్రతి కార్మికుడు తెలుసుకోవాలి, నేర్చుకోవాలి, అర్థంచేసుకోవాలి,"* అని లెనిన్ చెప్పారు.

సిద్ధాంత కృషి ఒక్కటే ఒక లక్ష్యం కాదు; కమ్యూనిస్టు సమాజ నిర్మాణ ప్రాథమిక కర్తవ్యాలను నెరవేర్చడానికదొక ముఖ్యమైన సాధనం. ఇప్పటి పరిస్థితులలో సిద్ధాంత అధ్యయనం సమర్థవంతంగా, ఉన్నతమైన స్థాయిలో చేయడం అవసరం.

కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి సోవియట్ ప్రజలంతా, అక్షరాలా స్త్రీ, పురుషులంతా యెక్కువగా శ్రమించి కృషిచేయడం అవసరం. శ్రమ లేకుండా సౌభాగ్యవంతమైన సమాజం ఉద్భవించజాలదు; మానవునికి సంక్షేమ, సౌఖ్యాలు కలగవు; జీవితంలో మంచి వస్తువులెన్నడూ స్వర్గం నుండి ఊడిపడవు. ఈ విషయాన్ని పనిచేసే స్త్రీ, పురుషులంతా గ్రహించాలి; కమ్యూనిస్టు సమాజ నిర్మాణ జాతీయ లక్ష్యానికి ప్రతి ఒక్కరూ తమ శక్తికొలదీ తోడ్పడాలి.

తేనెటీగలు ఎంత పరిశ్రమ చేస్తాయో మీకు తెలుసు; ప్రతి తేనెటీగ తేనె పట్టులోకి తన బొట్టు పూదేనెను తీసుకొస్తుంది. అలాగే సోవియట్ సమాజాన్ని ఒక పెద్ద కమ్యూనిస్టు తేనెపట్టు అనుకుందాం. ప్రతి ఒక్కరూ తమ శ్రమ శక్తిద్వారా జాతీయ సంపదను మన సమాజంలో పెంపొందించాలి, కొంతకాలానికి అన్ని అవసరాలు మనం తీర్చుకోగలుగుతాము. తేనె పట్టులో తేనె చేయనటువంటి మగ ఈగలుంటాయి.

* వి.ఇ. లెనిన్, రచనల సంకలనం, 4వ రష్యన్ ముద్రణ, సంపుటం 29, పుట 168.

వాటిని తేనెటీగలు, తేనెటీగలను పెంచే వ్యక్తి బయటకి నెట్టాలని ప్రయత్నిస్తాయి. అలాగే సమాజంపై బడి బతకాలనేవారు, అందుకు ప్రతిఫలంగా ఏమీ సమాజానికి యివ్వకుండా ఉండాలనుకొనేవారు మన సమాజంలో కూడా ఉన్నారు. కమ్యూనిజమంటే పని చెయ్యకుండా, నిర్వ్యాపారత్వంగా జీవించే సమాజమని భావించేవారు యింకా మనలో కొందరు ఉన్నారు. ఏక పక్షంగా, అతి క్లుప్తంచేసి భావి సమాజం గురించి తరచు చెప్పడం, యీ ప్రచారం పుస్తకాలలో కూడా జరగడం దురదృష్టకరం. కమ్యూనిస్టు సమాజంలో మనిషి విత్తనాలు చల్లనవసరం లేదని, పంటను కోయనవసరం లేదని, చేసేదల్లా సుఖంగా తినడమేనని భావించేవారు ఉన్నారు. కమ్యూనిజం గురించి ఇలాంటి అభిప్రాయం కలిగి ఉండడం, ఆత్మవికాసం లేనివారికీ, అనాగరికులకు, పరశ్రమోపజీవులకూ సహజ గుణం.

కమ్యూనిజం, శ్రమ రెండూ ఒకదాని ప్రక్కనే మరొకటి ప్రయాణం చేస్తాయి. కమ్యూనిస్టు సమాజంలో కూడ "పని చేయనివాడు తినడం కూడా మానివేయవలసి వుంటుంది" అనే గొప్ప సూత్రం అమల్లో ఉంటుంది. వాస్తవంలో అది అందరికీ పవిత్రమైన సూత్రంగా రూపొందుతుంది. మానవుడికి అందం, కీర్తి తన పనినుండి, తాను చేసిన దానినుండి, తను సృష్టించిన దాన్నుండి, తాను నిర్వహించినదాన్నుండి వస్తాయి. ప్రజల శక్తి, సామర్థ్యాలు, ప్రజ్ఞా విశేషాలు, మానవుల ప్రతిభ వారి శ్రమద్వారానే బయటికి వస్తాయి; మానవుని అమరత్వం అతని శ్రమ శక్తిలోనే వున్నది.

తన జీవిత కృషిలో మానవునికి శిక్షణ, శ్రమ ద్వారా ప్రజలను చేయనేర్పడం, శ్రమ అంటే ఒక ముఖ్యావసరంగా భావించేట్లు ప్రేమాభిమానాలు ప్రజలలో నెలకొల్పడం కమ్యూనిస్టు విద్యా రంగములో కృషికి వెన్నెముక, కీలకం.

నూతన మానవుణ్ణి రూపొందించడం చాల క్లిష్టమైనపని, అందుకు చాలకాలం పడుతుంది. పెట్టుబడిదారీ మనస్తత్వం నుండి కమ్యూనిస్టు

భావాలకు ప్రజలను యాంత్రికంగా మార్చలేము. పెట్టుబడిదారీ దురభి ప్రాయాలల్లో కూరుకపోయివున్న వ్యక్తిని కమ్యూనిజంలోకి తీసుకొనిరావ డానికి సాధ్యపడదు. పాత భావాల బరువునుండి మొదట్లో ఆ వ్యక్తిని విముక్తి చేసే జాగ్రత్తలు తీసుకోవాలి. పెట్టుబడిదారీ అవశేషాలను ప్రజల మనస్సులనుండి తొలగించడానికి, శతాబ్దాలనుండి వస్తున్న లక్షలాది ప్రజల ఆచారాలు, అలవాట్లను మార్చడానికి, అంటే మన విప్లవంతో ప్రారంభమైన పరిణామాన్ని పూర్తిచేయాలంటే కాలం, కృషి అవసరం. గతావశేషాలు చాల భయంకరమైన శక్తి గలవి; అవి ప్రజల మనస్సు లను బంధించి వేస్తాయి. ప్రజల జీవితాలపైన వాటికి గట్టిపట్టు వుంటుంది. అవి పుట్టడానికి కారణభూతమైన ఆర్థిక పరిస్థితులు రద్దయిపోయిన తర్వాత చాలకాలంవరకు కూడ అవి — ప్రజల జీవితాలనూ, మనస్సులనూ విడిచి వెళ్ళవు.

బద్ధకం, ఇతరుల మీదపడి జీవించడం, త్రాగుడు, రౌడీయిజం, వంచన, డబ్బును గుంజుకొనడం, జాత్యాధిక్యతా దురహంకారం, స్థానిక జాతీయ తత్వం, దురధికార పద్ధతులు, స్త్రీల పట్ల తప్పుడు వైఖరి మొద లైన పెట్టుబడిదారీ అవశేషాలకు వ్యతిరేకంగా కమ్యూనిజం నిర్మాణపు ప్రస్తుత దశలో మరింత గట్టి పోరాటాన్ని కొనసాగించాలి. ఇవన్నీ కలుపు మొక్కలు; వీటికి మన పొలాల్లో స్థానం వుండరాదు.

కమ్యూనిస్టు విద్య అంటే మత దురభిప్రాయాలూ, మూఢ నమ్మ కాలు మనసునుండి తొలగిపోవడమన్నమాట. తమ సృజనాత్మక శక్తి సామర్థ్యాలను సంపూర్ణంగా ప్రదర్శించకుండా యివి కొందరు సోవియట్ ప్రజలకు అడ్డుపడుతున్నాయి. శాస్త్రీయమైన నాస్తిక ప్రచారాన్ని మరింత గట్టి పద్ధతిలో కొనసాగించడం అవసరం. ప్రజలలోని అన్ని బృందాలకు, సమూహాలకు అందేటట్లుగా ఆ ప్రచారం వుండాలి. మత భావాలు, ముఖ్య ముగా పిల్లలు, యువజనుల్లో వ్యాపించకుండా చూడాలి.

ప్రజల మనస్సుల్లో వున్న పెట్టుబడిదారీ విధాన అవశేషాలను

నిర్మూలించాలన్న విషయాన్ని మరచిపోరాదు. ప్రపంచ సోషలిస్టు, పెట్టుబడిదారీ విధానాల మధ్య జరిగే తీవ్రమైన సిద్ధాంత పోరాటంలో చైతన్యం పొందిన నూతన మానవుణ్ని సృష్టించాలన్న లక్ష్యాన్ని మరువరాదు. సోవియట్ ప్రజల మనస్సుల్లో బూర్జువా నైతిక సూత్రాలను, దురభిప్రాయాలను నిలబెట్టాలని, పునరుద్ధరించాలని సామ్రాజ్యవాద సిద్ధాంత కర్తలు తాము చేయగలిగిందల్లా చేస్తున్నారు; ఆ విధంగా కమ్యూనిజం వైపుకు మన పురోగతిని నిరోధించడానికి యిలా చేస్తున్నారు.

నూతన మానవుడుగా రూపొందడానికవసరమైన చైతన్యాన్నివ్వడందుకు గొప్ప కృషి అవసరం; అందుకు తెలివైన పద్ధతిని అనుసరించాలి. మనం మానవులతో వ్యవహరిస్తున్నాం. మానవునిలో వున్న ప్రతి ఒక్కటి ఒకదానితో ఒకటి హేతుయుతంగా సంబంధం కలిగి వున్నది. ఇది ఒక యంత్రంలో వున్న వివిధ భాగాల మధ్య వున్నటువంటి సంబంధం కాదు. అంతకంటె చాలా క్లిష్టమైంది. ఒకనాడు, స్విర్ విద్యుత్ శక్తి కేంద్రాన్ని నిర్మించుతుండగా మాక్సిం గోర్కీ రాళ్ళనెలా తొలగిస్తున్నారో చూశారు. రాళ్ళ కింద ప్రేలుడు పదార్థాలను కార్మికులుంచారు; పేలింది. కాస్సేపు నీరు పైకి లేచింది. రాళ్ళు పక్కకు పోయాయి. విశాలమైన స్విర్ నది మెల్లగా ప్రవహించడం ప్రారంభించింది. "రాళ్ళన్నిటినీ, గతానికి చెందిన దానినంతటినీ, అజ్ఞానమైన, పశుప్రాయమైన దానినంతటినీ సమాజం నుండి అలాంటి ఒక్క ప్రేలుడు తొలగించివేయగలిగితే, ఎంత అద్భుతంగా వుంటుంది!" అని గోర్కీ అన్నారు. అయితే సమాజపు పునర్నిర్మాణంలో అన్నీ యింకా కష్టమైనవీ, క్లిష్టమైనవీ. మానవ సమాజం సుఖసంతోషాలతో జీవించడానికి అడ్డువచ్చేవాటిని, ఎంతో చమటోడ్చి కృషి చేయందే, ఎంతో మనోక్లేశం పొందనిదే తుడిచిపెట్టలేదు.

గొప్ప ఆదర్శాలతో, ఉన్నతమైన నైతిక సూత్రాలతో కొత్తరకపు పౌరుణ్ని రూపొందించడం, మన పార్టీ సాధించిన చాలా గొప్ప విజయాల్లో ఒకటి. సోవియట్ ప్రజల రాజకీయ, సాంస్కృతిక అభ్యున్నతికి

కమ్యూనిజం పట్ల వారి విధేయతనూ చూచి మన శత్రువులు హడలెత్తి పోతున్నారు. అనేక సంవత్సరాలుగా పార్టీ సాగించిన బోధనా కృషి ఫలితంగా యీ విజయాలు వచ్చాయేగాని, వాటంతట అవి ఊడిపడలేదు. ఎన్నో తరాలనుండి కార్మిక ప్రజలు కలలు కంటున్న, మానవ సంబంధాలకు చెందిన అత్యుత్తమ సూత్రాలను ప్రతిపాదించే స్థితిలోను, అమలు జరిపే స్థితిలోను నేడు మనమున్నాము. ఆ సూత్రాలకు కమ్యూనిస్టు నీతిలో నిర్దిష్టమైన రూపం ఇవ్వబడింది.

కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికై, కమ్యూనిస్టు బోధనకు సంబంధించిన విషయాలు ప్రతి పార్టీ సంస్థయొక్క, ప్రజలయొక్క శ్రద్ధకూ, కార్యకలాపాలకూ కేంద్ర స్థానంలో వుండాలి. సైద్ధాంతిక కృషిని తక్కువ అంచనా వేయడాన్ని, నిర్మాణ కృషినుండి దాన్ని వేరు చేయడాన్ని; అంతం చేయవలసిన సమయం ఆసన్నమైంది. నిర్మాణ, కృషికీ, సిద్ధాంత కృషికీ ఏవిధంగానైనా ఒక దానితో ఒకటికి పోటీపెట్టడం తప్పు, ప్రమాదకరం కూడా. సిద్ధాంత రంగంలో పనిచేసే కార్యకర్త, తన కృషి ఫలప్రదం కావాలని నిజంగా కోరుకొంటే, ప్రజల రాజకీయ కృషి నిర్మాత కావాలి. ఇంకోవేపున, ప్రజలకు నచ్చచెప్పడం, సరైన మార్గంలో వారికి బోధించడం,—యివి సమీకరణ కృషిలోని ముఖ్య పద్ధతులని సర్వదా జ్ఞాపకం పెట్టుకోవాలి. మన కార్యకలాపాలు జయప్రదం కావాలంటే, సిద్ధాంత కృషిలో పెద్ద స్థాయి అవసరం.

కామ్రేడ్స్, విప్లవాత్మక పరివర్తనను సాగించడంలో శాస్త్రీయ కమ్యూనిజం సిద్ధాంతాలను, ఆచరణను కలపి ఒక్కటిగా చేయడంలోనే మన పార్టీ బలం ఇమిడివున్నది. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాన్ని సక్రమంగా మన పార్టీ ఆచరించిందనడానికి, సృజనాత్మకంగా అభివృద్ధి పరచిందనడానికి, సోవియట్ ప్రజలు సాధించిన చరిత్రాత్మక విజయాలే ప్రబల తార్కాణాలు. పార్టీ సిద్ధాంత కృషి, అవకాశాల ప్రాధాన్యత, ఇటీవలి సంవత్సరాల్లో బాగా పెరిగాయి.

మార్క్సు, ఏంగెల్సు, లెనిన్ మహా సిద్ధాంతాలే మన ఆచరణకు మార్గదర్శకంగా వుంటున్నాయి; ఇకమీదట కూడా ఉంటాయి. సర్వాన్నీ జయించే మార్క్సిస్టు-లెనినిస్టు పతాకాన్ని ఉచ్చస్థితిలో నుంచడానికి, పార్టీ కృషిచేస్తూనే వుంటుంది. మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాల నైర్మల్యాన్ని కాపాడడానికి కమ్యూనిస్టు సిద్ధాంతాలకు "కొత్తదనాన్ని" యివ్వాలన్న సాకుతో ఆ సూత్రాలకు వక్రభాష్యాలు చెప్పి, దాని విప్లవాత్మక సూత్రాలకు తిలోదకాలు యివ్వడానికి ప్రయత్నించే రివిజనిస్టులను, పార్టీ ద్రోహులను పార్టీ ఖచ్చితంగా తుడిచి పెడ్తుంది.

వాస్తవ జీవితంలో సరికొత్త సమస్యలు ఉత్పన్నమౌతూ వుంటాయని శాస్త్రీయ కమ్యూనిస్టు సిద్ధాంత కర్తలు ఊహించారు సోషలిజం వైపుకు సమాజ పరివర్తనకు సన్నిహిత సంబంధంతో నిరంతరం విప్లవ సిద్ధాంతాలను కమ్యూనిస్టులభివృద్ధి చేసుకోవలసి వుంటుందని వారూహించారు. మనకాలంలో, సాంఘిక సంబంధాలు త్వరత్వరగా కొత్త రూపం ధరిస్తోన్న, మానవ చరిత్రలో తీవ్ర పరిణామాలు వస్తోన్న దశలో యిది అత్యవసరం, తక్షణావశ్యం. శాస్త్రీయ కమ్యూనిస్టు సిద్ధాంతకర్తలైన ఆ మహా మేధావులిప్పుడు మనతో లేరు. దైనందిన జీవితంలో అనేక సమస్యలు మనకెదురౌతున్నాయి. మార్క్సు, లెనిన్ శిష్యులు వాటికి సమాధానం యివ్వగలగాలి.

ఇది సమగ్రమైన కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించే శకం. దీనిలో సిద్ధాంత విషయాలు అధికతరంగా మనకు ఎదురవుతుంటాయి. వాటన్నింటికి మనం సమాధానాలు పుస్తకాలలోనేగాక, కమ్యూనిస్టు సమాజ నిర్మాణ ఆచరణలో ప్రప్రధానంగా వెతకాలి. ఈ నూతన పరిస్థితుల్లో మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలను వర్తింపజేసి సృజనాత్మకంగా పెంపొందించాలి: నూతన సిద్ధాంత సూత్రీకరణలతోను, నిర్ణయాలతోను మార్క్సిజం-లెనినిజాన్ని పరిపుష్టం చేయాలి. నూతన చారిత్రకానుభవానికి సరిపడకుండాపోయిన సూత్రీకరణలను నేటి పరిస్థితులకు అనుగుణంగా చేయడానికి

ధైర్యం వహించాలి. ఇవి చేయలేకపోతే, మన సిద్ధాంతాల భావానికే మనం విఘాతం కల్పించినవారమౌతాము.

ఏ సూత్రీకరణ కంటె కూడా వాస్తవ పరిస్థితి ఎక్కువ విలువైంది. నేటి పరిస్థితుల కనుగుణంగా సిద్ధాంత ప్రతిపాదనలను తీసుకొనివచ్చి, సమాజ జీవితంలోని మార్పుల కనుగుణంగా వాటిని మార్చాలి. అటు వంటి మార్క్సిస్టు-లెనినిస్టు విప్లవ సిద్ధాంత దృక్పథానికి మన పార్టీ అనేక ఆదర్శాలను సృష్టించింది.

కమ్యూనిస్టు సమాజ నిర్మాణంలోని, అనేక ముఖ్య ప్రశ్నలకూ, ప్రపంచ విముక్తి ఉద్యమంలోని అనేక తక్షణ సమస్యలకు, ప్రస్తుతం మనం సమీక్షించుకొంటున్న కాలం. మన పార్టీ జీవితంలో, నిర్మాణాత్మక పరిష్కార మార్గాలను చూపింది. ప్రస్తుత పరిస్థితులలో కార్మిక వర్గ నియంతృత్వం: సోషలిజంనుండి కమ్యూనిజానికి పరివర్తనకు సంబంధించిన సూత్రాలు; కమ్యూనిస్టు సమాజానికి భౌతిక, సాంకేతిక పునాదిని నిర్మించే పద్ధతులు: కమ్యూనిస్టు సాంఘిక సంబంధాలను రూపొందించడం, నూతన మానవునికి విద్య: పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి పరివర్తనకు వివిధ రూపాలు: సోషలిస్టు దేశాలు కమ్యూనిజంలోకి దాదాపు ఒకేసారి ప్రవేశం: మన కాలంలో యుద్ధ నివారణకు నిజమైన అవకాశం నేటి యుగ స్వభావం—మొదలైనవి వాటిలోని కొన్ని ప్రధాన సైద్ధాంతిక నిర్ణయాలు.

సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ సాగించిన గొప్ప సిద్ధాంత కృషి నూతన కార్యక్రమంలో సంపూర్ణంగా మూర్తీభవించి ఉంది. మన దేశంలో కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి ఆ కార్యక్రమం తాత్విక, ఆర్థిక, రాజకీయ పునాది. ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధిలో సాధించిన చరిత్రక విజయాలకు నూతన కార్యక్రమం తార్కాణం మాత్రమేగాక, పలుముఖాలుగా పార్టీ సాగించిన గొప్ప సిద్ధాంత కృషిని చాటుతున్నది. విప్లవాత్మక సిద్ధాంత అభివృద్ధి, యావత్తు పార్టీకి కర్తవ్యమైంది.

కమ్యూనిస్టు సమాజ నిర్మాణ ఆచరణలో సాధించిన విజయాలు,

సిద్ధాంతాల అభివృద్ధిలో సాధించిన విజయాలు కూడ. ఇటీవలి సంవత్స రాల్లో పార్టీ అమలు జరిపిన పెద్ద పెద్ద సాంఘిక, ఆర్థిక చర్యలను ఈ దృక్కోణంనుండి పరిశీలించాలి. అలాంటి చర్యల్లో పారిశ్రామిక, నిర్మాణ రంగాల యాజమాన్యాన్ని పునర్వ్యవస్థీకరించడం; మెషీన్, ట్రాక్టర్ల కేంద్రాలను పునర్వ్యవస్థీకరించడం, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల పద్ధతి వ్యవస్థను మరింత పటిష్టం చేయడం; ఆర్థిక ప్రణాళికా విధానాన్ని మెరుగు పరచడం; జీవితావసరాల కనుగుణ్యంగా పాఠశాలా కార్యక్రమాలను సవ రించడం; విద్యా పద్ధతులను అభివృద్ధిపరచడంలో మరికొంత పురోగతిని సాధించడంలాంటివి చాలా ఉన్నవి. పార్టీ తీసుకొన్న చర్యలు, సోవియట్ సమాజాన్ని మునుముందుకు తీసుకొనిపోయేందుకు నిజమైన విప్లవాత్మకత గల ముందడుగులు. అదే సమయంలో అవి మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాం తాలకు విలువైన దోహదకారులు. అవి చాల ముఖ్యమైన నిర్ణయాలు కమ్యూనిస్టు నిర్మాణ సూత్రాల దృష్ట్యా అవసరమైనవవి. ఆర్థిక, సాం స్కృతిక రంగాల్లో కొన్ని నాయకత్వ పద్ధతులను మార్చవలసిన అవ సరాన్నిబట్టి పార్టీ సాగింది; ఎందుకంటే అవి గతంలో నిర్మాణాత్మక పాత్ర నిర్వహించి, నూతన పరిస్థితులలో జీవితావసరాల కనుగుణంగా యిప్పుడు లేవు; మన అభివృద్ధిని కూడా కుంటుపరిచి ఉండేవి. ముఖ్య మైన చర్యలను తీసుకొనేటప్పుడు ప్రస్తుత ఆర్థిక, రాజకీయ సమస్యలు పరి ష్కరించవలసిన అవసరాన్నీ, కమ్యూనిజం వైపుకు సోవియట్ యూని యన్ పయనింపుతున్న భవిష్యత్తును పార్టీ దృష్టిలో పెట్టుకొంటుంది.

ఆలోచన కరుడు గట్టి పోవడాన్ని సృజనాత్మక మార్క్సిజం-లెని నిజం హింపదు; వాస్తవ విషయాలకు, వాస్తవ పరిస్థితికి సంబంధంలేని సూత్రీకరణలను పూజించుకొంటూ ఉండడాన్ని సహించదు. వాస్తవ జీవి తంలో పనికిరావని రుజువైన ప్రతిపాదనలను పట్టుకొని వేలాడే ప్రయ త్నాలకంటే, విప్లవ సిద్ధాంత సృజనాత్మక భావానికి విరుద్ధమైంది వేరొకటి లేదు. ఉదాహరణకు చాలాకాలంగా మన ఆర్థిక సారస్వతంలో, యదార్థా

నికి యితరత్రా కూడా ఒక సిద్ధాంతం వున్నది. దాని ప్రకారం సోషలిజంలో ప్రజల కొనుగోలు శక్తి ఉత్పత్తికంటె ఎల్లప్పుడూ ముందుగా వుండాలనీ, యిది పెట్టుబడిదారీ వ్యవస్థలో లేనటువంటి, సోషలిజం ఇవ్వగలిగేటటువంటి ఆర్థిక ప్రయోజనమనీ, మన అభివృద్ధికి మూలశక్తులలో యిదొకటనీ యీ సిద్ధాంతం. ఇది స్పష్టంగా తప్పు ఉద్ఘాటన. మార్క్సిస్టు-లెనినిస్టు ఉత్పత్తి వినిమయ సంబంధాల సిద్ధాంతానికి యిది విరుద్ధం, ఇది స్టాలిన్ చేసిన తప్పు సిద్ధాంతాన్ని విచక్షణారహితంగాను, మూఢ నమ్మకంతోను అంగీకరించినందు వల్ల ఉదయించింది. సోవియట్ యూనియన్‌లో "ఉత్పత్తి పెరుగుదలకంటె ప్రజల వినిమయం (కొనుగోలుశక్తి) నిరంతరం అధిగమించుతూనే వుంటుంద"ని స్టాలిన్ చెప్పారు. తాము ప్రజల జీవితావసర వస్తువుల కొరతను; రేషన్ కార్డు పద్ధతి, ఆ మన స్తత్వం శాశ్వతం కావడాన్ని సమర్థిస్తున్నామన్న దానిని, యీ దృక్పథాన్ని సమర్థించేవారు పట్టించుకోలేదు

సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ ప్రణాలికా బద్ధమైనది. ఉత్పత్తి మొత్తాన్ని, రకాన్ని, నిర్ణయించేటప్పుడు, వస్తువులకొరకు ప్రజల అవసరాలను మనం దృష్టిలోకి తీసుకోవాలి. తీసుకోగలం కూడా. "సమాజంలోని సర్వప్రజల సంక్షేమానికి, సర్వతోముఖాభివృద్ధికి హామీయిచ్చే విధంగా సాంఘిక ఉత్పత్తి క్రమాన్ని ప్రణాళికబద్ధంగా సమీకరించడం సోషలిజం" అని లెనిన్ చెప్పేరు. ప్రజలకొరకు వస్తు సమృద్ధిని సృష్టించడానికి, చాలినంతగా ఉత్పత్తి అభివృద్ధి గతి వుండడం అవసరమని ఆయన అనేక మార్లు నొక్కి చెప్పారు. మన మీ లెనిన్ ప్రతిపాదనల ప్రకారం నడుచుకోవాలి. ప్రజల భౌతిక, ఆత్మిక అవసరాలను పూర్తిగా తీర్చగలిగేందుకు, మన పార్టీ కేంద్రీకరించి కృషి చేస్తున్నది.

మార్క్సిజం-లెనినిజాన్ని సృజనాత్మకంగా అభివృద్ధిచేయడమే మన పార్టీ కార్యకలాపాలన్నింటికీ పునాది, కమ్యూనిస్టు నిర్మాణంలో మన విజయాలకు నిర్ణయాత్మక శక్తి. సిద్ధాంత, ఆచరణలు ఏకం కావాలనే లెనినిస్టు

సూత్రాన్ని అనుసరిస్తూ, మార్క్సిజం-లెనినిజం సూత్రాలను పరిరక్షించడం, సృజనాత్మకంగా అభివృద్ధి పరచడం మన దేశ ప్రజలపట్ల, సమస్త ప్రపంచ కార్మిక ప్రజలపట్ల తన అత్యంత ముఖ్య బాధ్యతగా పార్టీ భావించుతూంది.

కామ్రేడ్స్, కమ్యూనిస్టు సమాజ నిర్మాణ మహత్తర కర్తవ్యాలను గురించి మన మహాసభ చర్చించుతుంది. మహా తాత్వికులు, విప్లవకారులు అయిన మార్క్స్, ఏంగెల్స్, లెనిన్ యీ మహా లక్ష్యసాధనను శాస్త్రీయంగా నిరూపించారు. పార్టీ రాజకీయ, నిర్మాణ, సిద్ధాంత కృషినంతటినీ 22వ మహాసభ తీర్మానాలు, పార్టీ నూతన కార్యక్రమం నిర్ణయించుతాయి.

పార్టీ కృషిలో మన ప్రధాన కర్తవ్యాలేమిటి?

1. ప్రప్రధానంగా కమ్యూనిజం స్థాపన కవసరమైన భౌతిక, సాంకేతిక పునాదిని ఏర్పరచడంలోను, నూతన సాంఘిక సంబంధాలను శ్రేష్ఠం చేయడంలోను, కమ్యూనిస్టు భావనను సోవియట్ ప్రజలందరిలో కలిగించడంలోను, సోవియట్ ప్రజలు కృషి చేసేట్టుగా చేస్తూంది. కమ్యూనిస్టు నిర్మాణంలో సరైన నాయకత్వాన్ని రూపొందించేందుకై పార్టీ, పార్టీ సంస్థలు, కమ్యూనిస్టులంతా కృషిచేయాలి; ఆదర్శవంతంగా ప్రవర్తించాలి; అగ్రశ్రేణిలో నిలబడాలి; కమ్యూనిస్టు నిర్మాణ కృషి అంతట్లో నిర్మాణ, ప్రణాళికా పద్ధతుల స్థాయిని ఉచ్ఛ దశకు తీసుకొనిపోవాలి; ప్రజల సృజనాత్మకమైన చొరవను, వారి కార్యకలాపాలను అభివృద్ధిపరచాలి.

2. సప్తవార్ష ప్రణాళికా లక్ష్యాలను నెరవేర్చడంలోను, శ్రామిక ఉత్పాదన శక్తిని స్థిరంగా పెంచడంలోను, శ్రామిక ప్రజల జీవన ప్రమాణాలను అభివృద్ధి పరచడంలోను పార్టీ కేంద్రీకరించి పనిచేయాలి. ఆర్థిక వ్యవస్థ అన్ని రంగాల సాంకేతికాభివృద్ధికోసం; నూతనంగా కనిపెట్టిన పద్ధతులను, సోషలిస్టు అనుకరణలో అగ్రశ్రేణిలో నున్నవారి పద్ధతులను విస్తారంగా ఆచరణలో పెట్టేందుకూ; కమ్యూనిస్టు శ్రమ ఉద్యమ సర్వతోముఖాభివృద్ధికోసం జరిగే పోరాటానికీ పార్టీ సంస్థలు నాయకత్వం వహించాలి.

3. నూతన కార్యక్రమం, నిబంధనల కనుగుణ్యంగా పార్టీ జీవితంలో లెనినిస్టు ప్రమాణాలను, సమిష్టి నాయకత్వ సూత్రాలను దీక్షగా పార్టీ అనుసరిస్తుంది; పార్టీ శాఖలు పార్టీ సభ్యులు పార్టీకి, ప్రజలకు బాధ్యతను ఎక్కువ ఖచ్చితంగా వహించేటట్టు చేస్తుంది; కమ్యూనిస్టు లందరిలో చురుకుదనాన్ని, చొరవనూ కలిగించడానికి కృషిచేస్తుంది; పార్టీ విధానాన్ని వివరించడంలోను, అమలు జరపడంలోను కమ్యూనిస్టులంతా పాల్గొనేటట్టు చేస్తుంది; విమర్శ, ఆత్మ విమర్శను అభివృద్ధిచేస్తుంది. పార్టీ సామాన్య కార్యకర్తల్లో ఐకమత్యాన్ని బలవత్తరం చేసేందుకు పార్టీ కృషిని సాగిస్తుంది, మార్క్సిజం—లెనినిజం పరిశుద్ధతను కాపాడడానికి కృషిని సాగిస్తుంది, అన్ని రూపాల్లో ప్రదర్శితమయ్యే ముఠాతత్వానికీ, ముఠా చర్యలకు—యీ రెండూ మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ తత్వానికి విరుద్ధమైనవి వ్యతిరేకంగా పట్టు విడువకుండా పోరాడుతుంది.

4. కార్మిక ప్రతినిధుల సోవియట్ల, ట్రేడ్ యూనియన్ల, కాంసోమోల్, తదితర ప్రజాసంఘాల కార్యకలాపాలు విస్తరించడానికి, అభివృద్ధి కావడాని అన్ని విధాల పార్టీ సహకరిస్తుంది; కమ్యూనిస్టు నిర్మాణంలోను, కమ్యూనిస్టు చైతన్యాన్ని కలిగించడంలోను ఆ సంఘాల పాత్ర పెరగడానికి తోడ్పడుతుంది. ప్రజల సృజనాత్మకమైన చొరవను అభివృద్ధి పరచడంలో చేయూతనిస్తుంది; సోవియట్ యూనియన్‌లోని అన్ని జాతుల స్నేహాన్ని దృఢతరం చేసేందుకు పార్టీ కృషిచేస్తుంది. కమ్యూనిస్టు సమాజ నిర్మాణ కర్తవ్యాల స్థాయి, క్లిష్టత పెరుగుతున్నాయి. అందువల్ల నిర్ణయాలు ఎంతవరకు అమలు జరుగుతున్నాయో పరీక్షించేందుకు పార్టీ, ప్రభుత్వ, ప్రజా నియంత్రణను పటిష్టం చేయడం తప్పనిసరి అవుతున్నది. విశాలమైన ప్రజా ప్రాతిపదికపై నియంత్రణా వ్యవస్థను మెరుగుపరచాలి. ఆ విధంగా దాన్ని ప్రజల నిజమైన అజమాయిషీగా మార్చాలి.

5. కమ్యూనిజం విజయానికై సాగే పోరాటంలో తాత్విక కృషి అతి శక్తివంతమైంది; దీనిని ఉన్నత స్థాయికి తీసుకొని పోవాలి. ఆచర

ణిలో ఉద్భవించే నూతన సిద్ధాంత సమస్యలపై కృషిని పార్టీ కొనసాగించు తుంది; మార్క్సిజం, లెనినిజానికి విధేయులుగా సోవియట్ ప్రజలందర్నీ చైతన్యవంతుల్ని చేస్తుంది; బూర్జువా సిద్ధాంతాల రూపాలన్నింటిని సహించకుండా ఉండేటట్టుగా చేస్తుంది; కమ్యూనిజం శత్రువులు సాగించే కుట్రల దృష్ట్యా ప్రజలను యింకా ఎక్కువ రాజకీయ జాగరూకత గలవారిగా చేస్తుంది.

6. సోవియట్ యూనియన్‌లో కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించడం, సకల దేశాల కార్మికుల పట్ల తనకు గల అంతర్జాతీయ విధి నిర్వహణగా పార్టీ భావించుతుంది. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థను, మొత్తం అంతర్జాతీయ కమ్యూనిస్టు, కార్మికోద్యమం ఐక్యతను పటిష్టం చేయడంలో కృషిని నిర్విరామంగా పార్టి కొనసాగించుతుంది. కమ్యూనిస్టు, కార్మిక వర్గ పార్టిలన్నింటితోను సోదర సంబంధాలను మన పార్టి పెంచుకొంటుంది. వాటితోబాటుగా మార్క్సిజం-లెనినిజం పరిశుద్ధత కొరకు, వివిధ అవకాశవాద రూపాలకు వ్యతిరేకంగాను, అత్యంత ప్రమాదకరమైన నేటి రివిజనిజానికి, పిడివాదానికి, ఒంటెత్తు పోకడలకు వ్యతిరేకంగా పార్టి దీక్షతో, పోరాడుతుంది.

మార్క్సిస్టు-లెనినిస్టు మహా సిద్ధాంతం పట్ల విధేయత, ప్రజలతో సంబంధాలూ గతంలోను, ఇప్పుడు భవిష్యత్తులోనూ మన విజయాలకు పునాది, కమ్యూనిజం విజయానికి హామీ!

కామ్రేడ్స్, కమ్యూనిస్టు సమాజనిర్మాణానికై రూపొందించిన బృహత్ ప్రణాళికలను యీ మహాసభ పరిశీలించి, చర్చించవలసి వున్నది. శాంతియుత సృజనాత్మక కృషికొరకూ, బృహత్తర ఆర్థిక, సాంస్కృతిక, అభివృద్ధికొరకు, ఉన్నతమైన జీవన ప్రమాణాల కొరకు యీ ప్రణాళికలు ఉద్దేశించబడ్డాయి. మహత్తర సోషలిస్టు కుటుంబంలోని దేశాలన్నీ ఘనంగా పురోగతిని సాధిస్తున్నాయి. మహోన్నతమైన, స్పష్టమైన అవకాశాలు మన ఎదుట వున్నాయి.

సోషలిజాన్ని, కమ్యూనిజాన్ని నిర్మించుకొంటున్న ప్రజలకు యుద్ధం అవసరం లేదు. లెనిన్ మహాశయునినుండి సంక్రమించిన శాంతియుత సహజీవన సూత్రాన్ని వారు అనుసరిస్తారు, ఆచరణలోకి తెస్తారు.

"లెనినిస్టు శాంతికాముక విదేశాంగ విధానాన్ని దీక్షతో సోవియట్ యూనియన్ అనుసరించుతూనే వుంటుంది: సాంఘిక వ్యవస్థలతో ప్రమేయం లేకుండా అన్ని దేశాలతోను పరస్పర విశ్వాసాన్ని, సహకారాన్ని స్థాపించుకొనడానికి కృషి చేస్తుంది; అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలించడానికి, ఖచ్చితమైన అంతర్జాతీయ నియంత్రణ కింద సార్వత్రిక సంపూర్ణ నిరాయుధీకరణ కొరకు సోవియట్ యూనియన్ కృషి సాగిస్తుం"దని కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ ప్రజల పేరుమీద, ఈ 22వ మహాసభ వేదికనుండి మనం దీక్షతో తెలియ చేస్తున్నాము.

రెండవ ప్రపంచ యుద్ధ అవశేషాలను నిర్మూలించేందుకై, వివిధ దేశాల మధ్య శాంతి, స్నేహాల అభివృద్ధికి ఆటంకమైన వాటినన్నింటినీ తొలగించడానికీ, మరో కొత్త యుద్ధప్రమాదాన్ని తెచ్చిపెట్టే వాటి నన్నింటినీ రద్దు చేయడానికీ నాజీ జర్మనీకి వ్యతిరేకంగా సోవియట్ యూనియన్‌తో కలిసి పోరాడిన దేశాలకూ, ప్రజలకూ మనం గతంలో విజ్ఞప్తి చేశాము, ఇప్పుడు మళ్ళీ విజ్ఞప్తి చేస్తున్నాము. జర్మనీతో శాంతి సంధిని కుదుర్చుకొందామని సోవియట్ యూనియన్ ప్రతిపాదించుతున్నది; దాని ప్రాతిపదికపైన పశ్చిమ బెర్లిన్ సమస్యను పరిష్కరించుకోవాలని చెబుతున్నది. ఇందువల్ల ఇతర దేశాల ప్రయోజనాలకు నష్టమేమీ కలుగదు. వివిధ దేశాల ప్రజల మధ్య శాంతిని బలపరచే లక్ష్యం తప్ప, ఈ ప్రతిపాదనలలో యింకొకటేమీ లేదు. చివరికి హేతుబుద్ధి జయించుతుందని విశ్వసించాలనీ మనకు వుంది.

అగ్రరాజ్యాలవద్ద నేడు అతిభయంకరమైన మారణాయుధాలున్నాయి. అలాంటి ప్రస్తుత పరిస్థితుల్లో యుద్ధ జ్వాలను రెచ్చగొట్టడం చాలా ప్రమాదం, అపరాధం. పరస్పర అవగాహన, సహకారాల కొరకు, ప్రధాన

మైన అంతర్జాతీయ సమస్యలను శాంతియుత పద్ధతులద్వారా పరిష్కరించు కొనడానికై కృషి చేయవలసిందిగా సకల దేశాల ప్రభుత్వాలకు మనం విజ్ఞప్తి చేస్తున్నాము. భూమి పైన శాంతిని రక్షించడానికి, పటుతరం చేయడానికీ, తమ సర్వ శక్తులు వినియోగించి నిరంతరం గట్టి పోరాటం సాగించడం మానవాళి పవిత్ర విధి.

* * *

కామ్రేడ్స్, అక్టోబరు సోషలిస్టు మహా విప్లవ వార్షికోత్సవం రావడానికి ముందర 22వ మహాసభ జరుగుతున్నది. ఈ మహాసభలో పార్టీ నూతన కార్యక్రమాన్ని ఆమోదించుతున్నదంటే, అది సోషలిజం, కమ్యూనిజాల చారిత్రక విజయాలకు నిదర్శనం; అక్టోబరు మహా విప్లవం ఆశయానికది విజయం; అది మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలకు మరొక ఘన విజయం.

44 సంవత్సరాల కిందట మాత్రమే, 1917 విప్లవ దినాలలో సోవియట్ యూనియన్‌కు, ఘోర ప్రమాదం నుండి రష్యాను ఎలా రక్షించడమన్న మార్గాన్వేషణ, కీలక సమస్య ఎదురైంది. అప్పుడు దేశ భవిష్యత్తుకు బాధ్యత స్వీకరించగల పార్టీ రష్యాలో లేదని మెన్షివిక్ నాయకులొకరు అన్నారు. సరిగ్గా అదే సమయంలో, 1917 సంరంభ దినాల్లో, కార్మికవర్గ విప్లవ నాయకుడు, లెనిన్ ధైర్యంగా, సగర్వంగా యావత్ప్రపంచానికీ యిలా ఎలుగెత్తి చెప్పారు:

"అలాంటి పార్టీ వున్నది!"

అధికారాన్ని స్వీకరించడానికి, మన దేశ భవిష్యత్తుకు బాధ్యత వహించడానికి బోల్షివిక్ పార్టీ సిద్ధంగావున్నదని ప్రథమ అఖిల రష్యన్ సోవియట్ల మహాసభలో ప్రసంగిస్తూ కేంద్ర కమిటీ తరఫున లెనిన్ ప్రకటించారు. విప్లవ విజయానికి, సోషలిస్టు పద్ధతుల్లో రష్యాను తీర్చిదిద్దడానికి ఒక దిగ్భ్రమ కలిగించే కార్యక్రమాన్ని లెనిన్ ప్రతిపాదించారు. లెనిన్ చెప్పిన ఆ మహత్తర వాక్కులు ఎంత వాస్తవమో ఇప్పుడందరికీ సుబోధ

కమే. మన పార్టీ గురుతర కర్తవ్యాన్ని మీద వేసుకొన్నది: దేశ భవిష్యత్తు, ప్రజల భవిష్యత్తు బాధ్యతను పార్టీ స్వీకరించింది. కమ్యూనిస్టుల పార్టీ విశాల భుజస్కంధాలు యీ భారాన్ని మోయగలిగినవేనని రుజువు అయింది. దేశాన్ని తీర్చిదిద్దడంలోను; బలమైన, సౌభాగ్యవంతమైన దేశంగా దానిని రూపొందించడంలోను కార్మిక వర్గానికి, సమస్త శ్రామిక జనులకు అగ్రశ్రేణిలో, పార్టీ నిలబడి తాను స్వీకరించిన బాధ్యతలను పూర్తిగా నిర్వహించింది.

ఇది నేడంతా గమనిస్తున్నారు, అంగీకరిస్తున్నారు. అయినప్పటికీ, దేశ ప్రభుత్వాన్ని స్వీకరించడానికి కమ్యూనిస్టుల పార్టీ సిద్ధంగా వున్నదని ఆనాడు లెనిన్ ప్రకటించగా, కమ్యూనిస్టుల పైన ఆనాటి రష్యన్ బూర్జువా పత్రికలు కౄరమైన దాడి సాగించాయి, నవ్వాయి, అవహేళన చేశాయి; రాచరికపు వార్తా పత్రిక "న్యూ టైమ్స్" యిలా వ్రాసింది :

"మాటవరసకు కమ్యూనిస్టులు విజయం పొందారనే అనుకొందాం. మరి మనల్ని పరిపాలించే దెవరు? బహుశా వంటల వాళ్ళేమో! లేకపోతే ఫైర్‌మన్, గుర్రాలసాల పనివాళ్ళు, కొలిమి పనివాళ్ళు. చిన్న పిల్లల తువ్వాళ్ళు ఉతికే కాలం మధ్యను రాజ్య సమితి సమావేశానికి పిల్లల దాదులు ఆదరా బాదరా వెళ్తారేమో! ఎవరు? ఎవరీ రాజకీయవేత్తలు? కమ్యూనిస్టులు చెప్పే దానిప్రకారం దేశాన్ని పరిపాలించే వృత్తి గుర్రాల సాలల్లో పనిచేసేవాళ్ళది, పిల్లల దాదులదీ, వంట మనుషులదీ. అదేమైనా జరిగేదేనా? వొట్టిది. అదసలు సంభవమా? అలాంటి చవట ప్రశ్నకు కమ్యూనిస్టులకు చరిత్ర గట్టి సమాధానం చెబుతుంది."

తప్పకుండా ఆ ప్రశ్నకు చరిత్ర చాల గట్టి సమాధానమిచ్చింది. సోషలిజం. కమ్యూనిజంలను నిర్మించుకొనడంలోను, ఆర్థిక కార్యకలాపాలన్నింటిలోను. శాస్త్రీయ, సాంస్కృతికాభివృద్ధిలోను సోవియట్ ప్రజలు సాధించిన మహత్తర విజయాలు, సృజనాత్మక కృషి. ప్రభుత్వ పరిపాలన కార్మిక జనులకు చేతకాదన్న కట్టుకధను పొగలాగా చెదర కొట్టేశాయి.

ప్రభుత్వ అధికారాన్ని తమ చేతుల్లోకి తీసుకొన్న కార్మిక ప్రజలు—పరిశ్రమల్లో పనిచేసే కార్మికులు, కర్షకులు, గని కార్మికులు, కొలిమి పని కార్మికులు, వంటవాళ్ళు ప్రభుత్వాన్ని యింకా బాగా, యింకా తెలివిగా పరిపాలించుకొనగలరని యీ విజయాలు రుజువుచేస్తున్నాయి. రష్యన్ రాజ్య సమితి సభ్యులు, రాకుమారులు, ప్రభువులు, పెట్టుబడిదారులు, భూస్వాములు—ప్రవాసంలో చెత్త జీవితం గడిపి నశించిపోయిన వారికంటె జయప్రదంగా ఆర్థిక వ్యవస్థనూ, విజ్ఞానాన్నీ, సంస్కృతినీ పెంపొందించగలరని యీ విజయాలు రుజువుచేస్తున్నాయి.

అభ్యుదయ మానవాళికంతకూ సోవియట్ ఉదాహరణ ఉత్తేజాన్నిస్తుంటుంది. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాల గొప్ప పటిష్ఠత యీనాడున్నంత స్పష్టంగా యింతకుముందెన్నడూ లేదు. సోవియట్ యూనియన్‌లో సోషలిజం సంపూర్ణమైన, తుది విజయాన్ని సాధించింది; సోషలిస్టు కుటుంబంలోని దేశాలన్నింటిలోను సోషలిజం నూతన విజయాలను నేడు సాధిస్తున్నది; నేడు ప్రపంచ కమ్యూనిస్టు, కార్మిక ఉద్యమం, వివిధ ప్రజల జాతీయ విముక్తి పోరాటం అతి త్వరితంగా విస్తృతమౌతున్నది. ప్రజల మహాశక్తిని విప్లవం వెలికితీసింది; ప్రపంచాన్ని సోషలిస్టు కమ్యూనిస్టు మార్గాల్లో ఆ మహాశక్తి మార్చివేస్తున్నది. కమ్యూనిజం సాధించిన విజయాల ప్రభావంవల్ల బ్రహ్మాండమైన మార్పులు వస్తున్నాయి; ఇంకా వస్తాయి. కమ్యూనిజం విజయం తథ్యం!

పారిస్ కమ్యూనార్స్ వీరోచిత కార్యాలను ప్రస్తుతించుతూ, ఆకాశాలను ముట్టడించిన వీరులుగా వారిని, తొంభై సంవత్సరాలక్రిందట మార్క్స్ అభినందించారు. పారిస్ కమ్యూన్ యోధులు సాధించిన ఘన కార్యాలకది ఉన్నతమైన అంచనా; విప్లవ పోరాటాని కదొక ఉద్విగ్నమైన పిలుపు. సోవియట్ యూనియన్ ప్రజలు సోషలిజాన్ని స్థాపించుకొని, కమ్యూనిస్టు సమాజ భవనాన్ని ఇప్పుడు విజయవంతంగా నిర్మించుకొంటున్నారు; ఆకాశాలను అలంకారయుతంగానే గాక, అక్షరాలా కూడా సోవియట్ ప్రజలు

ముట్టడిస్తున్నారు. ఇది చెప్పగలుగుతున్నందుకు మనం గర్విస్తున్నాము.

శాంతి, సాంఘిక పురోగతి, ఉజ్వలమైన భవిష్యత్తు, కమ్యూనిజం కొరకై ప్రజలు సాగించే పోరాటంలో కమ్యూనిస్టుల మహాసేన, మార్క్సిస్టు-లెనినిస్టుల మహా సైన్యం అగ్రశ్రేణిలో నిలబడుతుంది. మార్క్సిస్టు-లెనినిస్టు మహాపతాకం కిందకు ఇంకా కోట్లాది ప్రజలు వస్తారు. అభ్యుదయం యొక్క ఆశయం, కమ్యూనిజ ఆశయం జయించి తీరుతాయి!

కమ్యూనిజం నిర్మాతలైన సోవియట్ వీర మహా ప్రజలు చిరకాలం వర్ధిల్లుదురుగాక!

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ప్రజల అవిచ్ఛిన్నమైన ఐక్యత, సోదర స్నేహం చిరస్థాయి అగుగాక!

లెనిన్ మహాశయుడు సృష్టించిన, పోరాటంలో రాటుదేలిన సోవియట్ కమ్యూనిస్టుల వీర పార్టీ వర్ధిల్లుగాక!

అంతర్జాతీయ కమ్యూనిస్టు, కార్మిక ఉద్యమ అచంచల ఐక్యత, సకల దేశాల శ్రామికుల సోదర సంఘీభావం చిరస్థాయి అగుగాక!

ప్రపంచ శాంతి వర్ధిల్లుగాక!

మార్క్సిస్టు-లెనినిస్టు విజయ పతాకంకింద, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన—కమ్యూనిజం విజయానికై ముందుకు పదండి.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B171 |
| పుస్తకం పేరు | పార్టీకీ ప్రజలకూ ఒక వివేదన |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 211 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV, 4 ci |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |